మహిళా ఉద్యమ కరదీపిక

# చైతన్య మానవి



త్రైమాసపత్రిక

జూలై - సెప్టెంబర్ 2015

STOP RAGGING!!






E-mail : helpline@antiragging.in

Help line no. : 1800-180-5522

CI

# మోటూరు ఉదయం ట్రస్టు ఆధ్వర్యంలో కుటుంబ న్యాయ సలహా కేంద్రం ప్రారంభ దృశ్యాలు




ఫ్యామిలీ కోర్టు జడ్జి శ్రీమతి నిర్మల గీతాంబ




ట్రస్టు ఛైర్మన్ ఎస్. పుణ్యవతి



ఉదయం, సూర్యావతి చిత్రపటాలకు నివాళులు
అర్పిస్తున్న వి. కోటేశ్వరమ్మ



నివాళులు అర్పిస్తున్న నాయకురాలు కాట్రగడ్డ జోయ



సీనియర్ న్యాయవాది రాజేంద్రప్రసాద్




ప్రసంగిస్తున్న రాధికా రెడ్డి

సంపాదకీయం...

చైతన్య మానవి

# అమానవీయం

రాజధాని ప్రాంతంలో ఆచార్య నాగార్జునుడి పేరుతో స్థాపించిన విశ్వవిద్యాలయంలో రిషితేశ్వరి నిండు ప్రాణం బలైంది. నారాయణ కళాశాలలో మరో ఇద్దరు అమ్మాయిలు ఉరేసుకున్నారు. కాదు.. కాదు.. ఉరి తీయబడ్డారంటున్నారు. గుంటూరులో ఇంజనీరింగ్ నాలుగో సంవత్సరం విద్యార్థిని ఆత్మహత్య చేసుకుంది. ఇంజనీరింగ్, మెడికల్, ఐఐటి, నిట్ లాంటి అత్యున్నత వృత్తివిద్యా సంస్థల్లో ర్యాగింగ్ భూతం నృత్యం చేస్తున్నది. యూనివర్శిటీ క్యాంపస్‌లలోని వృత్తివిద్యా కళాశాలల్లో సైతం లైంగిక వేధింపులు, ర్యాగింగు పెరుగుతున్నాయి. ఇక రాష్ట్రంలోని రెసిడెన్షియల్ జూనియర్ కళాశాలల్లో ఏటేటా విద్యా కుసుమాలు నేలరాలుతూనే ఉన్నాయి.

2001లో ఉన్నత విద్యాశాఖ ఉపాధ్యక్షురాలు నీరజారెడ్డి ఆధ్వర్యంలో వేసిన కమిటీ విద్యార్థులపై పెరుగుతున్న మానసిక వత్తిడి తగ్గించాలని సిఫార్సు చేసింది. దీంతో కఠిన చర్యలు తీసుకుంటామని అప్పటి విద్యాశాఖ మంత్రి అసెంబ్లీలోనూ ప్రకటించారు. ఈ ఆత్మహత్యలపై రాష్ట్రంలో పెద్దఎత్తున ఉద్యమాలు సాగుతుంటే వాటి గొంతునులిమే ప్రయత్నం ముఖ్యమంత్రి చేస్తున్నారు. విద్యార్థుల్లో ఈ విపరీత ప్రవర్తనకు కారణం ఆటా..పాటా, విశ్రాంతిలేని విద్యా విధానం. ర్యాంకుల కోసం పరుగులు, సమాజంతో సంబంధంలేని జీవనం, ఇరుకు తరగతి గదులు, కళాశాల ప్రాంగణాలు, తల్లిదండ్రుల, ప్రైవేటు యాజమాన్యాల ఒత్తిడులు లాంటి ఎన్నో అంశాలను కారణాలుగా మానసిక, సామాజిక శాస్త్రవేత్తలు చెబుతున్నారు. పోటీ ప్రపంచంలో తమ పిల్లలు వెనకపడకూడదన్న ఆశతో తల్లిదండ్రులు బడిలో చేర్చినప్పటి నుండే ఐఐటి ఫౌండేషన్లని, మరో కోర్సని, ర్యాంకులు సాధించాలని, ఉన్నతంగా నిలవాలని పిల్లలపై తీవ్ర వత్తిడి చేస్తున్నారు. బయటి ప్రపంచంతో సంబంధం లేకుండా ర్యాంక్ సాధించడమే లక్ష్యంగా చదువులు సాగుతున్నాయి. తల్లిదండ్రుల ఈ కోరికను ఆసరా చేసుకుని ప్రైవేటు యాజమాన్యాలు నాణ్యతలేని, వ్యక్తిత్వ వికాసానికి అవకాశంలేని, సృజనకు సంబంధం లేని చదువులను అధిక ధరలకు అమ్ముకుంటున్నాయి. చివరకు కళాశాలల్లో చేరిన తర్వాత సహజ పెరుగుదలకు దూరమై విద్యార్థులు ర్యాగింగ్ పైశాచిక క్రీడతో జూనియర్ విద్యార్థులను వేధించడం ద్వారా వికృతానందాన్ని పొందుతున్నారు. కనీసం మానవ విలువలను మరిచి ప్రవర్తిస్తున్నారు. అమానవత్వంలో ఆనందం వెతుక్కుంటున్నారు. సినిమాలు, టివిలు, అశ్లీల వెబ్ దృశ్యాలు పిల్లల అసహజ లైంగిక చర్యలకు కారణమవుతున్నాయి. ఆడపిల్లలంటే అలరించే బొమ్మలన్న భావజాలం లైంగిక వేధింపులకు, అత్యాచారాలకు, బెదిరింపులకు కారణమవుతోంది. కాలేజీ యాజమాన్యాలు, విద్యా సంస్థల అధిపతులు, సీనియర్ విద్యార్థులు తమ ఆధిపత్యాన్ని నిలబెట్టుకునేందుకు, కోర్కెలను తీర్చుకునేందుకు జూనియర్లను, అమ్మాయిలను బలి చేస్తున్నారు.

ఐఐటి లాంటి అత్యున్నత విద్యాలయాల్లో నగ్నంగా పరుగులెత్తించడాన్ని, చెప్పనలవిగాని వికృత చర్యలకు పూనుకోవడానికి సమాజమే కారణం కాదా? ఇంత దుర్మార్గంగా సాగుతున్న ర్యాగింగ్‌ను అరికట్టేందుకు సుప్రీం కోర్టు ఒక ప్రజావాజ్యం కేసులో ర్యాగింగ్‌ను నేరంగా పరిగణించాలని, దీన్ని అరికట్టేందుకు కాలేజీ యాజమాన్యాలు, యూజిసి, ప్రభుత్వాలు బాధ్యత వహించాలని తీర్పునిచ్చింది. ఆ మేరకు తెచ్చిన ర్యాగింగ్ నిరోధక చట్టం ప్రకారం ప్రతి కాలేజీలో యాంటీ ర్యాగింగ్ కమిటీలను ఏర్పాటు చేయడమేకాక విస్తృత ప్రచారం చేయటం, జూనియర్ విద్యార్థులకు భరోసా కల్పించడం, ర్యాగింగ్ చేసినవారిపై కఠిన చర్యలు తీసుకోవడం, ఎఫ్ఐఆర్ నమోదు వంటివి చేయాలి. కళాశాలల్లో ఆ మేరకు ర్యాగింగ్ నిరోధక చర్యలు చేపడుతున్నారా? లేదా? అని పరిశీలన చేశాకే యుజిసి నిధులు మంజూరు చేయాలి. కానీ ఆ రకమైన నిబంధనలు అమలు చేయకపోవడం వల్లే రిషితేశ్వరి, అలాంటి మరింకెంతో మంది కలల్ని నిజం చేసుకోవాల్సిన వయస్సులో ఉసురు తీసుకుంటున్నారు. ర్యాగింగ్ చేసిన వారిపై చర్యలే కాకుండా ర్యాగింగ్ చేసే మనస్తత్వం స్థానంలో స్నేహ పూర్వక సంబంధాలు బలపడాలంటే సమాజంలోను, విద్యా విధానంలోనూ సమూల మార్పులు రావాలి. నిబంధనలను గాలికి వదిలే కార్పొరేట్ విద్యాలయాలపై ఉక్కుపాదం మోపాలి. ర్యాంకులు, సీట్లు, ఉద్యోగాలు మాత్రమే జీవితం కాదని, తల్లిదండ్రులతో, ఇరుగుపొరుగువారితో, తోటి విద్యార్థులతో మానవీయ సంబంధాలే మానవ మనుగడకు మూలమనే స్పృహ తల్లిదండ్రుల్లో, ఉపాధ్యాయుల్లో కలగాలి. ఆ రకమైన సామాజిక స్పృహే పాలిస్తున్న పెద్దల మెడలు వంచగలదు. విద్యా వ్యాపారంతో విష సంస్కృతిని విస్తరింపజేస్తున్న యాజమాన్యాల ఆటలను అడ్డుకోగలదు. ఎదుగుతున్న అమ్మాయిల, అబ్బాయిల బంగారు భవిష్యత్‌ను కాపాడగలదు.

సూక్తి :- ఊరికే బ్రతికేయడం, ఒక ఇంటిపని, కుటుంబాన్ని చేసుకోవడంకన్నా మరింకేదన్నా ఉన్నదేమో కనిపెట్టగలమా అని మనల్ని మనం ప్రశ్నించుకోవాలి. - జిడ్డు కృష్ణమూర్తి

# చైతన్య మానవి

## ఈ సంచికలో...



పత్రికలో విభిన్న అంశాలపై వస్తున్న వ్యాసాలు రచయితల అభిప్రాయాలు మాత్రమే. అందులో పేర్కొన్న అన్ని అంశాలతో మానవి సంపాదక వర్గం ఏకీభవిస్తుందని భావించవలదు.

– ఎడిటర్




**అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం ఎ.పి. రాష్ట్ర కమిటీ**

చిరునామా :
ఐద్వా రాష్ట్ర కార్యాలయం,
కల్పన ప్రింట్స్ రోడ్, కృష్ణలంక, విజయవాడ.
ఫోన్ : 94900 98620, 94900 98022
e-mail chaitanyamanavi@gmail.com

సంపాదకులు
**డి. రమాదేవి**

సంపాదక వర్గం
**కె. స్వరూపరాణి**
**బి. ప్రభావతి**

మేనేజర్
**ఎం. సుధ**

**విరాళం రూ : 10/-**

**ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్, కృష్ణనగర్, తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా**

# గౌరవం పేరిట సాగే హత్యలపై ఐద్వా కేంద్ర కమిటీ పిలుపు

ఐద్వా లీగల్ కన్వీనర్ కీర్తిసింగ్, కార్యదర్శి జగ్మతి, సుధాసుందర్‌రామన్ జులై 23న కేంద్ర న్యాయశాఖా మంత్రిని కలిసి పరువుపేరుతో సాగే హత్యా నేరాలపై చట్టం తేవాలని కోరారు. సంబంధిత మంత్రులు మరియు మహిళాకమీషన్‌తో సంప్రదిస్తామని ఈ విషయం ముఖ్యమైనదిగా భావించి పరిశీలన చేస్తామని కేంద్ర మంత్రి తెలిపారు.

**మెమోరాండం**

గౌరవ హత్యల పేరిట జరుగుతున్న నేరాలపై చర్య తీసుకునేందుకు చట్టాన్ని రూపొందించాలని ఐద్వా తరపున మేము విజ్ఞప్తి చేస్తున్నాము. దేశ వ్యాపితంగా 10 మిలియన్ల మహిళల సభ్యత్వం కలిగి దేశంలోని వివిధ ప్రాంతాలలో ముఖ్యంగా హర్యానా మరియు కొన్ని ఉత్తరాది రాష్ట్రాలలో గౌరవం పేరిట హత్యలు చేయడానికి వ్యతిరేకంగా జరిగే ఉద్యమాలు, పోరాటాలలో ఐద్వా ముందు పీఠిన వుంటుంది.

వివిధ కులాలకు, మతాలకు కొన్ని సార్లు ఒకే గోత్రానికి లేదా గ్రామానికి చెందిన యువతీ, యువకులు వారి తల్లి,దండ్రుల ఆకాంక్షలకు వ్యతిరేకంగా వివాహం చేసుకున్న లేక వెళ్ళిపోయిన సందర్భాలలో ఇలాంటి హత్యలు జరుగుతున్న విషయం మీకు తెలిసిందే. చాలా కేసులలో అమ్మాయి కుటుంబం, వారి బంధువులు లేక వారి కులానికి చెందినవారు లేక ఖాప్ (కుల)పంచాయితీలు వారి పరువు పోయినట్లుగా భావిస్తున్నారు. అంతేకాకుండా అమ్మాయి కుటుంబంపై వారి వివాహాన్ని ఒప్పుకోవద్దని ఒత్తిడి చేస్తున్నారు. వీరందరూ ఉమ్మడిగా, లేక ఒక్కోసారి ఒంటరిగా ఆ యువతీ, యువకులపై మరియు యువకుని కుటుంబంపై కూడా ప్రతీకార దాడులు జరుపుతున్నారు. పోలీసులు మరియు శాంతి భద్రతల యంత్రాంగం కూడా యువకునిపై కిడ్నాప్, అత్యాచారం కేసుల లాంటి తప్పుడు కేసులు బనాయిస్తున్నారు.

వీటి పర్యవసానాలు చాలా తీవ్రంగా ఉన్నాయి. గాయాలు, చిత్రహింసలకు గురిచేయడం కొన్ని సార్లు జంట హత్యలు కూడా చేస్తున్నారు. ఈ దేశంలోని యువతకు తమకు నచ్చిన వ్యక్తిని, తాము చేసుకోదలచిన వ్యక్తిని ఎంపిక చేసుకొని వివాహం చేసుకుని, వారి కుటుంబ సంబంధాన్ని కొనసాగించే హక్కు వుందని పునరుద్ఘాటించ వలసిన అవసరం ఉందని మేము భావిస్తున్నాము.

ఐద్వా తన అనుభవంతో గౌరవ హత్యల పేరుతో జరుగుతున్న నేరాలపై 2010లో ఒక సమగ్ర ముసాయిదా చట్టాన్ని రూపొందించింది. ఈ ముసాయిదా గౌరవహత్యలను కూడా హత్యలుగానే పరిగణించాలని, అంతకంటే తక్కువ చేసి చూపరాదని పేర్కొంది. అంతేకాకుండా ఖాప్ పంచాయితీల ద్వారా గాని, అమ్మాయి కుటుంబ సభ్యులు, బంధువులు లేక సానుభూతిపరుల ద్వారాగానీ జంట హింసాత్మక చర్యలకు గురైనట్లయితే పై వారందరూ శిక్షార్హులని ముసాయిదా చట్టం తెలియచేస్తుంది. జంటను, యువకుని పరిగణించే చర్యలను, జంటను అన్న, చెల్లెళ్ళుగా ప్రకటించడాన్ని, చట్ట విరుద్ధ నుంకాల్ని విధించడం, యువకుని కుటుంబంపై సాంఘిక, ఆర్థిక ఆంక్షలు విధించటం, జంటను లేక జంటలో ఒకరిని గాయపరచటం, ఒక్కోసారి జంటలో ఒకరికి వేరే వారితో వివాహం జరిపించటం లాంటి చర్యలన్నింటినీ ఆ చట్ట ముసాయిదాలో నేరాలుగా పరిగణించాలని పేర్కొనబడింది. 'సతి'చట్టంలో హింసాత్మక ఘటనలుగా పేర్కొనబడిన ఘటనలను ఈ కేసులలో పునరావృతమవ్వడం మనం చూడవచ్చు. భారతీయ శిక్షాస్మృతిలోని నేరపూరిత భయోత్పాతం లేదా తీవ్రమైన గాయం వంటి నేరాలు, హింసాత్మక చర్యలను వాటి పర్యవసానాలను పరిగణనలోకి తీసుకోలేదు. పై కేసులోనైనా ఇలాంటి తీవ్రమైన హింసాత్మక ప్రత్యేక ఘటనలను నేరాలుగా నిర్వచించి చట్టాన్ని అన్వయించి వాటికి సంబంధించిన సమాచారాన్ని సేకరించవచ్చు. జంటకు రక్షణ ఇవ్వకుండా యువతి తల్లిదండ్రులు లేక పెద్దల అభ్యర్థన మేరకు పోలీసులు యువకునిపై కిడ్నాప్, అత్యాచారం లాంటి కేసులు నమోదు చేసినట్లైతే అలాంటి సందర్భంలో పోలీసులు కూడా ఆ నేరంలో భాగస్వాములుగా భావించాలని ముసాయిదా చట్టం పేర్కొంటుంది. అంతేకాకుండా ఒక జంట తాము వివాహం చేసుకోవాలనుకున్నట్లు ఒక ప్రభుత్వ అధికారి ముందు ప్రకటించినట్లయితే వారి మీద ఎలాంటి తదుపరి చర్య తీసుకోకూడదని కూడా చెప్తుంది. హర్యానాలో మాదిరి దేశంలోని అన్ని ప్రాంతాలలోనూ ఇలాంటి జంటలకు ఆశ్రయమిచ్చే రక్షణ గృహాలను ఏర్పాటు చేయిలని కోరుతుంది. మరీ ముఖ్యంగా ఇలాంటి జంటలు వేధింపులు,

**జంటకు రక్షణ ఇవ్వకుండా యువతి తల్లిదండ్రులు లేక పెద్దల అభ్యర్థన మేరకు పోలీసులు యువకునిపై కిడ్నాప్, అత్యాచారం లాంటి కేసులు నమోదు చేసినట్లైతే అలాంటి సందర్భంలో పోలీసులు కూడా ఆ నేరంలో భాగస్వాములుగా భావించాలని ముసాయిదా చట్టం పేర్కొంటుంది. అంతేకాకుండా ఒక జంట తాము వివాహం చేసుకోవాలనుకున్నట్లు ఒక ప్రభుత్వ అధికారి ముందు ప్రకటించినట్లయితే వారి మీద ఎలాంటి తదుపరి చర్య తీసుకోకూడదని కూడా చెప్తుంది.**

చిత్రహింసలకు గురయి ఉద్యోగాలను, ఇళ్ళను వదిలి పారిపోవలసి వస్తున్నందున తగిన పరిహారాన్ని అందించాలని కోరుతున్నది.

యువజంట మరియు వారి కుటుంబాలకు రక్షణ కల్పించటానికి, ఖాప్ పంచాయితీలు పెట్టే కఠినమైన షరతులను నిషేధించటానికి జిల్లా మేజిస్ట్రేట్ లేదా కలెక్టరుకు సుమోటో అధికారాలనివ్వాలని ముసాయిదా కోరుతుంది.

జాతీయ మహిళా కమిషన్ కూడా పై విధంగానే చట్టాన్ని రూపొందించాలని కోరింది. ఐద్వా, ఎన్‌సిడబ్ల్యు ముసాయిదా చట్టాల తర్వాత లా కమీషన్ కూడా ఈ రకమైన నేరాలపై చట్టాన్ని రూపొందించింది. కానీ లా కమీషన్ రూపొందించిన చట్టం చాలా అసమగ్రంగా, నేరాలకు పాల్పడిన వారందిరినీ కాకుండా కేవలం చట్ట విరుద్ధ సమూహాలకు లేదా వారి తరపున వ్యవహరిస్తున్న, చేస్తున్న వారిని మాత్రమే శిక్షార్హులను చేస్తుంది. ఇలాంటి సమూహాలు పాల్గొన్న హింసాత్మక చర్యలకు శిక్ష లేకుండా పోతున్నది. హింసాత్మక కార్యకలాపాలలో పాలుపంచుకున్న కుటుంబ సభ్యులను గూర్చి ఏమీ మాట్లాడటం లేదు. జంటను వేధింపులకు గురి చేయడం, వారికి తిరిగి బలవంతంగా వేరే వారితో వివాహం జరిపించటం లాంటి హింసాత్మక, దూషణ చర్యల గురించి లా కమీషన్ ప్రతిపాదనలు సమగ్రంగా లేవు. అంతేకాకుండా జంటకు రక్షణ కల్పించడం లేక వారికి ఆశ్రయం కల్పించే ఏర్పాటు ఏమీ లేదు. జంటను రక్షించటానికి బదులు వారిపై తప్పుడు కేసులు బనాయించిన పోలీసులను కూడా బాధ్యులను చేయడం లేదు. జంట యొక్క వివాహం చేసుకునే, తమకిష్టమైన వారిని ఎంచుకునే హక్కును రక్షించటం లేదు.

ప్రభుత్వం లా కమీషన్ ప్రతిపాదనను అన్ని రాష్ట్ర ప్రభుత్వాలకు పంపించింది. కానీ మేము ప్రతిపాదించిన ముసాయిదా చట్టాన్ని చట్టం చేసినట్లయితే దేశంలోని యువతీ,యువకులు న్యాయం, రక్షణ పొందగలరని తద్వారా వారి ప్రాథమిక హక్కులు పరిరక్షించబడతాయని మేము చాలా దృఢంగా విశ్వసిస్తున్నాము.

పై మెమోరాండాన్ని అఖిల భారత నాయకత్వం కేంద్ర మంత్రికి ఇవ్వడమే కాక గౌరవ హత్యలపై సమగ్ర చట్టం తేవాలని జులై 24 లక్ష్మి సెహగల్ వర్ధంతి సందర్భంగా ఢిల్లీలోనూ మరియు దేశవ్యాపితంగా కార్యక్రమాలు నిర్వహించింది. చట్టం వచ్చేంతవరకు దీనిపై ఆందోళన నిర్వహించాలని ఐద్వా పిలుపునిచ్చింది.

✦

---

వ్యాసం

# భిన్నత్వం - ఏకత్వం

**- వేములపల్లి సత్యవతి**

ఒకటిగా ఉన్న మానవ సమాజాన్ని భిన్న భిన్న వర్ణాలుగా విభజించింది హైందవం. నాలుగు వర్ణాలుగా ముక్కలు చేసి హెచ్చుతగ్గులకు, అంటరానితనానికి నాంది పలికింది హైందవం. అంటరానితనం మనిషిని మనిషి ముట్టుకోకూడదన్న ఈ దురాచారం ఒక్క మన దేశంలో తప్ప ప్రపంచంలో మరెక్కడా లేదు. ఈ ఆచారం అమానవీయ గుణాలకు ప్రాతిపదిక అవుతుంది. దాని ఫలితమే అగ్రకులాల వారు నిమ్న కులాలవారిపై వేల సంవత్సరాల నుండి ఆధిపత్యం చెలాయించారు. పూలే మహాశయుడు, అంబేద్కర్ లాంటి వారివలన అణగారిన, అణచివేతకు గురయిన దళితులలో చైతన్యం కలిగింది. వారు తిరుగుబాట్లు, పోరాటాలు చేస్తూ ఉద్యమాలను నడుపుతున్నారు. విచారకరమైన సంగతేమిటంటే అణగారిన



వారంతా కులాల సంఘాల పేరుతో ఎవరికివారే వేరువేరుగా హక్కుల కొరకు పోరాటాలకు దిగారు. పుట్టగొడుగుల్లాగ కులాల సంఘాలు పుట్టుకొచ్చాయి. దీనికి మూలం ఒక్కటిగా ఉన్న మానవ జాతిని వర్ణాలుగా విభజించటమే కారణం. ఆర్యులు రాక పూర్వం మనదేశంలో సింధునాగరికత వెల్లివిరిసింది. ఆర్యులు నదీ పరివాహక ప్రదేశాలలో స్థిరపడ్డారు. వారి కాలంలోనే హిందూ అనే పదం ప్రారంభమైంది. ఆర్యుల రాక తరువాతనే భారత దేశంలో వర్ణ వ్యవస్థ ప్రారంభమైంది. నాలుగు వర్ణాలలో అగ్రస్థానం బ్రాహ్మణులది. చదువు అన్న మూడు అక్షరాలను తమ స్వంతం చేసుకుని మొత్తం సమాజం మీద పెత్తనం సాగించారు. క్షత్రియులయిన రాజులు కూడ బ్రాహ్మణ గురువు ఆజ్ఞలను శిరసావహించవలసిందే. ఏకత్వము నుంచి భిన్నత్వానికి అంకురార్పణ చేసింది బ్రాహ్మణ భావజాలం.

భిన్నత్వంలో ఏకత్వమన్నది బౌద్ధానికి వర్తిస్తుంది. బౌద్ధం ఒక సామాజిక జీవన విధానం. బ్రాహ్మణ భావజాలంతో బుద్ధుడు జన్మించేనాటికే ప్రజలు

**ఆర్యులు రాక పూర్వం మనదేశంలో సింధునాగరికత వెల్లివిరిసింది. ఆర్యులు నదీ పరివాహక ప్రదేశాలలో స్థిరపడ్డారు. వారి కాలంలోనే హిందూ అనే పదం ప్రారంభమైంది. ఆర్యుల రాక తరువాతనే భారత దేశంలో వర్ణ వ్యవస్థ ప్రారంభమైంది. నాలుగు వర్ణాలలో అగ్రస్థానం బ్రాహ్మణులది. చదువు అన్న మూడు అక్షరాలను తమ స్వంతం చేసుకుని మొత్తం సమాజం మీద పెత్తనం సాగించారు. క్షత్రియులయిన రాజులు కూడ బ్రాహ్మణ గురువు ఆజ్ఞలను శిరసావహించవలసిందే. ఏకత్వము నుంచి భిన్నత్వానికి అంకురార్పణ చేసింది బ్రాహ్మణ భావజాలం.**

విసుగెత్తిపోయారు. కర్మకాండలు, యజ్ఞాల పేరుతో ప్రజలు పీడించబడ్డారు. ఈ కర్మకాండలను అగ్రవర్ణానికి చెందిన బ్రాహ్మణులు నిర్వహించేవారు. మిగతా వర్ణాల వారికి వాటిని నిర్వహించే హక్కులేదు. యజ్ఞాలలో జంతుబలులు వుండేవి. యజ్ఞయాగాదులు జరిపించిన వారు మంచి కోడెదూడలను, ఆవులను బలిచేయించి వాటిని వారు తినేవారు. ఆ కాలములో మాంసంతోపాటు సోమరసాన్ని కూడా తాగేవారు. సమాజంలో అశాంతి నెలకొంది. వివిద తెగలు, జాతులపై దురాక్రమణ దాడులు సాగేవి. మనుషుల మధ్య కక్షలు, కార్పణ్యాలు ఎక్కువగా జొచ్చినవి. ఆ సమయములో బుద్ధుడు ఛిన్నాభిన్నమైన సమాజాన్ని ఏకం చేయటానికి పూనుకున్నాడు. సమాజంలో సత్యం, అహింస, భూతదయ, కరుణ, ప్రేమలను గురించి అన్ని వర్ణాలవారిలోను ప్రచారం చేశాడు. యజ్ఞయాగాదులలో జంతుబలిని అరికట్టగలిగాడు, వేదాలను తిరస్కరించాడు. పామరుల దగ్గర నుంచి, పాలకుల వరకు బౌద్ధాన్ని ఆదరించారు, అభిమానించారు, స్వీకరించారు. బింబిసారుడు, అశోకుడు, గౌతమీపుత్ర శాతకర్ణి, కనిష్కుడు, హర్షుడు మొదలగు రాజులు బౌద్దాన్ని స్వీకరించి పాలన చేశారు. హర్షుని కాలంలో చైనా నుంచి హ్యుయాన్‌త్సాంగ్ అనే యాత్రికుడు మనదేశానికి వచ్చి హర్షుని ఆస్థానంలో కొన్ని సంవత్సరాలు వున్నాడు. ఆయన తన యాత్రా గ్రంథంలో నలందా విశ్వవిద్యాలయాన్ని గురించి చాలా గొప్పగా రాశాడు. అంతేకాదు హర్షుని పాలనలో ప్రజలు తమ ఇండ్లకు తాళాలు వేసేవారుకారని కూడా రాశాడు.

తర్వాత ఎంతోమంది విదేశీయులు గజనీమహమ్మద్, ఛంగీజ్‌ఖాన్ మొదలగు వారు దండయాత్రలు చేసి సంపదను కొల్లగొట్టుకు పోయారు. మొఘల్ వంశానికి చెందిన బాబర్ దండయాత్ర చేసి రాజ్యాన్ని వశపరచుకొని శాసనానికి శ్రీకారం చుట్టాడు. బాబరు నుంచి ఔరంగజేబు వరకు ఆరు తరాల వారు ఇక్కడే స్థిరపడిపోయి పరిపాలించారు. ఇస్లాం ప్రవేశం ఇలా జరిగింది. జహంగీరు కాలంలో పోర్చుగల్లు వారు, ఆంగ్లేయ కంపెనీ (ఇంగ్లండు) వారు వ్యాపారం పేరుతో ప్రవేశించారు. 200 సంవత్సరాలు ఆంగ్లేయపాలన మన దేశం మీద సాగింది. 1947 ఆగష్టు 15న మరల స్వతంత్ర భారతదేశ ఆవిష్కరణ జరిగింది. ఆర్యులు అంకురార్పణ చేసిన వర్ణవ్యవస్థ నేటికీ సమాజంలో బలీయంగానే ఉంది. హైందవంతోపాటు ఇస్లాం, క్రైస్తవ మతాల ప్రాబల్యం కూడా రోజు రోజుకు పెరిగిపోతూ వుంది. ప్రపంచాన్నంతా ఇస్లామిక్‌గా చేస్తామని లష్కరేతోయిబా, ఇండియన్ ముజాహిదీన్, తెహ్రిక్-ఎ-తాలిబన్, సిమిజైషే మొదలగు మత సంస్థలు విధ్వంసాలు సృష్టిస్తున్నాయి. ఇది అంతర్జాతీయ మిలిటెంట్లకు పెను సవాలుగా మారింది. వర్ణ, వర్గ, కుల, లింగ, బేధాలు లేని రాజ్యాంగంతో ప్రజాస్వామిక దేశంగా ఏర్పడింది. విశ్వ హిందూ పరిషత్, ఆర్‌ఎస్‌ఎస్ మొదలగు హిందూమత సంస్థలు భారత్‌ను హిందూదేశంగా మారుస్తామని ప్రగల్భాలు పలుకుతున్నారు. క్రైస్తవం బహిరంగ ప్రకటనలు చేయకపోయి ఇతర మతస్తుల పవిత్ర దేవాలయాల వద్ద చాప క్రింద నీరులాగ మత ప్రచారం చేస్తుంది. హిందూ, ముస్లిం, క్రైస్తవ మతోన్మాదుల వలన సమాజానికి మేలుకన్న కీడే అధికంగా జరుగుతుంది. ఏమతాలవారైనా ప్రచారం చేయకూడదని నిషేధించాలి. ప్రజలకు తమ ఇష్టమొచ్చిన మతాన్ని స్వీకరించే స్వేచ్ఛ మన రాజ్యాంగం కల్పించింది.

✦

## అగ్ని కణిక

ఓ స్త్రీ !
ఆనాడు సతీసహగమనానికి
అగ్నిపాలయ్యావు
ఈనాడు వరకట్న దురాచారానికి
అగ్నికి ఆహుతవుతున్నావు

ఆనాడు ఒక రామ్మోహన్‌రాయ్ రక్షించాడు
ఈనాడు మరొక రామ్మోహన్‌రాయ్ రావాలా
ఎంతమంది సంస్కర్తలు వచ్చినా
ఈ వ్యవస్థకు ఎన్ని మాట్లు వేసినా?
ఈ పాట్లు తప్పవు

అందుకే
నీ చైతన్యంతో నీవే
ఒక అగ్ని కణికవై
వరకట్నాలతో, అత్యాచారాలతో
అసమానతలతో
కుళ్ళిన ఈ కుష్టు వ్యవస్థను దహించు
నవ సమాజ స్థాపనకై విప్లవ జ్వాలను రగిలించు

- ఎస్.ఎస్. లక్ష్మీదేవమ్మ

కథ

# రాళ్ళూ - మనుషులూ

- కొండేపూడి నిర్మల

ఎంతకీ అతను రావడం లేదు.

వస్తాడనుకుని ఎదురుచూస్తోంది.

నాలుగింటికల్లా వచ్చి బైటికి తీసుకెడతానన్నాడు. మాటిమాటికి గదిలోంచి బైటికి చూస్తోంది మేరీ. ముందుగదిలో అత్తగారు, తోటికోడళ్ళ గొంతులు వినిపిస్తున్నాయి. ఆడపడచులిద్దరూ పొద్దున్నే దిగారు. అందరూ కలిసి వరలక్ష్మీ వ్రతం చేసుకున్నారు. సాయంత్రానికల్లా పేటలో అందర్నీ పేరంటానికి పిలిచారు. మేరీకీ పగలంతా వంట గది దగ్గర సరిపోయింది. సాయంత్రం నుంచీ గదిలో కూచుండిపోయింది. బైటికి రమ్మని ఎవరూ పిలవడం లేదు. బైటికి వచ్చి ఏం చేయాలో కూడా ఆమెకు తెలీదు. చాపల మీద కూచున్న ముత్తయిదువలందరికీ కుంకుమ పెట్టాలి. పెట్టొచ్చు కానీ బొట్టు లేని తన ముఖం వింతగా చూస్తారు. పసుపు అందించాలి. అభ్యంతరం లేదు. కానీ సూత్రం లేని తన మెడ వంక వింతగా చూస్తారు.

"నువ్వు దూరంగా కూచుంటే కాదు, మా వాళ్ళతో కలిసిపోవాలి..." అంటాడు కిరణ్. కలసిపోవాలనే చూస్తుంది. కానీ అందరూ తనని దూరంగా చూస్తున్నారు. అంట్లు తోమవచ్చు. కానీ స్టవ్వు ముట్టుకోకూడదు. గదులు తుడవచ్చు. కానీ తోరణాలు కట్టకూడదుట... పూలు మాల కట్టవచ్చు కానీ దేవుడి గదిలోకి రాకూడదట.. ఆ పనులు కూడా వెంటపడి అందిపుచ్చుకుంటే కానీ చెయ్యనివ్వలేదు.

తొమ్మిది రకాల పిండి వంటలట...ఆడవాళ్ళంతా వాళ్ళు హూనం చేసుకున్నారు. మగవాళ్ళు పేకాటకు కూచున్నారు. పిల్లలు ఇల్లు పీకి పందిరి వేస్తున్నారు. మేరీకి కూచోవడానికి ఇబ్బందిగా అనిపించింది, అడ్డంగా అనిపించి, గదిలోకి పోయి తలుపులేసుకుంటే అది మరీ ఎబ్బెట్టుగా అనిపించి సతమతమవుతుంటే పెద్ద ఆడపడుచు కొన్ని పనులు కరుణించింది. మేరీ ఆ మాత్రం దానికే పొంగిపోయింది. పిల్లలందరికీ స్నానం చేయించి జడలు వేసింది. వాళ్ళంతా తనవాళ్ళు అనుకోవడానికి ఎన్ని ప్రయత్నాలు చేయాలో అన్నీ చేసింది. పిల్లల కోడిలా తిరుగుతున్న మేరీని చూసి కిరణ్ పొద్దున గుడ్ గుడ్ అని కళ్ళెగరేశాడు. మేరీ ఏదో చెప్పాలనుకునేలోగా జారుకున్నాడు. అత్తయ్య, మామయ్య. వదిన, అక్క బావ... ఒక్కతే కూతురు అయిన మేరీకి ఈ పిలుపులంటే చాలా ఇష్టం కానీ తెలిగ్గానే గమనించింది. తనని బంధుత్వంతో ఎవరూ పిలవడంలేదు. పేరుతో కూడా పిలవడం లేదు. ఇదిగో ఇటు చూడూ... అంటున్నారు.

ఎంత పట్టించుకోకుండా వుందామనుకున్నా అది ముల్లులా గుచ్చుకుంటూనే వుంది. పోనీ ప్రయత్నించి తనే పూనుకుని అలా పిలుద్దామన్నా నోరు పెగలడం లేదు. ఏమి ఎదుర్కోవాలో అని భయం.

"భయమెందుకు... అంటే ఒకమాట అంటారు. నువ్వే కలిసిపోవాలి ఇదే మంచి ఛాన్సు" అంటాడు కిరణ్. అదేదో బంపర్ డ్రా లాటరీ టికెట్టులా... పోనీ ధైర్యం చెప్పడానికి అయినా పక్కన వుండచ్చు కదా... వుండడు. చిన్నప్పటి ఫ్రెండ్స్‌ను కలవాలంటూ రోడ్లు పట్టుకుని తిరుగుతున్నాడు. కొడుకు కోడల్ని అంటిపెట్టుకుని వుండకుండా బైటికెళ్ళిపోవడం అందరికీ కాస్త వింతగా, లోకువగా వున్నట్టుంది.

"సాయంత్రం తొందరగా వచ్చెయ్యి, ఆ పేరంటాలూ అవీ... ఏమిటో ఇక్కడ నేను ఇమడలేను. ఒక్క గంట బయటికి వెడదాం" ప్రార్థిస్తున్నట్లుగా అడిగింది.

సరే సరే అంటూ తలూపి వెళ్ళిపోయాడు. ఏడవుతోంది. ఇంకా రాలేదు. మేరీ జైల్లో వున్నట్టుగా రోజులు లెక్కపెట్టుకుంటోంది. ఇంకొక్క మూడురోజులు పదో సారి లెక్క పెట్టింది. ముందు గదిలో గట్టిగా నవ్వులు వినిపించాయి. బాగా అయిన వాళ్ళెవరో వచ్చినట్టున్నారు.

"మీ కొత్త కోడలు గది వదిలి రాదా ఏం..."చనువుగా అడిగారు ఎవరో...

"ఆవిడకివన్నీ తెలీదు, క్రిష్టియన్ కదా..." ఆడపడుచు...

"ఏమోనండీ... మేం ఎవరి ఇష్టాన్నీ కాదనలేం... వాడికి నచ్చింది, చేసుకున్నాడు." అత్తగారు ఎంతో ఆదర్శంగా అందామనుకుంది. తొక్కి పెట్టిన అశాంతి లాంటిది కనిపించింది.

"అవున్లెండీ... వాళ్ళకు నచ్చితే మనం ఏం చేస్తాం... పెళ్ళి ఎక్కడ చేశారు... గుళ్ళోనా... చర్చిలోనా... ఇంకొక ఆవిడ కాబోలు అడిగింది.

ఏమో వదినా గుమ్మంలోకి వచ్చేదాకా మావాడు ఆ పిల్లని చేసుకున్నట్టే తెలీదు."

"సరే పోన్లెండి... ఇంకా ముగ్గురు కోడళ్ళు వున్నారు కదా... మీ వంశం నిలబెట్టడానికి..."

" అదే నా ఓదార్పు"...

మేరీకి ముళ్ళమీద కూచున్నట్టుగా వుంది. కిరణ్ రావడం లేదు. అమ్మ మాటలు గుర్తొచ్చాయి. " వద్దమ్మా నీకు తెలీదు... మతం కలవదు... కులం కలవదు... ఇబ్బంది పడతావు. నాన్నగారి స్నేహితుడి కొడుకు జాన్ వున్నాడు... నిన్ను ఇష్టపడుతున్నాడు. తెలిసిన కుటుంబం. నా మాట విను."

"కిరణ్ ఎంత మంచివాడో నీకేం తెలుసమ్మా... నా కోసం వాళ్ళ అందర్నీ ఎదిరిస్తున్నాడు." అమ్మ మాట్లాడలేదు. నాన్న మాట్లాడలేదు. వాళ్ళిద్దరూ ప్రేమించే చేసుకున్నారు. అమ్మ చర్చికి వెడుతుంది. నాన్న నాస్తిక సమాజానికి వెడతాడు. కాబట్టి కాదనడానికి బలమైన కారణం కనిపించలేదు. కానీ ఔననడానికి కావలసినంత ధైర్యమూ చిక్కలేదు. వాళ్ళ ఆలోచనల్లో వాళ్ళు వుండగానే మేరీ బట్టలు సర్దుకుని కిరణ్ తెచ్చిన కారెక్కింది. పోనీ చర్చిలో అయినా పెళ్ళి చేసుకు వెళ్ళండి... అంటున్న అమ్మ మాటలు

గాల్లో కలిసిపోయి వినిపించాయి.

"మా వాళ్ళని కాదని వచ్చేస్తున్నాం కదా... పోనీ వాళ్ళకు నచ్చినట్టు చర్చిలో పెళ్ళి చేసుకుంటే ఏం పోతుంది కిరణ్. దారిలో అడిగింది.

"గుళ్ళో చేసుకుంటే ఏం పోతుంది. ఇది నువ్వు వొప్పుకుంటావా"?అని అడిగాడు

అవును అదీ నిజమే అనుకుంది. మధ్యే మార్గంగా ఇద్దరూ రిజిష్టరు మ్యారేజీ చేసుకున్నారు. పోనీ రెండు పద్ధతుల్లోనూ చేసుకోవచ్చు కదా ...భలే సరదాగా వుంటుంది. తన ఫ్రెండు సుహాసిని జోక్. ఎందుకోగానీ కిరణ్ సీరియస్‌గా మొహం పెట్టాడు. తనకి అర్థం కాలేదు. ఎంత తొందరగా ఇద్దరం ఒకటయిపోవాలా అనుకున్నట్టు కనిపించాడు. అదంతా ప్రేమోద్వేగం కాదట, సెలవుల్లేకట...! నవ్వూ ఆశ్చర్యం కలిగాయి. కొత్త కాపురం మొదలుపెట్టిన నాలుగు నెల్లలోపు అయిదుసార్లు తన వూరు వెళ్ళొచ్చాడు. తను కూడా అమ్మా నాన్నా - అంటూ ప్రయాణం కట్టింది.

"ఇష్... గొడవ చెయ్యకు. ఇది సిటీ. ఇద్దరం బైటికి వెడితే ఇల్లు దోచేస్తారు..." అని ఆపేశాడు".

"సరేలే... వెడతావు వస్తావు... మీ వాళ్ళేం అనుకుంటున్నారో చెప్పవేమిటీ..." అంటే నవ్వుతూ తేల్చేస్తూ

"ఏముందీ అనుకున్నదేగా... డోంట్ వర్రీ....

అంతమందికి ఇష్టం లేని ఈ బంధం అంటే మేరీకి లోపల్లోపల భయంగానే వుంది.

"నాకు నువ్వు... నీకు నేను ఇంకెవరూ వద్దు... అసలు పెద్దలు కుదిర్చిన పెళ్ళిలో కూడా కొత్త దంపతుల ఏకాంతం కోసం అందరూ దూరంగా వెళ్ళిపోతారు తెలుసా..." నవ్వించాలిని చూసేవాడు. మేరీకి తన అమ్మ అనుభవం అడిగి వినాలనిపించేది. కిరణ్‌తో వున్నంత సేపూ మంచి పనే చేశాను అనిపించేది. ఎందుకో మళ్ళీ తప్పు చేసినట్టుగానూ ఉండేది. సందిగ్ధం పూర్తయ్యేలోపు మొన్న కిరణ్ ఉత్సాహంగా ఆఫీసునుంచొచ్చి, మేరీ ఇదే ఛాన్సు మనం కూడా వెడదాం. ఈ పండక్కి అంతా కలుస్తున్నారట. అన్నయ్య చెప్పాడు. గుంపులో గోవిందలాగా కలిసిపోవచ్చు. మన జోలికి ఎవరూ రారు. పండగ హడావిడిలో అంతా మర్చిపోతారు. మేరీకి నిజమే అనిపించింది.

"ఇప్పుడేం పండగ"అడిగింది.

"శ్రావణమాసం కదా, ఓహెూ నీకు తెలీదు కదూ, బావుంటుంది బావుంటుంది. చూద్దువుగాని.."అన్నాడు.

పండగ ముందురోజే ఇద్దరూ దిగారు.

భయపడినట్టు ఎవరూ వ్యతిరేకించలేదు. అలాగని తనని ఆహ్వానించనూలేదు.

కొడుకుని వాళ్ళ అమ్మ కావలించుకుని ఏడ్చింది. నాన్న దగ్గరికి తీసుకున్నాడు. అక్కలు ఒక్కొక్కరు వచ్చి కావలించుకున్నారు.

కిరణ్‌కి కూడా కళ్ళమ్మట నీళ్ళొచ్చాయి. ఏదో ఘోరం జరిగిపోయినట్టు అందరూ ఉద్వేగానికి గురయ్యారు.

మేరీకి ఇబ్బందిగా అనిపించింది. తన అమ్మా నాన్న గుర్తొచ్చారు.

అందరూ ఒకర్నొకరు పట్టుకుని లోపలికి వెళ్ళారు.

మేరీ సూట్కేసులతో సహా నిలబడిపోయింది. పది గంటల ప్రయాణం తాలూకు అలసట కంటే ఎవరూ పలకరించి కూచోమనకపోవడం ఎక్కువ నొప్పిగా అనిపించింది. పది నిమిషాలయ్యేసరికి కిరణే హడావిడిగా వచ్చి సారీ మేరీ మర్చిపోయాను. లోపలికి రా.. అలా నుంచుండి పోయావేమిటీ... అదిగో మన గది..." అంటూ భుజం చుట్టు చెయ్యి వేసి తీసుకువెళ్ళాడు. అందరి చూపులూ తనమీదే వున్నట్టు తెలుస్తోంది. కిరణ్ మనది అని చూపించిన గదిలో పదిమంది పిల్లలు పరుపుల మీద దొర్లుతూ కనిపించారు.

"లేవండ్రా... ఒరే... ఇదిగో మీ కొత్త పిన్ని..." అని పరిచయం చేశాడు.

" కొత్త పిన్నా... మరి నీ పెళ్ళికి మమ్మల్ని పిలవలేదేం.." పిడుగులా ప్రశ్నించాడు అందరిలోకి కాస్త పెద్దవాడు.

కిరణ్ నవ్వేశాడు.

మేరీ బ్యాగులోంచి బిస్కెట్లు తీసి ఇవ్వబోయింది.

"మాకేం వద్దు, ఇప్పుడే తిన్నాం," అంటూ ఒకరి వెంట ఒకరు పరుగు తీశారు. తెల్లమొహం పెట్టిన మేరీని చూసి నవ్వుతూ కిరణ్, " అమ్మో వాళ్ళా చిచ్చరపిడుగులు చాల్లేదేమో నువ్వు పెట్టే కోటా అయినా, నువ్వేం అనుకోకు, సాయంత్రానికల్లా నీ వెంటపడతారు చూడు" అంటూ ఓదార్చాడు. అనుకున్నట్టుగానే పిల్లలే కొన్ని గంటలు గడిసేసరికి మరీ వెంటపడకపోయినా కాస్త పలుకుతున్నారు. ఏయ్ ఏయ్ మేరీ ట..." పిన్నీ అనకూడదూ... అలా అనడం లేదు. తను నచ్చలేదో, పెద్దవాళ్ళు ఒద్దన్నారో తెలీదు.

" ఎందుకలా చీకట్లో కూచున్నావు..." ఎప్పుడొచ్చాడో కిరణ్ ప్రశ్నకు మేరీ ఉలిక్కిపడింది.

"ఏం లేదు... పదండి... తల్నొప్పి... ఆలోచిస్తూ వుంటే నిద్ర పట్టేసింది. ఇదిగో ఇప్పుడే లేచా..." అబద్ధం ఆ ఇల్లంతా గందరగోళంగా వుంటే నీకు నిద్ర పట్టిందా... ఫన్నీ..." అంటూ బుగ్గ మీద చిటికె వెయ్యబోయి ఆగాడు.

"ఒరే, అమ్మ నాకిది చేయించింది చూడూ..." రెండో ఆడపడుచు చెయ్యిపట్టుకుని లాక్కెళ్ళింది. ఇద్దరూ ముందు గదిలోకి వచ్చారు. మొత్తం అందరూ తివాచీ మీద గుండ్రంగా కూచుని

**"కిరణ్ ఎంత మంచివాడో నీకేం తెలుసమ్మా... నా కోసం వాళ్ళ అందర్నీ ఎదిరిస్తున్నాడు." అమ్మ మాట్లాడలేదు. నాన్న మాట్టాడలేదు. వాళ్ళిద్దరూ ప్రేమించే చేసుకున్నారు. అమ్మ చర్చికి వెడుతుంది. నాన్న నాస్తిక సమాజానికి వెడతాడు. కాబట్టి కాదనడానికి బలమైన కారణం కనిపించలేదు. కానీ ఔననడానికి కావలసినంత ధైర్యమూ చిక్కలేదు. వాళ్ళ ఆలోచనల్లో వాళ్ళు వుండగానే మేరీ బట్టలు సర్దుకుని కిరణ్ తెచ్చిన కారెక్కింది. పోనీ చర్చిలో అయినా పెళ్ళి చేసుకు వెళ్ళండి... అంటున్న అమ్మ మాటలు గాల్లో కలిసిపోయి వినిపించాయి.**

ఉన్నారు. అత్తగారు ఒక్కొక్క కోడలుకీ బంగారు గాజుల జత తొడుగుతోంది. కూతుళ్ళకి గొలుసులు ఇచ్చింది. చప్పట్లు కొట్టండ్రా ఒరే. పెద్దలు హుషారు చేసేసరికి, పిల్లలు చప్పట్లు కొడుతున్నారు. మేరీ కిరణ్ వంక ప్రశ్నార్థకంగా చూసింది. "శ్రావణ మాసం, అంటే అత్తింటివాళ్ళు కోడళ్ళకి కానుకలు ఇస్తారన్నమాట". కిరణ్ మెల్లిగా మేరీకి మాత్రమే వినిపించేట్టు అన్నాడు. ఓహో, అనుకుని ఆసక్తిగా చూసింది మేరీ.

"అంతకంటే ముందు ఆషాఢమాసం అల్లుడికి అత్తింటి వాళ్ళు కానుకలు ఇస్తారు." ఆ మాట పెద్ద ఆడపడుచు మొగుడు అన్నాడు. కిరణ్ వంక చూసింది, ఎటో చూస్తున్నట్టు కూచున్నాడు.

"అసలు శ్రావణమాసం నోములెందుకంటే, భర్త ఆయురారోగ్యాలు కోరి సుమంగళులు చేస్తారన్న మాట." పెద్ద తోటికోడలు మామూలుగానే చెప్పివుండవచ్చు. కానీ ఏమిటో తనని ఉద్దేశించినట్టుగా అనిపించింది.

"ఏమిటి నీ సాంప్రదాయం... ఏ నమ్మకాలు లేకపోవడమేగా..."
"ఏమని నమ్మమంటావు, నోములు నోచకపోతే మొగుడుమీద ప్రేమ లేదని నమ్మమంటావా...?"
"నలుగురుకి బొట్టు పెట్టినప్పుడల్లా ఇంకో నలుగుర్ని అవమానించడం సంప్రదాయం అని నమ్మమంటావా
"అవమానించడం ఏమిటీ..."
"ఏం గమనిస్తావు నువ్వు. మీ పెద్దక్క అత్తగారికి ఎందుకు బొట్టు ఇవ్వలేదు."
"ఆవిడకి భర్త లేదు".
"భర్త వచ్చినప్పుడే కాదు కదా, ఆవిడకి వాళ్ళమ్మ చిన్నప్పుడే పెట్టింది కదా బొట్టు, సూత్రాలు మటుకు భర్త కట్టి వుండచ్చు."

"మీ ఆవిడకేం నగలు పెట్టాలో తెలీడం లేదురా కిరణ్. తను బొట్టు కూడా పెట్టుకోదు కదా..." అంది అత్తగారు. నవ్వి వూరుకుంది మేరీ.

"అయినా ఇంటికొచ్చిన వాళ్ళని పసుపూ కుంకాలివ్వకుండా వొట్టి చేతుల్తో పంపడం నాకు అలవాటు లేదు అందుకని..." అంటూ ఒక వాయిలు చీర మేరీ వొళ్ళో పెట్టింది. మిగిలిన వాళ్ళ చీరలకీ దీనికీ చాలా తేడా ఉంది. అది కాదు మేరీని ఆశ్చర్యపరచిన విషయం.

"ఫర్లేదులే" అన్నాడు కిరణ్ కూడా కుచించుకుపోయి, ఆ మాటలోకి అంత నీరసం ఎందుకొచ్చిందో అప్రయత్నంగా మేరీ కూడా తల వొంచుకుంది. కబుర్లకి అంతరాయం వుండకూడదని టి.వి. సౌండ్ తగ్గించి పెట్టినట్టున్నారు. ఏ ఛానల్లో చూసినా చీరలు, నగలు అవి ఏ గ్రహరాసి వారు ఎలా పెట్టుకోవాలో ప్రకటనలు వస్తున్నాయి. మేరీకి హటాత్తుగా ఏదో కొత్త గ్రహానికి వలస వచ్చినట్టుగా వుంది. ఆకలిగా వున్నాగానీ కడుపునిండా తినలేకపోయింది. అందరూ నవ్వుతూ తుళ్ళుతూ మాట్లాడతుంటే మేరీకి చిరునవ్వుని పెదాలమీద చెక్కి వుంచడం కష్టమైపోతోంది.

మౌనంగా బట్టలు సర్దుకుని తిరుగు ప్రయాణం అయ్యారు. మళ్ళీ కన్నీళ్ళూ, కావలింతలూ కాసేపు మేరీ నిలబడే వుంది.

"తప్పు చేశానేమో కిరణ్" అంది దారిలో

"ఏ విషయంలో" ఇద్దరూ చీకటిలోనే వున్నారు. ఒకరి మొహం ఒకరికి కనబడటం లేదు.

"నన్ను చేసుకోవడంలో... అంత పెద్ద కుటుంబం వున్నప్పుడూ, వాళ్ళని ఒప్పించలేకపోయినప్పుడు వాళ్ళకి నచ్చిన పిల్లనే చేసుకోవాల్సింది". అనలేక అనలేక అంది.

"ఇప్పుడెందుకింక... జరిగిపోయింది కదా... ఆ విషయం వదిలెయ్యి..."

"అందుకు బాధ పడుతున్నావా.."

"ఛ ఛ లేదు... నువ్వు కలిసిపోతే బావుండేదనుకున్నా..."

"అంటే నేను ప్రయత్నించ లేదంటావా...?"

"ఏం ప్రయత్నించావు. కనీసం మొహాన్న బొట్టన్నా పెట్టుకోలేదు...పెళ్ళయిన వాళ్ళు అలా కనిపించడం ఎంత తప్పో నీకు తెలుసా, మన ఇంట్లో ఎలా వున్నాగానీ, మా ఇంట్లో ఒక స్టిక్కరు అతికించుకోవచ్చు కదా. అక్కలందరూ పూజలు చేస్తుంటే నువు దిక్కులు చూస్తూ కూచున్నావట, వాళ్ళ అభిప్రాయాలు వాళ్ళకుంటాయి కదా.."

"అదేమిటి అభిప్రాయాలే అయితే నాకూ వున్నాయి. నేను పెరిగిన పరిసరాలు నమ్మకాలు వేరు.

"కావచ్చు కానీ అత్తగారింటికి అంటూ వచ్చాక... వేరే గా వుంటుంది".

"అదేమిటి కిరణ్... నేను వచ్చిందే ఇది మొదటిసారి కదా... మతం విషయం ఎలా వున్నా గాని నువ్వు కూడా వాళ్ళకి నేను కోడల్ని కాదా... బొట్టుపెట్టుకుంటేనే మాట్లాడుతారా...? వ్రతాలు చేస్తేనే కలుపుకుంటారా?"

"అవునబ్బా అది ఒక సంప్రదాయం..."

"అది నాక్కూడా వుంటుందనీ నీకు తెలీదా...?

"ఏమిటి నీ సాంప్రదాయం... ఏ నమ్మకాలు లేకపోవడమేగా..."

"ఏమని నమ్మమంటావు, నోములు నోచకపోతే మొగుడుమీద ప్రేమ లేదని నమ్మమంటావా...?"

"నలుగురుకి బొట్టు పెట్టినప్పుడల్లా ఇంకో నలుగుర్ని అవమానించడం సంప్రదాయం అని నమ్మమంటావా

"అవమానించడం ఏమిటీ..."

"ఏం గమనిస్తావు నువ్వు. మీ పెద్దక్క అత్తగారికి ఎందుకు బొట్టు ఇవ్వలేదు."

"ఆవిడకి భర్త లేదు".

"భర్త వచ్చినప్పుడే కాదు కదా, ఆవిడకి వాళ్ళమ్మ చిన్నప్పుడే పెట్టింది కదా బొట్టు, సూత్రాలు మటుకు భర్త కట్టి వుండచ్చు."

"వూ..ఇంకా"

"హేళన అవసరం లేదు".

"లేదులే చెప్పు".

" మీ చిన్న వదిన కొడుకుని ఉయ్యాల్లో వేస్తున్నప్పుడు ఆఖరి వదిన్ని ముట్టుకోనివ్వలేదట, ఎందుకని"

"ఏమో..!"

"నేను విన్నాను, ఆవిడకి పిల్లలేరుట, గొడ్రాలుట. ఇందాక పేరంటం జరుగుతుండగా మీ పెద్దన్నయ్య కూతుర్ని లోపలికి రానివ్వలేదు..? ఎందుకంటారు..?'('

"అదేమిటి.. నాకేం తెలుసు..?"

"ఆ పిల్ల ముట్టయిందిట. అందుకే అందరూ కలిసి బహిష్కరించారు. పాపం సిగ్గుతో దూరంగా నుంచుండి పోయింది. వెనక వాటా ఆవిడ్ని మీ అమ్మ నూతిలో నీళ్లు తోడనివ్వడంలేదు తెలుసా.. ఎందుకంటే వాళ్ళకి మైల వచ్చిందట. మనిషి పోవడం ఒక కష్టమైతే ఈ దూరాలు ఏమిటి.? పక్కింటి వాళ్లు ఒకరికొకరు ఎంత సాయంగా ఉండాలి. అదే మాలో ఎంత ఆదుకుంటారో తెలుసా..?"

"ఔనా..?"

"ఔను..?"

"నువ్వు ఇవన్నీ ఎప్పుడు చూశావు. నీకు తెలీదు కదా ఇలాంటివి.."

"అవమానం ఎవరిదైనా సరే నాకు అర్థం అవుతుంది కిరణ్.. అదే సంప్రదాయం అయితే అది నాకు తెలీదు. మా ఇంట్లో ఎప్పుడు ఇలా జరగవు. ఎంతమంది మనుషులుంటే అంత సందడి అనుకున్నాను గానీ అన్ని చీలికలనుకోలేదు."

"చ చ చీలికలేమిటి..అది ..అలా అలవాటు. పెద్దవాళ్ళు ఎప్పుడో ఎందుకో చెప్పి ఉంటారు."

""అదే మరి.. ఎందుకు చెప్పి వుంటారో కూడా తెలీకుండా ఇప్పుడూ ఇంకా పాటించడమేమిటి కిరణ్..పైగా అవన్నీ మిస్సయినట్లు నువ్వు ఏడుపు. మీ వాళ్ళు ఏడుపు.."

"అమ్మ కన్నీళ్ళు నేను చూడలేను మేరీ"

'నాక్కూడా అమ్మ వుంది కిరణ్. ఆవిడకీ కన్నీళ్లు వున్నాయి. అవి నిన్ను పెళ్ళి చేసుకున్నందుకు రావు. నా ప్రేమ మీద నమ్మకం ఉంది. నేను దూరం అయితేనే వస్తాయి."

"దూరం అవమని నేను చెప్పానా, కిందటి నెల్లోనేగా వాళ్లు వచ్చారు."

"అవును నువ్వు ఎంత విసుక్కున్నావో కూడా గుర్తు వుంది. అయినా నా కోసం బెంగపడి నేను ఎందుకు రావడంలేదో అనుకుని రావడం వేరు. నా అంతట నేను నా పుట్టింటికి వెళ్ళడం వేరు. అది ఇంతవరకూ జరగలేదు.

"సారీ మేరీ".

'సారీ కోసం కాదు. వూరికే చెబుతున్నా. నీ కోసం అందర్నీ వదులుకుని వచ్చాను. అందులో ప్రేమ కనపడలేదా కిరణ్.

'నోములు నోచి ఎవరికి నిరూపించాలి. అస్తమానూ దేవుడ్ని అలా కాకా పడతారేమిటి?""?

" చీ వూరుకో కళ్ళు పోతాయి. అది పూజ అంటారు."

"తెలుసులే మాకూ ప్రార్థన ఉంటుంది. మాకు అయితే అందరూ సమానమే ఏ కారణం గానూ ఎవర్నీ దూరం పెట్టం."

"ఔను తెలుసు."

"దేవుళ్ళకి కూడా ఈ నగల పిచ్చేమిటి?"

"ఎక్కడ."

''ఎక్కడేమిటీ? ఇదిగో నీ ఉంగరం మీద ఉన్న వెంకటేశ్వరస్వామికి..'

"అయ్యో చెంపలు వేసుకో మళ్ళీ కళ్లుపోతాయి."

మేరి పడి పడి నవ్వింది.

"నీకు మాత్రం నగల పిచ్చి లేదా?"

"నాకా."

"అవును ఇలా నవ్వగానే అలా ఎన్ని వజ్రాలు మెరిశాయో చూడూ.."

"చాల్లే వూరుకో.."

"ఎలా వూరుకోమంటావూ అదిగో ఇప్పుడేమో కెంపులు మెరుస్తున్నాయి."

"బాబోయ్ నీకేదో అయింది."

''అవును అయింది. ఇంకా చాలా చాలా అవబోతోంది."అంటూ మేరీ అరచేతిని పెదవులకు ఆనించుకుని మీసాలతో కితకితలు పెట్టాడు.

"మేరీ"

"చెప్పు"

"మన పిల్లలకేం పేరు పెడదామంటావు...?'

"ఆలూ లేదు, చూలూ లేదు గానీ"

"అన్నీ ఉంటాయిలే గానీ చెప్పు"

"చెప్పమంటావా.."

"నీ మతమూ వద్దు, నా మతమూ వద్దు"

"మరి"

"పెద్దవాడి పేరు భూమి గుండ్రంగా వుందని కనిపెట్టిన గెలీలియో పేరు పెడదాం. రెండో పిల్ల పేరు ఎవరెస్టు శిఖరం ఎక్కిన వీరుడి పేరు పెడదాం. మూడో పిల్లవాడి పేరు కాన్సరు వ్యాధికి మందు కనిపెట్టిన వాడి పేరు పెడదాం....నాలుగో పిల్ల పేరు

"వాళ్ళకి కూడా మతం ఉంది కదా"

"వుండచ్చు కానీ దేశం కోసం వాళ్ళు సాధించిన విజయాలే గుర్తుంటాయి..నాకు అలాంటి పిల్లలు కావాలి."

"ఇంకా"

"నాకూ చాలా మంది పిల్లలు కావాలి కిరణ్.. నా కడుపున వుట్టకపోయినా ఫర్వాలేదు., బైటనుంచి తెచ్చుకుని పెంచుకుందాం.."

'అలాగే".

చాలా సేపటి వరకూ ఇద్దరికీ మాటలతో అవసరం రాలేదు. అతి మామూలు ఆర్టీసి రేకు డబ్బా లాంటి ఆ బస్సు పూల రథంలా పరిగెడుతోంది.

✦

సామాజిక అంశం

# మహిళలకు మరుగుదొడ్లు లేని భారతదేశం

భారతదేశంలో స్త్రీని దేవతగా కొలుస్తారు. స్త్రీ అంటే ప్రకృతి. స్త్రీ అంటే ఇంతటి పవిత్ర భావన ఉన్న మనదేశంలో మరోవైపు స్త్రీ అంటే ప్రకృతి కాబట్టి, దేవత కాబట్టి వారికి ప్రకృతి సహజమైన మానవీయ అవసరాలు తీర్చుకొనే అవసరం ఉండదని మూర్ఖంగా ఆలోచించే పురుషులు కూడా మన దేశంలో అధికం. మల మూత్ర విసర్జనలు వంటి ప్రకృతి సహజమైన చర్యలు మన దైనందిన జీవితంలో భాగం. స్త్రీ పురుషులు ఇరువురికీ అత్యవసరము. ఈ విషయము గ్రహించి స్త్రీలకు తగిన సదుపాయాలు కల్పించడం ఇంటి యజమాని యొక్క నైతిక బాధ్యత. అయితే అవగాహనా రాహిత్యం వలన మన దేశంలోని పురుషులు ఎటువంటి సదుపాయాలు కల్పించకుండా స్త్రీలు అనేక ఇబ్బందులకు గురయ్యేలా చేస్తున్నారు. కాబట్టి ముందు పురుషులలో సభ్యత, నైతిక విలువలు పెంపొందే దిశగా అవసరమైన అవగాహనా కార్యక్రమాలు చేపట్టాలి. స్త్రీలకు తమ కాలకృత్యాలు తీర్చుకోవడానికి తగిన వసతులు కల్పించకపోవడం వలన జరిగే అనర్థాలను వారికి వివరించాలి. వారి అవగాహనా లోపం వలన వారి భార్యలు, అక్కలు, చెల్లెళ్ళు, తోటి మహిళా సహచరులు కొన్ని సందర్భాలలో ఎటువంటి ప్రాణాంతకమైన ఘటనలు ఎదుర్కొనవలసి వస్తుందో వివరించాలి. జరిగిన సంఘటనలు వారి దృష్టికి తీసుకురావాలి.

ఇటీవల జార్ఖండ్‌లో దుమ్‌కా అనే ప్రాంతంలో జరిగిన ఉదంతం ఇది. అక్కడ 17 ఏళ్ళ బాలిక కుషుబూ తన తండ్రిని తమ పెరటిలో ఒక మరుగుదొడ్డిని కట్టించమని ఎన్నోసార్లు అడిగింది. కానీ ప్రతిసారీ తండ్రి డబ్బులు లేవనో, దీనికంటే ముఖ్యం ప్రహరీగోడ కట్టించడం అనో దాటవేశాడు. తల్లికి చెబితే దానిని కట్టించడంకంటె ఆ అమ్మాయి పెళ్ళికి డబ్బులు వెనకవేయడం ముఖ్యమని ఆమె నోరు మూయించేది. కొంత కాలం తరువాత కుషుబూ మండు వేసవిలో ఒకరోజు తన తాతగారింటికి వెళ్ళి తన గోడు వినిపించి ఈ బాధ నుండి తనను విముక్తి చెయ్యాలని కోరింది. కానీ ఎవరూ ఖాతరు చెయ్యలేదు. "తాను బహిరంగ విసర్జన చెయ్యగా లేనిది తన కూతురు ఎందుకు చెయ్యలేదు?" అని అత్యంత నిర్లజ్జగా తండ్రి అన్నాడు. అమ్మాయి శరీరం, సౌందర్యం అన్నీ కుటుంబ గౌరవానికి అద్దంపట్టేలా ఘనంగా నిర్వహించే పెళ్ళి కోసమేనని వీరి ప్రగాఢ నమ్మకం. కనీసం ఈ కుటుంబ సాంప్రదాయ విలువల్లో మరుగుదొడ్డి ఒక భాగంగా లేకపోవడం ఘోరం. ఒక స్త్రీ గోప్యంగా చేయవలసిన పనులు బహిరంగ ప్రదేశాలలో చెయ్యడం వలన వచ్చే ఇబ్బందులు తట్టుకోలేక తన ఇంట్లోనే కుషుబూ ఆత్మహత్య చేసుకున్నది. అలాగే ఉత్తరప్రదేశ్‌లో కాత్రా గ్రామంలో సుమారు 750 కుటుంబాలు తరతరాలుగా మరుగుదొడ్లు లేకుండానే జీవిస్తున్నారు. ఇలాంటి గ్రామాలు, ప్రాంతాలు మన దేశంలో ఎన్నో. అక్కడి స్త్రీలు వేకువజామునే ప్రకృతి అవసరాలు తీర్చుకున్నాక మళ్ళీ సాయంత్రం చీకటి పడేవరకు ప్రకృతి పిలుపులను బలవంతంగా ఆపుకోవలసిన పరిస్థితులున్నాయి. ఎందుకంటె పట్టపగలు బహిరంగ ప్రదేశాలకు వెళ్ళలేక, ఒకవేళ చీకటి పడ్డాక బయటకు వెళ్ళినా పాములు, క్రూర మృగాల బారిన పడి ప్రాణాలు కోల్పోతున్నారు. ఇదే కాత్రాలో గత మే 27న 14,15 సం॥ల ఇద్దరు బాలికలు చీకటి పడ్డాక బహిరంగ ప్రదేశానికి వెళ్ళి సామూహిక అత్యాచారానికి మరియు హత్యకు గురైన సంఘటన వెలుగులోకొచ్చింది.

ప్రస్తుత మోదీ ప్రభుత్వం ఆహారం అందరి హక్కు ఎలాగో ప్రత్యేక మరుగుదొడ్ల కల్పన కూడా ప్రాథమిక హక్కుగా భావించి గ్రామీణ ప్రాంతాలలోని ప్రభుత్వ పాఠశాలల్లో మరుగుదొడ్లు నిర్మించడానికి కొంత బడ్జెట్‌ను కేటాయించింది. తాను అధికారంలోకి వచ్చాక పరిశుభ్రత పట్ల ప్రజల్లో చైతన్యాన్ని పెంచుతున్నానని మోదీ ప్రభుత్వం గొప్పగా చెప్పుకుంది. ఈ చర్యల ద్వారా బహిరంగ ప్రదేశాలు శుభ్రంగా ఉంటాయని వారి ఆలోచన. దీన్ని ఆధునిక హిందూ, ముస్లిమ్ పురుషులు సహించడం, సమర్థించడం వింతగా వుంది. ఎందుకంటే ఇక్కడ ప్రధానంగా దృష్టి పెట్టాల్సిన అంశం బాలికల యొక్క మరుగు, ఆరోగ్యం మరియు భద్రత.

**17 ఏళ్ళ బాలిక కుషుబూ తన తండ్రిని తమ పెరటిలో ఒక మరుగుదొడ్డిని కట్టించమని ఎన్నోసార్లు అడిగింది. కానీ ప్రతిసారీ తండ్రి డబ్బులు లేవనో, దీనికంటే ముఖ్యం ప్రహరీగోడ కట్టించడం అనో దాటవేశాడు. తల్లికి చెబితే దానిని కట్టించడంకంటె ఆ అమ్మాయి పెళ్ళికి డబ్బులు వెనకవేయడం ముఖ్యమని ఆమె నోరు మూయించేది.**

హిందూ మతంలో ధర్మానికున్న నిర్వచనంలో పరిశుభ్రత ఒక భాగం. హిందూ ధర్మం ప్రకారం మానవుడు రోజూ తన కాలకృత్యాలు అనంతరం తన దేహాన్ని శుద్ధి చేసుకోవాలనుంది. అయితే ఈ మతపెద్దలు, ఈ ధర్మాన్ని ఆచరించేవాళ్ళు తమ దేహశుద్ధి కోసం ఆలోచిస్తారే తప్ప అదే ధర్మాన్ని ఆచరిస్తున్న తమ ఇంట్లో వారి భార్యలో, చెల్లెళ్ళో ఇవే కార్యక్రమాలు పూర్తి చేయడానికి బహిరంగ ప్రదేశానికి వెళ్ళాల్సి వస్తుందని, కొన్ని ప్రాంతాలలో ప్రకృతి అవసరాలకు గంగా, యమునా, నర్మదా వంటి పవిత్ర నదీ జలాలు కూడా కలుషితమవుతున్నాయనే ఆలోచన ఎందుకురాదు?

ఢిల్లీలో ఒక రీసెర్చ్ సెంటర్‌లో ప్యూన్‌గా పనిచేస్తున్న ఒకాయన తన 16ఏళ్ళ కూతురు ఈ ఏడాది గణితంలో 'క్లాస్‌ఫస్ట్' వచ్చిందని గర్వంగా చెప్పాడు. మీ ఇంట్లో మరుగుదొడ్డి వుందా? అని అడిగితే లేదు బాబూ! మరుగు దొడ్డి కట్టడానికి పాతికవేలు

*(తరువాయి 23వ పేజీలో)*

గిరిజన

# విశాఖ ఏజన్సీలో గిరిజన మహిళల స్థితిగతులు

- బి. ప్రభావతి



విశాఖజిల్లాలో గిరిజన ప్రాంతం సముద్రానికి 132 కి॥మీ॥ దూరంలో ఎత్తులో 11 మండలాల్లో 6లక్షల 20 వేల జనాభాతో ఉంది. స్త్రీలు గణనీయమైన సంఖ్యలో వున్నారు. కారణం కడుపులో వున్నది ఆడబిడ్డ అయినా అబార్షన్ చేయించుకోరు. ఈ మంచి సంస్కృతి ఏజెన్సీ ప్రాంతంలో కొనసాగుతుంది. ఆడపిల్లలను లక్ష్మీదేవిగా భావిస్తారు. వీటిలో 1.30 వేలు ప్రిమిటివ్ గ్రూపులకు (పిటిజి) చెందిన ఆదివాసీ కుటుంబాలున్నాయి. ఏళ్ళు గుడుస్తున్నా తరాలు మారినా గిరిజనుల బ్రతుకులు మారలేదు. స్వాతంత్ర్య పోరాటంలో బ్రిటీష్ సామ్రాజ్యవాదమునకు వ్యతిరేకంగా పోరాడి తన ప్రాణాలు అర్పించిన అల్లూరి సీతారామరాజు వంటి దేశభక్తులు పుట్టిన గడ్డ విశాఖజిల్లా.

11 మండలాలు, 244 పంచాయితీలు, 3,500 గ్రామాలు వున్నాయి. వీరి జీవనాధారం అటవీ ఉత్పత్తులైనటువంటి తేనె, కుంకుళ్ళు, చింతపండు, పసుపు, చీపుళ్ళు, ఉసిరి, అడ్డాకులు, అడ్డపిక్కలు, మామిడి, పనసపండ్లు, దుంపలు మొదలైనవి. ఇవికాక పోడు వ్యవసాయంపై ఆధారపడతారు. అలాగే కాఫీ తోటల్లో పనిచేస్తూ 'రేగ' పనులు చేస్తున్నారు. ఎంత కష్టపడినా మూడుపూటలా తిండి దొరకదు. పండించినదానికి గిట్టుబాటు ఉండదు. త్రాగడానికి మంచినీరు కూడా దొరికే పరిస్థితి లేదు. నేటికీ వాగులో నీరు తెచ్చుకోవడానికి 4, 5 కి.మీ. దూరం వెళ్ళి తెచ్చుకోవాలి. ఒక స్త్రీ 3 నుండి 5గం॥ల సమయం మంచినీళ్ళు తెచ్చుకోవడానికే కేటాయించాల్సి వస్తుంది. కొండల్లో వస్తున్న ఊటలు తప్ప త్రాగునీటికి వేరే ఆధారం లేదు. 90% గ్రామాల పరిస్థితి ఇదే.

వర్షాలు వచ్చినప్పుడు ఊటనీరు బురద రావడం, కలుషితం అవడం జరుగుతుంది. దీనివలన మలేరియా, టైఫాయిడ్, కలరా, డయేరియా, థైరాయిడ్ వంటి రోగాల బారినపడి గిరిజన మహిళలూ, వృద్ధులూ, పిల్లలు వందల సంఖ్యలో మరణించడం జరుగుతోంది. 6లక్షల 20 వేల జనాభా గల గిరిజన గ్రామాల్లో సరైన మంచినీటి సదుపాయంలేదు.

చిన్న చిన్న అవాసాలు కలిపి 3,700 గ్రామాలైతే 1313 గ్రామాలకే మంచినీరు అందుతోంది. రక్షిత నీరందేవి 15 గ్రామాలు మాత్రమే. అందుబాటులో నీరు వున్నా గిరిజనులకు నీరందించే దానిలో ప్రభుత్వ వైఫల్యం కనబడుతోంది. నూటికి 90% రోగాలు కలుషితమైన నీటివల్ల వస్తున్నాయని అనేక సర్వేలు తేల్చి చెప్పాయి. దీనిని బట్టి గిరిజనులకు మంచినీటి సమస్య తీవ్రతను తెలియజేస్తుంది.

## ప్రజారోగ్యం

'గిరిజన మహిళలకు, గిరిజనులకు వైద్యం అందని ద్రాక్షే' అన్నది నేటికీ కొనసాగుతున్నది. గిరిజనుల ఆరోగ్యం పట్ల ప్రభుత్వం కనీస జాగ్రత్తలు కూడా తీసుకునే పరిస్థితి లేదు. 108, 104 వంటి వాహనాలు నేటికీ గ్రామాల్లోకి వెళ్ళలేని దుస్థితి. రవాణామార్గం లేక మార్గమధ్యంలోనే మాతా-శిశు మరణాలు ఇక్కడ సర్వసాధారణమైపోయాయి. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు 36 వున్నాయి. బిల్డింగ్ అయితే ఉంది గాని, మందులు వుండవు. ప్రసూతి కేంద్రాలు పాడేరు, చింతపల్లి, హుకుంపేటలో ఉన్నాయి. కానీ లేడీ డాక్టర్ నేటికీ హాస్పిటల్‌లో లేదు. ఇది గిరిజనుల ఆరోగ్యాన్ని కాపాడతామని చేస్తున్న పాలకుల నిర్లక్ష్య ధోరణికి అద్దం పడుతుంది. గిరిజన ప్రాంతంలో సిహెచ్. డబ్ల్యూలు 3,225 మంది. వారికి జీతాలు సక్రమంగా లేకపోయినా, వారికి బిల్లులు చెల్లించకపోయినా వారే గిరిజన గ్రామాలకు డాక్టర్లుగా మహిళలను ఆదుకొంటున్నారు. ఎంతో కొంత వైద్యం గిరిజనులకు అందుబాటులో ఉందంటే అది సిహెచ్. డబ్ల్యూ.ల వల్లనే.

## విద్య

11 మండలాల్లో 35% అక్షరాస్యత అయితే అందులో మహిళలు 25%. అతి తక్కువ అక్షరాస్యత జి.మాడుగుల మండలంలో 17.15%.

**అక్షరాస్యత**

| మండలం | మొత్తం | పురుషులు | స్త్రీలు |
|---|---|---|---|
| అరుకు | 48.38% | 61.55% | 35.11% |
| అనంతగిరి | 29.95% | 40.18% | 19.73% |
| హుకుంపేట | 34.45% | 47% | 21.13% |

| | | | |
|---|---|---|---|
| డుంబ్రిగూడ | 33.43% | 44.40% | 20.45% |
| జి.మాడుగుల | 29.16% | 41.17% | 17.15% |
| పాడేరు | 46.10% | 58.88% | 33.62% |
| జి.కె.వీధి | 32.46% | 42.55% | 22.37% |
| కొయ్యూరు | 40.08% | 48.35% | 31.32% |
| చింతపల్లి | 35.29% | 47.28% | 23.30% |
| ముంచింగిపుట్టు | 31.71% | 43.84% | 19.57% |
| పెదబయలు | 31.71% | 49.05% | 21.90% |

## ఆశ్రమ పాఠశాలలు

గిరిజన సంక్షేమ పాఠశాలలు 116, రెసిడెన్షియల్ పాఠశాలలు 10, కస్తూరిబాయి విద్యాలయాలు 8, మిని గురుకుల పాఠశాలలు 3, కళాశాల వసతి గృహాలు 49, గిరిజన సంక్షేమ ప్రాథమిక పాఠశాలలు 680 ఉన్నాయి. 10వ తరగతి తరువాత కాలేజికి వెళ్ళాలంటే అమ్మాయిలకు మార్గమధ్యలో అనేక ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. నేటికీ అక్షరాస్యత గిరిజన గ్రామాల్లో పై పట్టికను బట్టి చూస్తే ఏ మేరకు అమలవుతుందో అర్థమవుతుంది. హాస్టల్స్‌లో సరైన వసతులు లేక బాలికలకు రక్షణ లేకపోవడం, ఆడపిల్లలు చదువుకోకూడదు అన్న మూఢ విశ్వాసాలు నేటికీ గిరిజన గ్రామాల్లో ప్రబలంగా వున్నాయి.

'భేటీ పడావో', 'భేటీ బచావో' అన్న పథకాలు మాటల వరకే పరిమితమౌతున్నాయి. ఇక్కడ ఇంటర్ నుండి డిగ్రీ వరకు ప్రత్యేక మహిళా కళాశాలలు లేవు. దేశవ్యాప్తంగా వందకోట్లు కేటాయిస్తే, గిరిజన మహిళలకు అమల్లోనే లేదు.

## ప్రజాపంపిణీ - గ్యాస్

ప్రజాపంపిణీ ఏజన్సీలో డి.ఆర్. డిపోల ద్వారా 425 షాపులు వున్నాయి. 250 షాపులు డ్వాక్రా మహిళలు నడుపుతున్నారు. సుదూర ప్రాంతాల నుండి రేషన్ డిపోలకు మహిళలు పనులు మానేసి వస్తున్నా సక్రమంగా ఇవ్వడంలేదు. బియ్యం నెలనెలా ఇచ్చినా పంచదార, కిరోసిన్ మూడు నెలలకొకసారి ఇస్తున్నారు. కుటుంబానికి కావలసిన సరుకులు మార్కెట్‌లో కొనాలంటే పెరిగిన ధరలతో గిరిజన మహిళలు పోటీపడలేని పరిస్థితి ఉంది. ఏజన్సీలో ప్రజాపంపిణీ ద్వారానే కొనుక్కోవాలి. ముఖ్యంగా పి.టి.జి. గ్రూపులకు ఇదే ఆధారం. ప్రజా పంపిణీ వ్యవస్థను పటిష్టపరుస్తామని చెప్పిన పాలకుల మాటలు నీటి మూటలుగానే మిగిలిపోయాయి. ఫలితంగా గిరిజన మహిళలు నూటికి 95 మంది మహిళలు రక్తహీనతతో అనేక రోగాల బారినపడుతున్నారు. గ్యాస్ సమస్య చాలా తీవ్రంగా వుంది. గిరిజన మహిళలు కొండకెళ్ళి కట్టెలు తెచ్చుకుని వంట చేస్తున్నారు. అంత శ్రమపడటం వలన పొగ కళ్ళల్లోకి, ఊపిరితిత్తుల్లోకి వెళ్ళడం వలన క్యాన్సర్ వంటి రోగాల బారినపడుతున్నారు. అమాయక గిరిజన మహిళలు కూడా సరళీకరణ విధానాలను వదలిపెట్టలేదు. కేంద్రప్రభుత్వం చెప్పుకుంటున్న 'స్వచ్ఛభారత్' ఏజన్సీలో బైనాక్యులర్ పెట్టుకొని చూసినా మరుగుదొడ్లు కనపడవు.

## ఐ.సి.డి.ఎస్.

ఐ.సి.డి.ఎస్. కేంద్రాలు ఏజన్సీలో 1126 ఉన్నాయి. మినీ అంగన్‌వాడీలు 1146 వున్నాయి. గిరిజన గర్భిణీ స్త్రీలకు, బాలింతలకు ఆమాత్రమైనా పౌష్టికాహారం అందుతుందంటే అంగన్‌వాడీ కేంద్రాలు ఉండడం వల్లనే. ప్రభుత్వం ఈ సంస్థలను నీరుగార్చడం కోసం బడ్జెట్‌లో కేటాయింపులు కుదించారు. కిషోర్ బాలికలకు ఇస్తున్న పౌష్టికాహారాన్ని ఆపేసారు. విద్యుత్ లేని గ్రామాలు 366. ఇటీవల అరుకువేలీ, పెదలవుడు పంచాయితీని 1500 జనాభా కలిగి 26 గ్రామాలున్న ఈ ప్రాంతాన్ని గౌరవనీయులు ముఖ్యమంత్రి గారు దత్తత తీసుకున్నానని ప్రకటించారు. ప్రకటన తప్ప ఇక్కడ కేటాయింపులు లేవు. సౌకర్యాలు మెరుగుపడలేదు.

## సామాజిక సమస్యలు

గిరిజన మహిళల్లో మూఢ నమ్మకాలు, మూఢ విశ్వాసాలు విపరీతంగా పెరిగాయి. బాల్య వివాహాలు నేటికీ జరుగుతున్నాయి. ప్రేమ పేరుతో గిరిజనేతరుల చేతుల్లో గిరిజన మహిళలు మోసపోతున్నారు. గిరిజన సాంప్రదాయాలు దిగజారుతున్నాయి. గిరిజన మహిళలు శారీరక శ్రమ ఎక్కువగా చేస్తారు. కుటుంబాన్ని పోషించే కీలకమైన బాధ్యత మహిళలు వహిస్తున్నారు. పనిలో ఇచ్చే వేతనం స్త్రీ, పురుషుల మధ్య వ్యత్యాసం ఉంటుంది. గిరిజన మహిళలను బానిసలుగా చూసే పరిస్థితి కొనసాగుతుంది. చదువుకున్న అమ్మాయిలలో పని పేరుతో వలసలు పెరుగుతున్నాయి. అక్కడ అమ్మాయిల పరిస్థితులు వర్ణనాతీతం. పశ్చిమ గోదావరి జిల్లాకు చేపల పెంపకం కోసం ఆడపిల్లల్ని తీసుకువెళుతున్నారు. అతి తక్కువ వేతనం ఇస్తున్నారు. లైంగిక వేధింపులు కూడా వీరిపై పెరుగుతున్నాయి. ప్రపంచీకరణ విధానాల ప్రభావం అమాయక గిరిజన మహిళలపై పడింది. ఇక్కడ స్త్రీలపై అత్యాచారాలు చేసి చంపేసే ఘటనలు కోకొల్లలు. వినిమయ సంస్కృతి పెరిగి తత్ఫలితంగా గిరిజన సాంప్రదాయాలు కనుమరుగవుతున్నాయి. టూరిజం అభివృద్ధి పేరుతో మహిళలు మోసగింపబడుతున్నారు. బహుభార్యత్వం ఉంది.

మరొకవైపు మతసంస్థలయినటువంటి ఆర్.ఎస్.ఎస్. కార్యక్రమాలు ఏజన్సీలో పెరుగుతున్నాయి. ఏకలవ్య స్కూల్స్ పెట్టి విలువిద్య వంటివి ప్రోత్సహిస్తున్నారు. తెగకు తెగకు మధ్య తగాదాలు పెట్టేధోరణి ఈ కాలంలో పెరిగింది. ఇది గిరిజన మనుగడకే ప్రశ్నార్థకం. గిరిజన మహిళల్లో భక్తి భావాలు పెరిగాయి. క్రిష్టియన్ చర్చిలకు వెళ్ళడం పెరిగింది.

68 సం॥లు స్వాతంత్ర భారతంలో గిరిజన మహిళల బ్రతుకుల్లో వెలుగే లేదు.

✦

సీరియల్

# ఆర్నాట్‌లో విజయం - మరో అమ్మ (మేరీ జోన్స్ ఆత్మకథ)

1890కి ముందు పెన్సిల్వేనియాలో వున్న బొగ్గుగని ప్రాంతాలలో కార్మిక సంఘాలు లేవు. కార్మికులలో ఎక్కువ మంది వలస వచ్చినవారు. తక్కువ వేతనానికే పనిచేసేవారు. వివిధ దేశాల నుండి, వివిధ సాంస్కృతిక నేపథ్యాల నుండి రావడం, పలు భాషలు మాట్లాడేవారు కావడంతో వారు సంఘటితం కావడం అంత సులువుగా జరిగేది కాదు. అందుకే కంపెనీ యజమానులు మొత్తం కార్మికుల్లో వలస కార్మికులను ఎక్కువగా పనిలో పెట్టుకొనేవారు. తద్వారా యూరప్ బొగ్గు కంపెనీలు, కార్మికులకు అతి హీనమైన వేతనాలు చెల్లించేవి. భూగర్భంలో పని చేసే గంటలు ఎక్కువ. పని చాలా హానికరమైనది. 14గంటల పని చాలా మామూలు విషయం. కొన్నిసార్లు మాత్రమే 12 గంటలు లేదా 13 గంటలు పని ఉండేది. గని కార్మికుల భద్రతకు ఎటువంటి చట్టాలు లేవు. కార్మిక కుటుంబాలు కంపెనీ షెడ్‌లలో వుండేవి. ఇవి యజమానుల పందులు వుండడానికి కూడా పనికిరావు. పేదరికం, తల్లిదండ్రుల అజ్ఞానం వల్ల వందలాది మంది పిల్లల ప్రాణాలు గాలిలో కలిసిపోయేవి. ఈ పిల్లలను ఖననం చేయడానికి కావలసిన స్థలం సంపాదించడం కూడా కష్టంగా ఉండేది. అందుకోసం నేను కూడా వారికి సహాయపడుతూ ఉండేదాన్ని. బిడ్డల మరణంతో తల్లులు కుమిలి పోయేవారు. అక్కడి కార్మికుల పిల్లల భవిష్యత్తు వారి పుట్టుకతోనే వారి ముఖాన రాసిపెట్టి ఉండేది. అదేమంటే అబ్బాయి అయితే కూలీపని, రాళ్ళుగొట్టే పని. అమ్మాయైతే సిల్క్‌మిల్లులో పని. అప్పటికే వీళ్ళ అక్కలూ, అన్నయ్యలూ ఆ పనుల్లోనే ఉండేవారు.

యునైటెడ్ మైన్ వర్కర్స్ యూనియన్ ఈ ప్రాంతాలలో కార్మిక సంఘాలు నిర్మించాలని నిర్ణయించింది. మనుషులుగా బ్రతికే హక్కుకోసం, మానవీయ పని పరిస్థితుల కోసం పోరాడాలని తీర్మానించింది. కార్మికులు ధైర్యంగా ముందుకు వచ్చి సమ్మె చెయ్యాలన్న నిర్ణయానికి వచ్చాక సమ్మెకు పిలుపునిచ్చాము.

పెన్సిల్వేనియాలోని ఆర్నాట్ నగరంలో సమ్మె నాలుగు, ఐదు నెలలు కొనసాగింది. కార్మికులు నీరసపడ్డారు. సమ్మె విరమించి పనిలోకి వెళ్ళమని కార్మికులను ఒప్పించడానికి డాక్టర్లను, స్కూలు టీచర్లను, లెక్చరర్లను, వాళ్ళ భార్యలను కార్మికుల ఇళ్ళకు కంపెనీ పంపించింది.

సోమవారం నుండి తిరిగి పనిలోకి వెళ్ళడానికి కార్మికులు సిద్ధపడ్డారు. యూనియన్ జిల్లా అధ్యక్షుడు విల్సన్, మరో నాయకుడు టామ్ హగ్గర్టీ నిరాశపడ్డారు. అప్పుడు నేను బార్నేస్‌బోరోలో ఉన్నాను. నేను రావాలనీ లేకపోతే సమ్మె విఫలమౌతుందనీ హగ్గర్టీ శనివారం ఉదయం కబురు పంపాడు.

'అమ్మా! త్వరగా రా, మాకు సహాయం చెయ్యి, కార్మికులు నిరాశగా వున్నారు. సోమవారం నుండి పనుల్లోకి వెళ్ళబోతున్నార'ని హగ్గర్టీ చెప్పాడు.

నేను వస్తాననీ, ఆదివారం ఉదయాన్నే బయలుదేరతానని, రాత్రికే మీటింగ్ పెట్టాలని చెప్పాను.

నేను ఆర్నాట్‌కి బయలుదేరాను. ఆర్నాట్‌కు దగ్గరలో ఉన్న రైల్వే స్టేషన్ రోరింగ్ బ్రాంచ్‌కు చేరుకున్నాను. ఆర్నాట్ యూనియన్ కార్యదర్శి విలియం బౌన్సర్ యువకుడు. నేను ట్రైన్ దిగేసరికి గుర్రపుబగ్గీతో సిద్ధంగా వున్నాడు. మేము 16 మైళ్ళు ఘాట్ రోడ్ల మీద ప్రయాణం చేశాము.

కొంచెం చలిగా కూడా వుంది. మేము ఆర్నాట్‌కు చేరేసరికి ఆదివారం మధ్యాహ్నం అయింది. మమ్మల్ని పట్టణంలో వున్న ఒకే ఒక్క హెూటల్, బొగ్గు కంపెనీ వాళ్ళ హెూటల్‌లో వుంచారు. నేను అభ్యంతరం చెప్పాను. కానీ బౌన్సర్, 'అమ్మా! మేమే ఈగది మీ కోసం తీసుకున్నాము. మీరు రానట్లైతే మళ్ళీ మనకు గది ఇవ్వర'న్నాడు.



మధ్యాహ్నం మీటింగ్ ప్రారంభమైంది. గతంలో వచ్చినంత పుత్సాహంగా ఈ సమావేశానికి కార్మికులు రాలేదు. వచ్చిన పేద కార్మికులను ఉత్సాహపరిచాను.

కార్మికులందరూ కలిసి కట్టుగా వుంటామని, సమ్మె విజయవంతమయ్యే వరకు యూనియన్‌ను అంటి పెట్టుకుని ఉంటామని ప్రమాణం చేయించుకున్నాను. పురుష కార్మికులు ఆలోచనలో పడ్డారు. కానీ స్త్రీలు మాత్రం చేతులలో బిడ్డలను తీసుకొని మరీ ప్రమాణం చేశారు. ఉదయాన్నే ఎవర్నీ పనిలోకి వెళ్ళకుండా చూస్తామని మాట ఇచ్చారు.

మరునటి రోజు ఉదయం 10 గంటలకు తిరిగి సమావేశమవుదామని చెప్పి మీటింగ్‌ను వాయిదా వేశాను. బానిసల్లా పనిలోకి వెళ్ళాలనుకున్న వారంతా తిరిగి మీతో వస్తారని ధైర్యం చెప్పాను.

నేను హెూటల్‌కి తిరిగివచ్చాను. నన్ను రాత్రి భోజనానికి పిలవలేదు. కానీ గని జనరల్ మేనేజరూ, ఇతర అతిథులు చర్చికి వెళ్ళాక గదులు శుభ్రం చేసే హౌస్‌కీపర్ వచ్చి, నన్ను గది ఖాళీ చెయ్యమని, గది ఒక టీచరుకు కేటాయించారని చెప్పింది. 'ఇది చాలా

దారుణం. ఒక కార్మిక నాయకురాలి పట్ల ఇంత అనుచితంగా ప్రవర్తించడం నిజంగా సిగ్గుపడాల్సిన విషయం' అని గొణిగింది. నాకు కోటు వేసుకోవడానికి సహకరించింది.

బౌన్సర్ నా కోసం వరండాలో ఎదురు చూస్తున్నాడు. నన్ను కొండమీద వున్న ఒక గని కార్మికుని ఇంటికి తీసుకువెళ్ళాడు. చల్లగాలి నా టోపీని ఎగురుగొట్టేంత గట్టిగా వీస్తోంది. నేను గని కార్మికుని ఇంటి తలుపుకొట్టాను.

"ఎవరూ" అని గట్టిగా అడిగాడు.

నేను "మదర్ జోన్స్‌ని" అని చెప్పాను.

కిటికీ నుండి వెలుతురు బయటకు వచ్చింది. తలుపులు తెరిచారు.

'అమ్మా ! నిన్ను బయటకు నెట్టేశారా?' అని అడిగాడు.

అవునని చెప్పాను.

"నేను మేరీకి చెప్పాను, ఇలా చేస్తారని" అని అన్నాడు. అతను పట్టుకున్న నూనెలాంతర్ వెలుగులో ఆ ఇంటిని పరిశీలించాను. అతని ముఖంలో కుఱ్ఱతనం కనిపిస్తున్నా, శరీరం మాత్రం వంగిపోయింది.

నన్ను అతని భార్యతో కలిసి ఆ ఇంట్లో ఉన్న ఒకే ఒక్క మంచం మీద పడుకోమని కోరాడు. అతను తన చేతులనే తలదిండుగా చేసుకొని వంటగదిలో టేబుల్‌మీద పడుకున్నాడు. తెల్లవారుతుండగా నాకన్నా ముందుగానే అతని భార్య లేచి పిల్లలను నిశ్శబ్దంగా వుండమని చెప్పింది. నేను చాలా అలసిపోయి వున్నానని, కొంచెంసేపు విశ్రాంతి తీసుకోవాలని ఆమె తాపత్రయం.

8 గంటలకు ఆమె ఏడుస్తూ గదిలోకి వచ్చింది.

'అమ్మా! లేవండి. మనల్నందర్నీ బయటకు పంపేందుకు గని అధికారి వచ్చాడు. ఈ ఇల్లు కంపెనీవాళ్ళది' అని చెప్పింది.

ఆ భార్యాభర్తలు ఇంటిలో వున్న కొద్దిపాటి సామాన్లు, దేవుని ఫోటోలను తీసుకువచ్చి ఒక వ్యాన్‌లో పెట్టారు. ఆ వ్యాన్‌తోపాటు మీటింగ్ దగ్గరకు వచ్చారు. వ్యాన్‌లో వున్న సామాన్లు దేవుని ఫోటోలతోను, పిల్లలతోను కలిసి నేను, ఆ భార్యాభర్తలు వీధులవెంట నడుస్తున్నాము. ఈ దారుణం చూసిన కార్మికులు కోపంతో ఊగిపోయారు. వాళ్ళు పనిలోకి వెళ్ళకూడదని నిర్ణయించుకున్నారు. మీటింగుకు వచ్చారు. విజయం సాధించేదాకా సమ్మె చెయ్యాలని గట్టి నిర్ణయానికి వచ్చారు. సమ్మె విచ్ఛిన్నానికి కంపెనీ గూండాలను తీసుకువచ్చింది.

నేను వారికి ఒక ఉపాయం చెప్పాను. ఈ స్కాబ్‌ల సంగతి చూసుకోవడానికి ఆడవాళ్ళు బయటికి రావాలని, మగవాళ్ళు పిల్లలతో ఇంటిదగ్గర వుండాలని కార్మికులకు చెప్పాను. కార్మిక గృహిణులతో ఒక దళాన్ని తయారు చేసాను. అనుకున్న రోజుకి ఈ గృహిణుల దళం చీపుర్లతో, బూజుదులిపే కఱ్ఱలతో రావాలని. వాటితో గని దగ్గర స్కాబ్స్ పని పట్టాలని ఈ దళానికి పిలుపునిచ్చాను. మా ప్లాను వివరాలు జనరల్ మేనేజర్‌కి, అధికార్లకి, యాజమాన్యం తొత్తులకి తెలిసింది. వాళ్ళు మమ్మల్ని ఎదుర్కోవాలని నిర్ణయించారు. స్కాబ్స్‌ని ఆటకాయించే రోజు వచ్చింది. మహిళలు బూజుకఱ్ఱలు, చీపుర్లు, నీటి బిందెలతో వచ్చారు.

మహిళా సైన్యాన్ని గని ముఖద్వారం దాకా నడిపించమని ఆమెకు చెప్పాను. అట్లు వేసుకొనే పల్చటి పెనాన్ని పట్టుకోమని, దానితో బయటకు వచ్చే స్కాబ్స్‌ను, కంచర గాడిదలను బాదమని, గట్టిగా తిట్టమని చెప్పాను. ఇలా అందరూ చెయ్యాలని, చీపుర్లతో, బూజుకఱ్ఱలతో వారిని వెంబడించాలని, ఎవ్వరికీ భయపడొద్దని చెప్పాను.

ఆమె అరుపులు, కేకలు, పెడబొబ్బలు పెట్టుకుంటూ మహిళా సైన్యాన్ని నడిపించింది. బొగ్గు నింపుకుని కంచరగాడిదలు గనినుండి బయటకు రాగానే పెనంతో కొట్టింది. పెద్దగా కేకలు వేసింది. ఆమెతో మిగిలిన స్త్రీలందరూ కలిశారు. ఒక అధికారి వచ్చి ఆమె భుజం తట్టాడు. కంచరగాడిదలను భయపెట్టవద్దన్నారు. దాంతో ఆమె అట్లపెనంతో అధికారిని గట్టిగా కొట్టి కేకలు పెట్టింది. ఈ కంచరగాడిదలు, నువ్వు నరకానికి పోతారని తిట్టిపోసింది. దీనితో అతను ప్రక్కనే పారుతున్న నీటిపాయలోకి పడ్డాడు. ఈ గొడవకి కంచరగాడిదలు బెదిరిపోయి తిరగబడ్డాయి. స్కాబ్స్‌ను వెనక కాళ్ళతో తన్ని పరుగులు పెట్టాయి. మహిళా సైన్యం కూడా బూజు కఱ్ఱలు, చీపుళ్ళు, నీళ్ళ బిందెలతో స్కాబ్స్‌ను వెంబడించింది. ఈ మహిళా సైన్యం దెబ్బకి స్కాబ్స్ కూడా కొండమీద నుండి క్రిందకు పరిగెట్టారు.

**12 గంటలు లేదా 13 గంటలు పని ఉండేది. గని కార్మికుల భద్రతకు ఎటువంటి చట్టాలు లేవు. కార్మిక కుటుంబాలు కంపెనీ షెడ్‌లలో వుండేవి. ఇవి యజమానుల పందులు వుండడానికి కూడా పనికిరావు. పేదరికం, తల్లిదండ్రుల అజ్ఞానం వల్ల వందలాది మంది పిల్లల ప్రాణాలు గాలిలో కలిసిపోయేవి. ఈ పిల్లలను ఖననం చేయడానికి కావలసిన స్థలం సంపాదించడం కూడా కష్టంగా ఉండేది. అందుకోసం నేను కూడా వారికి సహాయపడుతూ ఉండేదాన్ని. బిడ్డల మరణంతో తల్లులు కుమిలి పోయేవారు. అక్కడి కార్మికుల పిల్లల భవిష్యత్తు వారి పుట్టుకతోనే వారి ముఖాన రాసిపెట్టి ఉండేది.**

నేను ఈ పోరాటంలో ముందు నిలవకూడదని నిశ్చయించుకున్నాను. నన్ను అరెస్టు చేస్తారని నాకు ముందే తెలుసు. నేను అరెస్టు అయితే ఈ మహిళా సైన్యం చెదిరిపోతుంది. నాకు బదులుగా ఒక ఐరిష్ మహిళను నాయకురాలిగా ఎంపిక చేశాను.

అప్పట్నించి గనుల్లోకి స్కాబ్స్‌ను తీసుకురాకుండా చూసేందుకు మహిళలు నిఘా వేశారు. ప్రతి రోజూ ఒక చేత్తో చీపుర్లు, బూజుకఱ్ఱలను మరో చేతిలో చంటి

బిడ్డలతో గనుల దగ్గరకు వెళ్ళేవారు. గనిలోపలికి ఎవ్వరూ వెళ్ళకుండా కాపలా కాసేవారు. అలాగే రాత్రుళ్ళు కూడా కాపలాలు కాసేవారు. వాళ్ళే నాయకులు. రానున్న సంవత్సరాలలో దేశం అభివృద్ధి చెందేందుకు వాళ్ళు చేసిన పోరాటానికి గొప్ప నివాళులందుకుంటారు.

నేను కంపెనీ చుట్టుప్రక్కల మీటింగులు పెట్టాను. రైతులకు కంపెనీ డబ్బులిచ్చి, కార్మికులకు ఎటువంటి సహాయం చేయవద్దని కోరేది. నేను ఒక కార్మికుని కొడుకు సహాయంతో కంచరగాడిదలతో నడిచే ఒక పాత వ్యాగన్‌లో రైతుల దగ్గరకు వెళ్ళి, వాళ్ళను ఒప్పించి సమ్మెకు రైతుల మద్దతు కూడగట్టాను. రైతులు కార్మికుల పక్షాన నిలిచారు.

కొన్నిసార్లు నేను ఇంటికి వచ్చేసరికి ఉదయం పన్నెండు లేదా ఒంటిగంట అయ్యేది. వ్యాగన్ డ్రైవర్‌గా వున్న ఆ చిన్న కుర్రాడు నాభుజం మీద తల ఆన్చి పడుకుంటే నేనే కంచరగాడిదను తోలేదాన్ని. కొన్నిసార్లు సున్నా కన్నా తక్కువ డిగ్రీల ఉష్ణోగ్రత ఉండేది. కొండ గాలులు రయ్యిమని వేచేవి. మంచు కురిసేది. కొన్ని సార్లు మంచువాన పడేది. తరచుగా నా కాళ్ళు చేతులు తిమ్మిరులెక్కేవి. మేమంతా ఎండిన బ్రెడ్లు, కాఫీ డికాషన్‌తో బ్రతికాము. నేను పడుకున్న గదిలో ఎప్పుడూ చలి మంట లేదు. ఉదయం లేచే సరికి నా పరుపుపై బట్టలు మంచుతో తడిచిపోయివుండేవి.

ఆర్నాట్ దగ్గరలో స్వీడీ టౌన్ అనే ప్రాంతం వుంది. అక్కడకు కంపెనీ ఏజెంట్లు వెళ్ళి అక్కడ వున్న స్వీడన్ దేశస్థులను ఉపయోగించుకొని సమ్మెను విచ్ఛిన్నం చెయ్యాలనుకున్నారు. నేను కంపెనీ ప్రయత్నాలను తెలుసుకొని రైతులతో మీటింగు పెట్టాను. దీనితో యువరైతులు వాళ్ళ గుర్రాలపై స్వీడీ టౌన్‌కి వెళ్ళి, ఒక్క స్వీడన్ దేశస్థుడు కూడా టౌన్ వదిలి వెళ్ళకుండా సమ్మెకు సహకరించేలా చేశారు. ఇంకా ఎవరైనా ఆర్నాట్ వైపుగా వెలితే వాళ్ళను వెంటనే వెనక్కి లాక్కునేవారు.

ఈ గడ్డు పరిస్థితి కొన్ని నెలలు సాగింది. ఆ తరువాత సమ్మె విజయవంతం కాబోతుందన్న ఆశ చిగురించింది. గనులు నడవడం లేదు. కార్మికుల చైతన్యం దివ్యంగా వుంది. అధ్యక్షుడు విల్సన్ వచ్చాడు. నేను అతని ఇంట్లో వుండేదాన్ని. అతని కుటుంబం పడుకున్న తరువాత మేము కూర్చోని సమ్మె పరిస్థితిని చర్చించుకుంటున్నాం. అప్పుడు ఎవరో తలుపు తట్టారు. లోపలికి రమ్మని విల్సన్ ఆహ్వానించారు.

ముగ్గురు వ్యక్తులు ప్రవేశించారు. వాళ్ళు నన్ను చూసి ఇబ్బంది పడ్డారు. దానితో విల్సన్ నన్ను ప్రక్క గదిలోకి వెళ్ళమని కోరాడు. వాళ్ళు సమ్మె విరమణ గురించి మాట్లాడారు. సమ్మె విరమింపచెయ్యాలని, అలా చేస్తే 25,000 డాలర్లు బహుమానంగా ఇస్తామని, బ్యాంక్ కంపెనీదే గనుక బ్యాంకు రుణం మాఫీ చేస్తామన్నారు.

దానికి విల్సన్ ఇచ్చిన సమాధానాన్ని నేను ఎన్నటికీ మర్చిపోను.

'అయ్యలారా! మీరు మా ఇంటికి అతిథులుగా వస్తే, అందుకు నా కుటుంబం మొత్తం మిమ్మల్ని ఆదరిస్తుంది. కానీ మీరు నాకు డాలర్లు లంచం ఇవ్వదాన్నికవస్తే, అది నా మానవత్వాన్ని, నాపై నా సోదర కార్మికుల నమ్మకాన్ని వంచించడమే అవుతుంది. కనుక మీరు తక్షణం ఇక్కడి నుండి పొండి. మళ్ళీ ఎప్పుడూ రావద్దు' అని హెచ్చరించాడు.

ఫిబ్రవరి చివరిలో కంపెనీ అన్ని డిమాండ్లను అంగీకరిస్తూ నోటీసు పెట్టింది. మహిళలు 'మీటింగు పెట్టుకోవడానికి హాలు ఇస్తారా?' అని అడిగారు. మనం అది అడగలేదంటే, అయితే, మళ్ళీ సమ్మె చేద్దామన్నారు.

వాళ్ళకు హాలు లభించింది. సిన్సిన్నాటీలో జరిగిన సమావేశం నుండి వచ్చిన అధ్యక్షుడు విల్సన్ సంతోషంతో, కృతజ్ఞతో కన్నీళ్ళ పర్యంతమయ్యాడు.

నేను సెంట్రల్ ఫీల్డ్సకి తిరిగి వెళ్ళాల్సి వచ్చింది. నేను వెళ్ళబోయే ముందు

**'అయ్యలారా! మీరు మా ఇంటికి అతిథులుగా వస్తే, అందుకు నా కుటుంబం మొత్తం మిమ్మల్ని ఆదరిస్తుంది. కానీ మీరు నాకు డాలర్లు లంచం ఇవ్వదాన్నికవస్తే, అది నా మానవత్వాన్ని, నాపై నా సోదర కార్మికుల నమ్మకాన్ని వంచించడమే అవుతుంది. కనుక మీరు తక్షణం ఇక్కడి నుండి పొండి. మళ్ళీ ఎప్పుడూ రావద్దు' అని హెచ్చరించాడు.**

బ్లూమ్సబర్గ్‌లో సమ్మె విజయోత్సవ సభ పెట్టారు. మహిళలు మంచు, గాలివానలను చీల్చుకుంటూ మైళ్ళ దూరం నుండి చిన్న పిల్లలతో, శాలువాలలో పసిబిడ్డలతో మీటింగుకి వచ్చారు. ఎక్కువమంది గని కార్మికులు మైళ్ళ దూరం నడిచి వచ్చారు. ఆ రాత్రి ఆనందోత్సాహాలతో ఉత్సవం జరుపుకున్నారు.

ఒక చిన్న పిల్లవాడు వచ్చి "అమ్మా! మమ్మల్ని వదిలి వెళ్ళవద్దని"కోరాడు. పిల్లలు ఆనందంతో నా చేతుల్ని ముద్దాడారు. బ్లూమ్స్ బర్గ్‌లో రాత్రంతా మేము వేడుక జరుపుకున్నాము. కార్మికులు త్రాగడానికి బీరు తెచ్చారు. ముసలి, పడుచు అన్న తేడా లేకుండా రాత్రంతా ఆడి, పాడాము. కంపెనీకి సంబంధించిన వారెవ్వరూ జోక్యం చేసుకోలేదు. అవి విపరీతంగా తుపాకులను మిలిటరీని, జైళ్ళను, పోలీస్ లాఠీలను ఉపయోగించే రోజులు. కానీ ఈ పోరాటంలో రక్తపాతం లేదు. అల్లర్లు లేవు. మహిళా సైన్యం యొక్క బూజు కర్రలు, చీపుళ్ళవలనే ఈ విజయం లభించింది.

ఒక సం॥ తరువాత వాళ్ళు విజయోత్సవ వార్షికోత్సవం జరిపారు. ఆ సందర్భంగా యూనియన్ నాయకులు నాకు బంగారు గడియారం బహుమతిగా ఇవ్వబోయారు. వద్దని వారించాను. దీని మూల్యం చిన్న పిల్లల కడుపు నింపే రొట్టె అని నాకు తెలుసు. నేను మళ్ళీ ఆర్నాట్ వెళ్ళకపోయినా, ఇతర ప్రాంతాలకు వెళ్ళేటప్పుడు సమ్మెను సాహసవంతంగా నడిపిన కార్మికులను, వారి పిల్లలను కలుస్తూ ఉండేదాన్ని. (సశేషం)

# మెల్లీ సోలింగర్

- వకుళాభరణం లలిత

స్విట్జర్లాండ్ దేశపు ప్రధాన నగరమైన జ్యూరిచ్ పట్టణంలో 28-3-1898న జన్మించింది మెల్లీ సోలింగర్. జర్మన్ మాతృభాషగా గల్గిన స్విట్జర్లాండ్ దేశస్థులైన ఆధల్ఫ్, బెర్తా సోలింగర్ గార్ల ఏకైక పుత్రిక. సంపన్న కుటుంబీకులు. మెల్లీకి ఉన్నత విద్య చెప్పించాలనే అభిలాషతో సెంటోగ్రాయిల్స్ నగరంలో ఫ్రెంచ్ భాషలో పాండిత్యం సంపాదించడానికి ఆ నగరంలో ప్రసిద్ధిచెందిన బోర్డింగ్ స్కూలుకు పంపారు. 1914లో మెట్రిక్యులేషన్ పరీక్ష పాసైన తరువాత జ్యూరిచ్ నగరంలో హెూమ్ సైన్స్ కాలేజీలో చేరి పట్టభద్రురాలయ్యారు.

ఆమెకు వైద్య విద్యయందు ఆసక్తి ఎక్కువ. యూనివర్శిటీ మెడికల్ కాలేజీలో వైద్య విద్యనభ్యసించడం ప్రారంభించారు. యుద్ధకాలం అవటం వల్ల తండ్రి భాగస్వామ్యంతో నడిచే కృత్రిమ పట్టు (రేయాన్) ఫ్యాక్టరీ పూర్తిగా ధ్వంసం కావటంతో వ్యాపారంలో వారికి అపార నష్టం కల్గింది. సుసంపన్నమైన కుటుంబం ఒక్కసారిగా ఆర్థికంగా చితికిపోయింది. మెల్లీ వైద్య విద్యాభ్యాసాన్ని ఆపి, తండ్రిగారి వ్యాపారంలో తండ్రికి ఆంతరంగిక కార్యదర్శిగా పనిచేయాల్సి వచ్చింది.

వ్యాపార సందర్భంగా దక్షిణ జర్మనీ వంటి ప్రదేశాలను పర్యటించారు. అప్పట్లో ట్యూబిన్గన్ యూనివర్శిటీలో విద్యనభ్యసిస్తున్న ఉప్పల లక్ష్మణరావు గారితో పరిచయమైంది. అప్పటికే ఆమెకు హిందూదేశంపై అభిమానం ఏర్పడింది. హిందూదేశాన్ని గూర్చిన అనేక గ్రంధాలు చదివారు.

ఆనాటికే భారతదేశ రాజకీయాల్లో గాంధీయుగం ప్రారంభమైంది. మెల్లీకి, లక్ష్మణరావుతో స్నేహం పెరిగి ప్రగాఢమైంది. మొదటినుంచీ సోషలిజమూ, ప్రపంచ కార్మికోద్యమంచే ఆకర్షించబడి, గాంధీయిజం పట్ల అత్యంత ఆసక్తి కనబరుస్తూండేవారు.

గాంధీ గారి గూర్చి రాసిన అనువాద గ్రంధాలు చదివి, హిందూదేశ మత, సాంఘిక, రాజకీయ, ఆచార పరిస్థితులను మిత్రుని వల్ల తెలుసుకొనేవారు.

స్త్రీ జనోద్ధరణకు ఉద్యమాల్లోనూ, స్త్రీలకు ఎన్నిక హక్కును సాధించడానికి జరిగిన ప్రయత్నాల్లో ఈమె విద్యార్థి దశలోనే ఇంటింటికీ వెళ్ళి ఓటు హక్కును గూర్చి ప్రభోదించే వారు.

స్విట్జర్లాండ్లోని పెట్టుబడిదారులు, కార్మికుల పనికాలం పెంచటానికి ఆ దేశ రాజకీయ విధానాన్ననుసరించి, ప్రజాభిప్రాయం సేకరించే ప్రయత్నం చేశారు. కార్మికుల ఆందోళనల్లో, ఆమె వారి పక్షాన చురుకుగా పనిచేశారు. ప్రజాభిప్రాయంప్రకారం పనికాలం పరిమితమయింది.

లెనిన్ మహాశయుని అన్త్యమయం సందర్భంగా జ్యూరిచ్ పట్టణంలో కార్మికుల ప్రదర్శనలో ఈమె పాల్గొన్నారు.

హిందూదేశం సందర్శించడానికి రెండుసార్లు ప్రయత్నించారు. కానీ పాస్పోర్ట్ దొరకలేదు. చివరకు 1929లో తండ్రిగారి వ్యాపార సందర్భంగా హిందూ దేశం సందర్శించడానికి వీసా లభించింది. తన మాతృదేశంగా ఎన్నుకొన్న గడ్డపై కాలుపెట్టారు. తను ఊహించుకొన్న భారతదేశానికీ, యదార్థానికీ ఎంత వ్యత్యాసముందో తెలుసుకున్నారు. ప్రజల నికృష్ట దుర్భర జీవితానికి కారణం విదేశీ వలస పాలనయేననీ, దేశ స్వాతంత్ర్యం మాత్రమే దీనికి పరిష్కారమనీ గ్రహించారు. గ్రామీణ ప్రజల స్థితిగతులను స్వయంగా చూచి తెలుసుకొన్నారు. వ్యాపారం కోసం కొన్ని నెలలు ఆమె కలకత్తాలో నివసించారు. హిందూదేశాన్ని, ప్రజల గూర్చి తెలుసుకోవాలనే కోరికతో అనేక యాత్రాస్థలాలను సందర్శించారు. భారతీయ హృదయ స్పందనను తెలుసుకోగల్గారు.

లాహెూరు కాంగ్రెసులో తొలిసారిగా గాంధీజీ, నెహ్రూ గార్లను కలుసుకున్నారు. సబర్మతీ ఆశ్రమానికి వెళ్ళారు. అక్కడ పత్తి ఏకటం, నూలు తీయటం వంటివి అభ్యసించారు. ఆశ్రమం చుట్టూ రక్షణ కోసం గస్తీ తిరగటంలో స్త్రీలు కూడా పాల్గొనటం ఉచితమని ఆమె ఆశ్రమ సంచాలకులతో విన్నవించారు. ఆశ్రమ స్త్రీలలో ధైర్యస్థైర్యాలను పెంచటానికీ, ఆశ్రమ విధుల పాటింపులో స్త్రీ, పురుష వ్యత్యాసం ఉండకూడదనీ భావించి, ఈ సందర్భంగా ఎర్రవాడ జైల్లో వున్న గాంధీగారి పేరను దీర్ఘమైన లేఖలు రాసారు. అందుకు అవసరమైన ధైర్యసాహసాలు, మనస్థైర్యం ఆశ్రమ స్త్రీలకు కలవో లేవో అని గాంధీగారు సందేహించి ఆమె అభ్యర్థనను నిరాకరించారు. స్త్రీలకు తమ ధైర్య సాహసాలను చూపే అవకాశం ఇవ్వాల్సిందిగా ఆమె తగు సూచనలతో గాంధీగారికి మరల లేఖ రాశారు. ఈ విషయంలో మెల్లీగారి సూచనలను అంగీకరించి ఆయన ఆశ్రమ నిబంధనల మార్పునకు అనుమతినిచ్చారు.

సబర్మతిలో ఆ కాలంలోనే కీ.శే. పొట్టి శ్రీరాములు ఉండటంతో వారితో ఆమెకు సన్నిహిత స్నేహం ఏర్పడింది. ఆశ్రమం నుంచి వచ్చిన తర్వాత ఆంధ్రదేశంలో సన్న నూలు ఖద్దరు కేంద్రమైన శ్రీకాకుళం నగరంలో నివసించారు. అప్పుడు అనేక పట్టుశాలీ కేంద్రాలను సందర్శించారు. అక్కడ వారవలంబించే పద్ధతులను క్షుణ్ణంగా అభ్యసించారు. అఖిల భారత చరఖా నూలు సంఘానికి కొన్ని సూచనలు చేయగలిగారు. ఈ పరిశోధన ఫలితాలను భారతి మాసపత్రికలోనూ, ఇంగ్లీష్ మోడరన్ రెవ్యూలోనూ ధారావాహికంగా నాలుగైదు వ్యాసాలను రాసి పంపారు.

విశాఖ పట్టణంలో జరిగిన విదేశీ వస్తు బహిష్కరణ ఉద్యమంలో పాల్గొన్నారు.

ఆంధ్ర దేశంలో పర్యటిస్తున్నప్పుడు కాకినాడలో శ్రీమతి దుర్గాబాయి వారి హిందీ స్కూలును సందర్శించి ఆమెతో పరిచయం ఏర్పరచుకొన్నారు. గుంటూరు పర్యటనలో శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మ గారిని దర్శించి వారి శారదానికేతన్ స్కూలును సందర్శించారు. ఇలా ఎంతోమంది ప్రముఖులతో పరిచయాలు చేసుకున్నారు.

అవి హరిజనోద్ధరణ రోజులు. హరిజనోద్ధరణ సందర్భంగా కలకత్తా ఝూట్ ఫ్యాక్టరీ శివార్లలో ఉన్న కార్మిక మురికివాడల్లో హరిజనుల కోసం స్థాపించబడ్డ ఆసుపత్రిలో నర్సుగా, మురికివాడ శిశువుల సంరక్షకురాలిగా పనిచేశారు.

తూర్పు గోదావరి జిల్లాలో ముస్తాఫా అలీఖాన్ అనే పోలీసు సూపరింటెండెంటు, విదేశీయులైన మీరు బ్రిటీష్ పరిపాలనకు వ్యతిరేకంగా ఖద్దరు ప్రచారం చేయటం సరైంది కాదనీ, అదే విధంగా కొనసాగిస్తే హిందూదేశం నుంచి బహిష్కరింపబడే ప్రమాదం ఉందనీ మెల్లీని బెదిరించాడు. గవర్నమెంటు వారు ఖద్దరునూ, రాట్నం వడకటం నిషేధించినట్లు ఎరుగననీ, దానికి సంబంధించిన జి.వో.ను తనకు చూపిస్తే తాను ఉద్యమం నుంచి విరమించుకొంటాననీ, అలా కాకుండా తనను పోలీసువారు చట్టసమ్మతాలైన తన కార్యకలాపాలను నిరోధించినట్లయితే, స్విట్జర్‌లాండ్ దేశస్థురాలైన తను, తన రాయబారికి ఫిర్యాదు చేయగలననీ, ఆ ఫిర్యాదు అంతర్జాతీయ సమస్యగా రూపొందే అవకాశం ఉందనీ ఆమె సవాలు చేశారు. దాంతో, ఆ సంభాషణ ముగియటమే కాక, అంతవరకూ ఆమెపై ఉన్న పోలీసు నిఘా కూడా తగ్గిపోయింది.

1934లో స్వదేశంలోని తన తండ్రిగారికి అస్వస్థతగా వుందని తెలిసి స్వదేశానికి తిరిగి వెళ్ళారు. ఆమెకూ, లక్ష్మణరావుగారికీ ఏర్పడ్డ పరిచయం, 1936 నాటికి ప్రేమగా పరిణమించింది. ఆనాటి హిందూ వివాహ చట్టం ఈనాడున్నట్లు లేకపోవటంతో, హిందూ దేశ పద్ధతుల్లో కాక, రాజకీయ, సాంఘిక, ఆర్థికాది అన్ని

**లాహోరు కాంగ్రెసులో తొలిసారిగా గాంధీజీ, నెహ్రూ గార్లను కలుసుకున్నారు. సబర్మతీ ఆశ్రమానికి వెళ్ళారు. అక్కడ పత్తి ఏకటం, నూలు తీయటం వంటివి అభ్యసించారు. ఆశ్రమం చుట్టూ రక్షణ కోసం గస్తీ తిరగటంలో స్త్రీలు కూడా పాల్గొనటం ఉచితమని ఆమె ఆశ్రమ సంచాలకులతో విన్నవించారు. ఆశ్రమ స్త్రీలలో ధైర్యస్థైర్యాలను పెంచటానికీ, ఆశ్రమ విధుల పాటింపులో స్త్రీ, పురుష వ్యత్యాసం ఉండకూడదనీ భావించి, ఈ సందర్భంగా ఎర్రవాడ జైల్లో వున్న గాంధీగారి పేరను దీర్ఘమైన లేఖలు రాసారు.**

విషయాల్లో స్త్రీ పురుష సమానత్వమూ, విడాకుల సమాన హక్కులనూ గల్గిన ఏకైక దేశమైన రష్యాలోనే, ఆ చట్ట పద్ధతుల ప్రకారమే వివాహం చేసుకొంటాననీ, లక్ష్మణరావుగారు అందుకు అంగీరిస్తే సోవియట్ రష్యా రావాలనీ ఆమె తెలియజేశారు. అనాటికి బ్రిటిష్ గవర్నమెంటు కానీ, ఇండియా గవర్నమెంటుకానీ సోవియట్ రష్యాను గుర్తించక పోవటంతో పాసుపోర్టు విషయంలో కొంత జాప్యం జరిగింది. చివరకు 1937 ఆగస్టు 30న సోవియట్ పద్ధతుల ప్రకారం రిజిష్టరీ వివాహం జరిగింది. తర్వాత ఆమె కూడా హిందూదేశం వచ్చారు.లక్ష్మణరావు గారి ఉద్యోగరీత్యా బెజవాడలో స్థిరపడిపోయారు.

సత్యాగ్రహంలో పాల్గొని, అరెస్టయి, 9నెలల పాటు వేలూరు స్త్రీల జైల్లో శిక్ష అనుభవించారు. విడుదలైన కొద్దినెలలకే మళ్ళీ సత్యాగ్రహంలో పాల్గొని వేలూరులోనే జైలుశిక్షను అనుభవించారు. జైలు నుంచి తిరిగి వచ్చేనాటికి క్విట్ ఇండియా ఉద్యమం ఉధృతంగా సాగుతోంది. మెల్లీ ఉద్యమంలోకి ఉత్సాహంగా ఉరికి 1942లో క్విట్ ఇండియా నినాదం ఇస్తూ, పోలీసు లాఠీలకు భయపడక అరెస్టయ్యారు. బెజవాడ తాలూకాఫీసు సబ్‌జైలులో రిమాండులో ఉన్నారు. అక్కడ స్త్రీ ఖైదీలకు స్నానానికీ, మరుగుకు కానీ సరైన సదుపాయాలు లేవు. జైలు అధికారులకు తెలియజేసినా వారు నిర్దాక్షిణ్యంగా నిరాకరించారు. అందుకోసం నిరాహారదీక్ష చేసారు. వారం రోజులకు ఆమె ఆరోగ్యం క్షీణించింది. ఆరోగ్యం క్షీణంచిన తర్వాత జైలు అధికారులకు కనువిప్పు కలిగి ఆమె కోరిన సౌకర్యాలు కలిగించారు.

జైల్లో ఆమెకు చాలామంది స్త్రీ సత్యాగ్రహులతో పరిచయమైంది. 1947 నుంచి 1950 వరకూ తన 80 ఏళ్ళ వృద్ధురాలైన తల్లితో కొంతకాలం గడపటానికి యూరప్ వెళ్ళారు. గాంధీజీ హత్యగావించబడ్డ తర్వాత ఆ వార్త విని, ఆయన గూర్చి 4,5 వ్యాసాలను జ్యూరిచ్‌లోని సోషలిస్టు పత్రిక volks - reaht దినపత్రికలో ప్రచురించారు.

కృష్ణాజిల్లా మహిళా సంఘానికి ఉపాధ్యక్షురాలిగా, విజయవాడ మహిళా సంఘానికి కొన్నాళ్ళు అధ్యక్షురాలిగా పనిచేశారు. ఈ కాలంలో మహిళా ఉద్యమంలో క్రియాశీలంగా పనిచేసిన కొంతమంది స్త్రీ ప్రముఖులతో కలిసి కృష్ణాజిల్లా బాలనేరస్థుల పునరావాస సంఘం స్థాపించి, చాలాకాలం దానికి ఉపాధ్యక్షురాలిగా పనిచేశారు.

కాంగ్రెసు రాజకీయాలపై నానాటికీ మెల్లీకి విశ్వాసం సడలిపోతుండేది. ఐరోపాలో స్థిరనివాసం ఏర్పరచుకోవాలని నిశ్చయించి హిందూదేశం నుంచి 1957లో జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్‌కు వెళ్ళారు. తర్వాత భారత కమ్యూనిస్టు పార్టీ సభ్యురాలిగా చేరారు. కాంగ్రెసు నుంచి వైదొలగినా, ఖద్దరుపైనున్న భక్తిమాత్రం తగ్గలేదు. జీవితాంతం ఖద్దరు ధరించారు. మెల్లీగారికి క్రీడలన్నా అత్యంత ఆసక్తి. పర్వతారోహణ హైకింగు మొదలైన వాటిపై అత్యంత అభిలాష. ఈత అంటే ఆమెకు ప్రాణం.

ఒకసారి సొంత పనిపై రాజోలు వెళ్ళగా, సరసాపురానికి తిరిగి రావడానికి లాంచీ ఎక్కారు. నాలుగు గంటల్లో

*(తరువాయి 25వ పేజీలో)*

కథ

# కట్ట

- వినోదిని



రేపట్నుంచి మా జూనియర్ కాలేజీకి పన్నెండు రోజులు సెలవలని వినగానే నా గుండెల్లో రాయి పడింది. మా ఆస్టల్ అన్నంలో దొరికేంత చిన్నసైజు కాదు. రైలు కట్ట మీదుంటదే, చేతిలో సరిపోయేంతది, అంతది!

అందరూ బట్టలు సర్దేసుకుంటున్నారు. చాలా సంతోషంగా ఉన్నారు. ఈ సెలవల్లో యేయే పనులు చేస్తారో, యేమేం తింటారో, యెక్కడెక్కడికి వెళతారో చాలా ఉత్సాహంగా చెబుతున్నారు. యివేమీ నన్ను ఆకర్షించలేకపోయాయి. వాళ్ళెంత లేటుగా లేస్తారో అని చెబుతున్నారే... అది మాత్రం రేపది 'తెల్లగ తెల్లవారడం' గురించి నన్ను ఆలోచనలో పడేసింది. అసూయలో కూడా!

ఆస్టల్ నుంచి బ్యాగు తీసుకొని బయటకొచ్చి బస్సెక్కి యింటికొచ్చే సరికే రాత్రి ఎనిమిదయింది. యూరియా సంచులు కలిపి కుట్టి నాలుగు మూలలా పాతిన బొంగులు ఆసరాతో మూడు గోడల్లా చుట్టి, తలుపు బదులు మా అమ్మ పాత చీర అడ్డంగా కట్టిన బాత్రూం. లోపల పరచిన రెండు ఇరిగిపోయిన నాపరాళ్ళు. వొకపక్కన బురదలోకి కూరకపోతంటే, వేడినీళ్ళతో మొుకం కాళ్ళు చేతులు కడుక్కొని లోపలికెళ్ళా. మా అమ్మా, నాన్న, శాం అన్నయ్య అన్నానికి కూర్చుంటున్నారు. వుడుకుడుకు అన్నం, వేడివేడి కరుగులు, గోంగూర పచ్చిమిరగాయలు వుడకబెట్టి నూరిన పచ్చడి. పెద్దుల్లిపాయ, చిన్నుల్లిపాయ యేసి మా అమ్మ రోట్లో యేసి నూరిందంటే...' యింగతే సంగతి. మా అన్నయ్యేమో బొట్నేలు కాడ్నుంచి చిటికినేలు దాకా నాక్కుంటా - 'వోమా పచ్చడి సూపరుహిట్టే, వండాడిందనుకో...' అంటాడు, ఆస్టల్లో వుప్పూ, కారం లేని కూరలు తినటం మూలాన నా నాలికంతా చప్పబడిపోయింది. దొరికిందే సందని అన్నంలో యెక్కువ పచ్చడి యేస్కోని బాగా పిసికి ముద్దలు ముద్దలు జేస్కోని తిన్నా. 'యింకొద్దిగ వచ్చడెయ్యవ్మా' అని అడిగడిగి యేపిచ్చుకుని తిన్నా. అంత తినబట్టేనేమో' కుటుంబ ప్రార్ధన జరుగుతుండగానే కళ్ళు మూతలు పడ్డయ్.

నున్నగా అలికిన నేలమీద బొంతేసుకొని మమ్మా నేను పొణుకున్నాం. బయట జల్లుపడతావుంది. బంగాళాఖాతంలో వాయుగుండమంట. ఇంట్లో పురుగూ పుట్రా చేరుద్దని మమ్మ బుడ్డి ఆర్పకుండా వత్తి తగ్గిచ్చి పెట్టింది. మా తాటాకు కప్పులోంచి నా కాళ్ళ కాడ బొట్టు బొట్టు పడి బిగదీసి కప్పుకున్న దుప్పటి తడుస్తా ఉంది. లేచి కూరగిన్నె తెచ్చిపెట్టి, దండెం మీద యాలాడబడుతున్న మా అన్న బన్నీ దీసి అందులో పడేశా. యింగప్పుడు నిద్రపట్టింది.

కడుపులో యేందో అవుతావుంది. నెప్పి కాబోలు, గుడా బెడా... కళ్ళు తెర్సి చూశా. అంతా చీకటిగా ఉంది. పక్కప మమ్మ. యింటో వున్నానని అప్పుడు గుర్తొచ్చింది. ఈ యేడు ఆస్టల్లో జేరిన కాడ్నుంచి ఆస్టల్నుంచి యింటికొచ్చిన మొదట్రోజు, ఇంటినుండి ఆస్టల్కెళ్ళిన మొదట్రోజు రాత్రి పొణుకున్నాక మెలుకవొస్తే వొక్క నిమిషం అది ఆస్టల్లో, ఇల్లో అర్ధం కాదు. కొంసేపు పోయాక తెలుస్తది 'మా... మా...లే లెట్రినొస్తందే ' అన్నా మమ్మకేవీ అర్ధమయినట్లు లేదు. ఇదివరికి నేను 'దొడ్డిక' నే అనేదాన్ని. ఈ మజ్జ కాలేజీలో చేరి ఆస్టల్లో వుంటన్నప్పటి నుంచి లెట్రినంటన్నా. మాకు 'లెట్రిన్' లేకపోయినా!

నేను గబగబా బయటికొచ్చి పొట్ట రుద్దుకుంటూ తారింగలాడతంటే మమ్మ గాబులో ముంచి రబ్బరు చెంబుతో నీళ్ళు తెచ్చింది. నేను ముందు, మమ్మయెనక యిద్దరం అంతలెక్కున్న రైలు కట్ట కాడికి పోయాం. కట్టమీదకి యెక్కబాకమ్మా, పీతుర్లుంటయ్, యెవుర్లేరులే, ఆడ్నే కూ...' అంది. పెద్ద యిరోచనం! యెంత పెద్దదంటే నా రెండు మడాలూ తడిసినయ్! మమ్మ నేను కూర్చున్న కాడికి చెంబు తెచ్చిచ్చింది.

'తెల్లారకముందే బయటికి పోయారేంది?' మమ్మనడిగాడు మానాన్న, నేను గాబుకాడ కాళ్ళు కడుక్కొంటంటే!

'పిల్లకి దొడ్డి నెప్పొచ్చిందిలే'.

వాన కాస్త తెరిపిచ్చింది. పోయి మా అమ్మ పక్కన బొంతమీద పొణుకున్నా. మా గన్నుగా నిద్ర వట్టింది. సడెన్‌గా మెలుకువొచ్చింది.

చిన్నప్పుడు కరుణామయుడు సినిమాలో యేసయ్య సిలువ మీద చచ్చిపోయ్‌నవుడు - కొండరాళ్ళు దొర్లుతాయ్, సముద్రాలు వుప్పొంగుతయ్, అగ్నిపర్వతాలు కుండ మీద మూత పేలిపోయి, మంట యెక్కువైతే పప్పు చారు పొంగినట్టు లావా పొంగిపోద్ది. అట్టావుంది నా కడుపులో! లేచి చూస్తే మా అమ్మ లేదు పక్కన. వాకిలూడుస్తా వుంది. ఇస్లాంపేట మసీదులోంచి అజా యినపడతా వుంది. చెంబుతో నీళ్ళు ముంచుకొని గబగబా నడుచుకుంటూ పోతన్నా.

'జనం తిరుగుతున్నార్లే, పోమ్మా' యనక నుంచి మమ్మ అంటా వుంది.

ఈసారి రైలు కట్ట యెక్కాల్సిందే.

అప్పటికే ఆడోళ్ళు అక్కడొకళ్ళు

అక్కడొకళ్ళు కూర్చోనున్నారు. రెండు పట్టాల మీద యెదురెదురుగా మాటలినపడతన్నయ్.

నేను యివతల పట్టా మీద కూర్చున్న. యిట్లా కూర్చోవాలంటే అలవాటుండాలి. లేకపోతే బ్యాలెన్స్ కుదరక ముందుకో, యెనక్కో పడిపోతాం. ముందుకైతే పర్వాలా, చెంబు మీదనో, రాళ్ళమీదనో చేతులు బెట్టి బోర్లా పడకుండా యెట్నో ఆపుకోవచ్చు. వెనక్కయితే యింగంతే సంగతి - నిప్పుల్లో వడ్డట్టే! చూడ్డానికి యిరగబూసిన బంతిపూల్లాగా, చేమంతి పూల చెండుల్లాగా కనపడతయ్‌గానీ, బోచెడ్డ గవులు! కదిలిస్తే కంపు, యింకందులో వడ్డావంటే యేవుంది...?! చిన్నప్పుడు నేనట్నే బడ్డా! నాలుగో తరగతిలో! యెదురుగా యేదో కదిలితే పామనుకొని! మమ్మ తీసకపొయ్యి చేపని కడిగినట్లు సుబ్బరంగా రుద్ది పెట్టింది నన్ను. కానీ ఆ పీతోసన నాకాడ నాలుగు రోజులు వస్తనే వున్నట్టనిపిచ్చింది నాకు.

పట్టా, బెత్తెడు మీద రెందేళ ్ళంటదంతే! పాదమేమో మూడుబెత్తెలుంటది. పట్టాకి అడ్డంగా, పాదంలో యెనక భాగం కొంచెం పట్టాకి యెనకే మిగిల్చి, పాదం ముందు భాగం ఖాళీగా వొదిలేసి, బొటినేలు అపుడపుడు కిందకొంచి రాళ్ళమీద ఆనిస్తా బ్యాలెన్స్ చేసుకుంటూ ఉండాలి. ఒకసారి కూర్చుంటే అయిపోయేవరకు జరిగి కూర్చోవాల్సిన పనుండదు... పట్టా యెత్తుగా ఉంటది కాబట్టి...!

'యెవురాడ కూసున్న మనిషీ' ఆరాగా అడిగింది శామలక్క అంత దూరంలో పట్టా మీద నుంచి లేచి నిలబడతా.

'నేనే శామలక్కా'

'యెవురూ, సోరూపానా, యెప్పుడొచ్చావ్ మ్మాయ్?' నా దెగ్గరికి నడుస్తా అడిగింది.

'రాత్రొచ్చానక్కా'

'శెలవులిచ్చారా' కూర్చొనే అడిగింది బుజ్జక్క.

'అవునక్కా దసరా సెలవులు, మళ్ళీ ఆదివారం దాకా పన్నెండడు రోజులు'

శామలక్క నా ముందుకి సగం నీళ్ళున్న చెంబు చాపి 'కాసిన్నీళ్ళు పొయ్‌రా' అంది. ఈళ్ళిద్దరూ సావాసగత్తెలు,పక్కపక్క యిళ్ళు అన్ని పన్లూ కల్సే చేసుకుంటారు. దొడ్డికొూడా వక్కచెంబులోనే నీళ్ళు తీసుకుపోతారు.

శామలక్క చెంబు తీసకపోయి బుజ్జక్కకి అందిచ్చింది.

'అయినా మనకెందుకమ్మాయ్ అన్నేసి రోజులు శలవులు? వండగ జేసుకొంటామా? పాడా?' రంగురంగుల ముగ్గులేసి పేడతో గొబ్బెమ్మలు పెడతామా యేంది?. బుజ్జక్క అంది.

'నువ్వనేదిసంకురాత్రి పండగలేక్కా యిది దసరా...' అన్నా, యేదో వొకట్లే...' బుజ్జక్క

'ఆ... మరే! క్రిస్టమస్ పండక్కయితే 'వండగవూట వొక్కరోజే సెలవక్కా' అనుకుంటూ ఇరవై నాలుగున చీకటి పడ్డాక యింటికి చేరేవ్, నగం వండగయి పోయిందపుటికి' శామలక్క దూరం నుంచి రైలుకూత యినపడింది. నా గుండెల్లో రైళ్ళు పరిగెత్తినయ్. దాన్ని పెరుగుబండి అంటారు. పైనున్న పల్లెటూర్ల నుండి పాలు పెరుగు తెచ్చి నర్సరావుపేటలో అమ్మే వాళ్ళొచ్చే బండది. నాకింకా నెప్పితగ్గలా, కొంచెం సేపు కూర్చోవాలనే ఉంది.

'కూసోమ్మాయ్, సిగ్నలియ్యలేదుగా, అంతదూరంలో ఆపుకుంటాడ్లే' శామలక్క మాటల్లోనే రైలొచ్చి కాస్త దూరంలో ఉన్న గేటు కవతల ఆగిపోయింది. చాలా పెద్ద వెలుతురులో దాని లైటు మాత్రం ఆగలేదు. ఆ ఫోన్ స్లో నా యెదురుగా నిలబడున్న బుజ్జక్క తొమ్మిదో నెల కడుపు యింతెత్తున కనబడతా వుంది. అంత వెలుగులో నాకింక కూర్చోబుద్ధిగాలా! పైగా వొకటే దోమలు. అప్పటికే యెనక పిర్రల్నిండా దోమలు కుట్టి దద్దుర్లు గట్టినయ్!

దార్లో బుజ్జక్క 'మా సత్తెనపల్లిలో అంజమ్మత్తని వుందిలే, చీకటి పడ్డాక చెంబొక చేత్తో, రాయి వొక చేత్తో పట్టుకొని బయలురేరుద్ది. మేమాడ రోడ్డు పక్కనేగా కూసున్నేది! గురిచూసి, రాయి యిసిర్నాకి కరెంటు స్తంబం మీద లైట్లు పగల్నాకుద్ది.

మళ్ళీ యెప్పటికో వచ్చి. మున్సిపాలీంటవాళ్ళు యేసిపోతారు - రాత్రికి ఈమ పగల్నాకుద్ది వాళ్ళేసిపోవడడం - యీమ పగల్నాకడం, వాళ్ళేసిపోవడం - యీమె పగల్నాకడం... యిదే కత... యెందుకో తెల్సా ఆగి నా మొకంలోకి చూసి 'యెల్తుర్లో కూసోలేక' అని నవ్వింది. నేను కూడా నవ్వా, చేసేదేం లేక!

మమ్మ బొంత యెత్తేసింది. మంచం మీద మా నాన్న పక్కన పొణుకున్నా

'చిన్నమ్మాయ్, టీ తాగుతావా?' నేను కళ్ళు తెరవడం చూసి మమ్మ అడిగింది. లేచి, గాబుకాడ కళ్ళు కడుకొని, నోరు పుక్కులిచొచ్చి, టీ గ్లాసు తీసుకున్నా టీ మెత్తం తాగి, గ్లాసు కడగటానికి గాబుకాడకి పోతన్నా... నెప్పి మొదలైంది. టైం యెనిమిదయినట్లుంది. 'యేసయ్యా! 'యిప్పుడెట్లాపోవడం? చెంబు తీసుకొని యిళ్ళ మజ్జ నడుచుకుంటూ బోవాల ' యెపుడొచ్చావమ్మాయ్' అని అందరూ పలకరిస్తా వుంటారు. దానికి తోడు కట్టకి పోయొచ్చే మాగేరి మొగోళ్ళు యెదురవుతా వుంటారు. అన్నయ్యలూ, అంకుళ్ళు. నాతో పాటు మా లూథరిన్ హైస్కూల్లో చదువుతున్న సీనియర్లు, జూనియర్లు కూడా వుంటారు. వీటన్నింటికి మించి పగలు ఆడోళ్ళు కట్ట మీద కూర్చోవడానికి లేదు! కట్ట పక్కన దవుల్లో ఉన్న ముళ్ళ కంచెల్లోపలికి వొంగొంగి నడుచుకుంటాబోయి కూర్చోవాల. అసలే

**నున్నగా అలికిన నేలమీద బొంతేసుకొని మమ్మా నేను పొణుకున్నాం. బయట జల్లుపడతావుంది. బంగాళాఖాతంలో వాయుగుండమంట. ఇంట్లో పురుగూ పుట్రా చేరుద్దని మమ్ము బుడ్డి ఆర్పకుండా వత్తి తగ్గిచ్చి పెట్టింది. మా తాటాకు కప్పులోంచి నా కాళ్ళ కాడ బొట్టు బొట్టు పడి బిగదీసి కప్పుకున్న దుప్పటి తడుస్తా ఉంది. లేచి కూరగిన్నె తెచ్చిపెట్టి, దండెం మీద యాలాడబడుతున్న మా అన్న బన్నీ దీసి అందులో పడేశా. యింగప్పుడు నిద్రపట్టింది.**

పెంటల రొచ్చు బో రోతగా వుంటది. దానికి తోడు రాత్రంతా వానబడి ఉంది. కుప్పలన్నీ చింది, చుట్టా చెల్లా చెదురుగా యెగిరిపడి వుంటయ్. యెంత కష్టమో నడవడం, తావు యెతుక్కోవడం. ఇదిగాక కట్టమీద పరచిన రాళ్ళ పక్కన... ముళ్ళకంచెల్లోకి దిగే అంచుమీద సన్నటి కాలిబాట. ఆ అంచుమీద నుంచే మొగోళ్ళు చెంబు తీసుకుని మమ్మల్ని దాటిపోతావుంటారు. ఖాళీ చెంబుతో వస్తావుంటారు. కొంతమంది తలకాయొంచుకొని నడున్తుంటారు. వొక్కొక్కడు తలెత్తి వొకసారి మా మొకంలోకి చూసి తల తిప్పుకుని పోతావుంటాడు. వాడు యెట్టాంటోడయినా అంత దూరంలో మొగమనిష కనబడ్డారంటే లేచినిలబడాల్సిందే! రైలు కూడా మొగోడే! వస్తే నిలబడాల్సిందే! గూడ్సు బండొస్తే కూడా! ఎన్ని పెట్టెలుండి యెంతపొడుగున్నాసరే ఇంక కూర్చోగోడదు, చివర్లో గార్డు వుంటాడుగా! టెన్త్‌లో నా క్లాసుమేట్ మోజస్ యెడం చేతిలో ఖాళీ చెంబుతో యెదురయ్యాడు. 'యెల్లేటప్పుడు యే చేత్తో పట్టుకున్నా ఫర్వాలేదు గానీ, వచ్చేటప్పుడు మాత్రం కుడిచేత్తోనే పట్టుకోవాలి – చెంబు' అంటాడు మా నాన. దారిలో గిన్నెలు తోమేవాళ్ళు, బట్టలుతికే వాళ్ళు పలకరిస్తానే వున్నారు. కొంతమంది నులకమంచాల మీద కూర్చొని సద్దన్నం తింటన్నారు. కట్టమీద కెక్కగనే పీతిగవులు, చేవల మార్కెట్లో నీసోనన చిక్కగా వస్తావుంది.

పీతిపెంటలన్నీ దాటుకుంటూ చిన్నగా ఆ ముళ్ళకంచెల్లోకి దిగా! ఆడోళ్ళెవరూ లేరు. అందరూ చీకటితోనే పోయెస్తుంటారు. రెండు జానల చోటు దొరకడం కనాకష్టమైపోయింది. చెంబు పెట్టడానికి బెత్తెడు చోటు లేదు. కుదిపాదం మీద పెట్టుకున్నా! పొర్లు నెప్పి! నీళ్ళ విరోచనం! ఆ తడినేలలో ఇంకలేకపోతంది. నేనెప్పుడైనా యిట్లా కంపల్లోకొస్తే చుట్టూ చూస్తా వుంటా! వొకటి పాములు, రెండు పందులు. పాములంటే నాకు చిన్నప్పటినుంచి బోబయ్యం. పందులైతే మామూలుగానైతే బయం లేదు గానీ యిట్లా కంపల్లోకొస్తే... కాసుకుని చూస్తా కూర్చోగానే పరిగెత్తుకొని వస్తయ్! యెనకా ముందూ చూడవ్, గబుక్కున లేచి తప్పుకోవాల్సిందే, లేదంటే ఆ కంగాల్లో పీతుర్లలో పడిపోతాం.

బడిలో ఆడపిల్లలు రింగాట ఆడేటపుడు, నెట్‌కి అవతలున్నోళ్ళు యిసిరేస్తే, యివతలున్నోళ్ళు దాన్ని కిందబడనియ్యకుండా పట్టుకోవాల! కిందపడనిస్తే పాయింటుపోద్ది! అవుటయినట్టే! అట్టా పందులు కూడా, మనిషి రాగానే దగ్గరకొచ్చి నిలబడి కానుకోనుంటయ్. కూర్చుంటంటే కిందపడనివ్వవ్... తింటంటే రెండుపక్కల సెలాలమ్మట కొంచెం కొంచెం జారతా చిదపలు పడతావుంటయ్. చిన్న గుంటలో రెండు మూడు పెరిగిన పిల్లలు పొదుకోనున్నయ్... దొడ్డికి బురదలో, యెందుకో వొడుపు చెయ్యట్లా, కొద్దిగా మెదుల్తున్నయ్యంతే!!!

అక్కడక్కడా దోసతీగలున్నయ్, కొన్ని నేలమీద పాకి, కొన్ని కంపచెట్ల మొదట్లో అల్లుకొని! తీగలకి పూలూ పిందెలు కనబడతన్నయ్. తిన్నప్పుడు అరక్కుండా దొడ్డికిలో బయటకొచ్చిన యిత్తనాలన్నీ యిట్లా మొలచి తీగలయ్యి మంచి కాయలు కాస్తాయంట. పీతుర్ల మజ్జన పెరగడం వలన పెద్ద పెద్ద సైజులో నిగనిగలాడ్తుంటయ్యంట! మొగోళ్ళు కూర్చునేకెల్లయితే గంపలు గంపలు కాస్తయ్యంట. అందుకే పెద్ద బాయి పక్కనున్న వజ్రమ్మమ్మమ్మ తెల్లార్జామే టార్చిలైటు తీసుకుని గంపెకెత్తుకొచ్చి కోటయ్య కొట్టుకేసుద్దంట. ఈ సంగతి మాగేర్లో అందరికి తెల్సు. అందుకే యెవరూ కోటయ్య కొట్లో దోసకాయలు మాత్రం కొనరు. రోడ్డవతలోళ్ళు కొనుక్కొని పోతుంటారు.

నాపాదమంతా తడిసిపోయింది. యేందా అని చూస్తే చెంబులో సగమే నీళు న్నయ్ యింతలో వొకాయన ఖాళీ చెంబుతో అంచుమీద నడుస్తా కన్పిచ్చాడు. నాకు తెలీకుండానే చేత్తో చెంబు పట్టుకొని గబుక్కున లేచి నిలబడ్డా. ఆయన మొకం రైలు కట్ట పక్కకి తిప్పుకొని నడుస్తున్నాడు.

మొగోళ్ళకయితే ఈ బాధే లేదు. జనం తిరుగుతున్నా పట్టిచ్చుకోరు.

మొన్న క్లాసులో తెలుగు మేడం' మరో జన్మంటూ వుంటే మీలో యెంతమంది పురుషులుగా పుట్టాలనుకుంటున్నారు' అని అడిగితే చాలా మంది అమ్మాయిలు చేయెత్తేరు.

'యెందుకు' అని మళ్ళీ అడిగారు.

అమ్మాయిలు చాలా సమాధానాలు చెప్పేరు. సెకెండ్‌షోకి వొంటరిగా పోవచ్చని, సిగరెట్ తాగొచ్చని, యెండాకాలం చొక్కా విప్పదీసుకోవచ్చని, నెల నెల మెన్సెస్, కడుపు – కాన్పు యేవీ లేకుండా వుండొచ్చని యిట్లా... చాలా.. యీ ఆడవాళ్ళ యిబ్బందులన్నీ అనుభవించి నోళ్ళకే తెలుస్తయ్యని ముగించారు.

నాకప్పుడు 'యిది' చెప్పాలని పించింది. 'యిట్లా మజ్జలో లేచి నిలబడే అవసరముండదదని' కానీ క్లాసులో చెప్పలా! ధైర్యం చేసి రాత్రికి ఆస్టల్ రూంలో చెప్పా.

'ఛీ పాడు యిలాంటియ్ చెబుతారా? యింకా నయం క్లాసులో చెప్పలేదు...' యిలాంటియే రెండు మూడు మాటలని, యిదొక పాయింటే కాదని కొట్టిపడేశారు. వాళ్ళకేం తెలుసు...? యిది... అనుభవించినోళ్ళకే తెలుస్తది!! ఆయనెల్లిపొయ్యాడు. మళ్ళీ అట్టా కూచున్నానో లేదో రైలు కూత యినబడింది. చాలా స్పీడుగా వస్తుంది. మళ్ళీ లేచి నిలబడ్డా, రైలు దగ్గరికి రాగానే ఆ స్పీడుకి రైలు కట్టమీదున్న ఈగలన్నీ గుయ్‌మని వొకేసారి లేచినయ్.

యింతలో కటాక్షం వచ్చింది. యెనిమిది చదూతుంది. ఆ పిల్లనడిగి కొంచెం నీళ్ళు పోయించుకున్నా. వక్కతే వుందని తోడు నిలబడ్డా.

'అక్కా... సింహాసనం కత తెల్సా' అడిగింది.

'తెలీదే... యేందదీ?' అన్నా.

'మరంటా, వేరే రాజ్జం నుండొచ్చిన

విద్వాంసుడి చేతిలో రాజుగారి పండితులంతా వోడిపోయారంట. విద్వాంసుడు 'మహారాజా నేను గెలిచా కదా మీరిచ్చిన మాట ప్రకారం నా కోరిక తీర్చాలి' అన్నాడంటా. 'యేంటదీ' అని రాజుగారడిగితే 'మీ సింహాసనం మీద దొడ్డికి కూర్చోవాలనుకుంటునన్నాను' అన్నాడంట. రాజుగారి మొహంలో నెత్తురు చుక్కలేదంట. చేసేదేం లేక సింహాసనం దిగి కిందకొచ్చాడంట. విద్వాంసుడు సింహాసనం యెక్కబోతావుంటే అపుడు తెనాలి రామలింగడు 'విద్వాంసుడా, ఆగండి! మీ కోరిక ప్రకారం, తమరు సింహాసనం మీద దొడ్డికి మాత్రమే కూర్చోవాలి. పాస్ పొయ్యటానికి వీల్లేదు. వొక్క చుక్క పాస్ పోసినా సరే, మీరు మాట తప్పినందుకు గాను, మీ తల నరికి కోట గుమ్మానికి వేలాడకడతాం' అన్నాడంట. ఆ విద్వాంసుడికి వణుకు పుట్టిందట – 'వొక్క చుక్క పాస్ పొయ్యకుండా దొడ్డికెట్లా కూర్చోవటం' అని! తన అహంకారానికి పశ్చాతాప్పడి రాజుగార్ని క్షమాపణడిగి ఆ రాజ్జం వదలి యెల్లిపొయ్యాడంట'. నేను బాగా నవ్వి –

'యీ కత తామస్ మేస్టర్‌గారు చెప్పారా?' అన్నా

ఆ పిల్ల ఆశ్చర్యపోయి 'నీకెట్టా తెల్సా' అంది

యిట్టాంటి కతలు ఆయనేగా చెబుతాడు' అన్నా. యిద్దరం నవ్వుకున్నాం.

కట్ట దాటాక కటాక్షం యింటికెల్లిపోయింది.

నేను యింటివైపు నడుస్తా వుంటే, నా యెనక యెవురో నడుస్తున్నట్టుంది. యనక్కి తిరిగి చూశా, మా అన్నయ్య, యిద్దరం వొకేసారి గాబుకాడికి పొయ్యి చెంబు అడుగు కడిగి, కాళ్ళు కడుకున్నాం.

'ఆ చెంబెందుకు తీస్కపొయ్యావ్, అది కారతంటే...' అంది మమ్మ.

అందుకే, నగం నీళ్ళు కారిపొయ్యాయ్, కటాక్షం పోసిందిలే...' మంచం మీద కూర్చుంటా అన్నా.

శామీ చిన్నమ్మాయ్‌కి యిరోచనాలవుతున్నాయ్‌గనీ, నువ్వు బొయ్యి కోటయ్య కొట్లో అయిదు రూపాయలకి సగ్గుబియ్యం తీస్కరా. గంజి కాస్తా' అంది. మా అన్నయ్య డిగ్రీ చదూతున్నాడు. అయినా, రూపాయి, రెండ్రూపాయలిచ్చి చింతపండు తెమ్మన్నా, యెండి మిరగాయలు తెమ్మన్నా తెచ్చి పెడతాడు. సిగ్గు పడడు. గంజి తాగతావుంటే రత్నవొచ్చింది. 'చిన్నమ్మాయ్! కొవ్వొత్తులు చెయ్యడానికి వోతన్నా వస్తావా' అడిగింది.

యియ్యాల రాదులేమ్మా, యిరోచనాలువుతన్నయ్, రేపట్నుంచొచ్చుద్ది' అంది మమ్మ.

వెొన్న యెండాకాలంలోనే కొవ్వొత్తులు తయారు చేసే ఫ్యాక్ట్రీ పెట్టారిక్కడ. దగ్గిర్లో! అంతకు ముందు మాగేర్లో అందరూ రకరకాల పన్లకి పోతావుండేవాళ్ళు యెండలో యెండుకుంటా, వానలో తడుసుకుంటా! నేను కూడా సెలవలకి యెండా వానా పనులే చేసేదాన్ని! ఇప్పుడు కాండిల్స్ పని! నా డబ్బులు మమ్మా నాన్న అంటుకోరు. నాపుస్తకాలకి, నా బట్టలకే. అన్నం కూరా వండి మమ్మ కాండిల్ పనికి యెల్లిపోయింది.

మా అన్నయ్య యిడ్లీలో పంచదారయే పిచ్చి కట్టిచ్చుకొచ్చిన పొట్లం యిప్పి పదకొండు గంటలకి తిన్నా, యెందుకొచ్చిన గోలలే అని వొక్కిడ్లీయే తిన్నా. మళ్ళీ సన్న చినుకులు. పంచలో యేసున్న మంచం మీద పొణుకొని నిద్రపోయా. రెండు గంటలపుడు మెలుకువొచ్చింది.

మళ్ళీ అదే నొప్పి, యేసయ్య చనిపోయినపుడు జరిగిందే! తట్టుకోలేకపోతున్నా! యట్లాలేచానో యేందో, చెప్పులు కూడా యేస్కోకుండా, చెంబుదీస్కొని కట్టవైపు గబగబా నడిచా, పెద్ద పెద్ద అంగలు, యిప్పుడు దాకా కొంద రాళ్ళు దొర్లుతున్నట్లున్న నెప్పి, యిప్పుడు...సముద్రాలు అల్లకల్లోలమై, వుప్పొంగిపోతన్నట్టుగా పెరిగిపోతంది. యింక అగ్నిపర్వతం మీద మూతెప్పుడు పేలిపోద్దో...!

కట్ట దగ్గర కొచ్చేశా. అంతకష్టం మీద ఆపుకోడం వల్ల కడుపులోంచి యేదో పైకి తన్నుతోంది. వాంతికొచ్చినట్టుగా ఉంది. తలమీద ముళ్ళ కిరీటం బెట్టి లోపలికెవరో గట్టిగా వత్తుతున్నట్లుంది. సిరుశవట్లు మొట్టుకొన్తన్నయ్. కళ్ళు బైర్లు గమ్ముతున్నయ్. పడిపోయేటట్లున్నా! యట్లనో కట్టదిగి కంపల్లోకి దూరిపోయా!...

'అన్నిటికంటే మనిషికి యెప్పుడు హాయి' అని తెనాలి రామలింగడ్ని అడిగాడంట రాజుగారు.

'తొందరగా వచ్చినప్పుడు వెళితే, అదే అన్నింటికంటే హాయి మహారాజు' అన్నాడంట. రాజుగారికి కోపమొచ్చింది. రాజుగారితో అలాంటి సమాధానం చెప్పినందుకు, వంద కొరడా దెబ్బలు కొట్టమన్నాడంట. శిక్ష రేపొద్దున అమలు చేయమన్నాడంట. తెల్లవారి, చీకటితోనే రాజుగారు లెట్రిన్‌కెళితే లోపలెవరో వున్నారంట. యెంతసేపు బయట వెయిట్ చేసినా లోపలున్న మనిషి బయటకు రాలేదంట. రాజుగారు ఆ 'తొందర'ని తట్టుకోలేక అల్లాడిపోయాడంట. అప్పుడు బయటకొచ్చాడంట తెనాలి రామలింగడు. రాజుగారు పరిగెత్తుకొని లోపలికెళ్ళాడంట... బయటకొచ్చాక పొట్ట తడుంకుంటూ – యెంత హాయిగా వుందో' అన్నాడంట. యెదురుగా ఉన్న రామలింగడ్ని చూసి తనకు జ్ఞానోదయం అవ్వడానికి, యిది అతడు పన్నిన పన్నాగమే అని అర్ధమయ్యి, అతడికి పెద్ద పెద్ద బహుమానాలిచ్చి పంపాడంట.

వారానికొకసారైనా రాత్రిపూట, కట్టమీద ఈ కథ విన్పిస్తా వుంటది.

మళ్ళీ నీళ్ళ విరోచనమే అయింది... పెద్దది. యనకంతా ఈగలే వాల్తావున్నయ్. గయ్యమని ముసురుకొంటన్నయ్.

నా యెడల పాదం ముందు నుంచి –నలుపు మీద నాలుగు యర్రమచ్చలున్న పురుగు పోతా వుంది. అది ముందు కాళ్ళతో కుంకుడు గింజంత పియ్యి వుండని దొర్లించుకుంటూ పోతా వుంది. దొర్లిచ్చుకుంటూ పోటం వలనేమో, వుండ బో గుండ్రంగా, చూడ్డానికి చిన్నసైజు

లడ్డులాగా వుంది.

యెవరో విజిలేసిన సౌండు యినపడి తలెత్తి కట్టవైపు చూశా, వకాయన, కట్ట అంచున సన్నదార్లో సైకిల్ మీద! వక్కాలు పెడల్ మీద, వొక్కాలు కిందా అనిచ్చి నవ్వుతున్నాడు. గభాల్న లేచా! బొమతలెగలేస్తనన్నాడు. చాలా బయ్యమనిపిస్తంది. చుట్టూ చూశా, మనిషి అలికిడే లేదు. కాళ్ళు వొణుకుతున్నయ్. గుండె దడ దడా కొట్టుకుంటుంది. యేందేందో మాట్టాడతన్నాడు. బోలేకి మాటలు, యింతింత లావు బూతులు, చూపుడు వేలు, బొటనవేలు సున్నాలా చుట్టి యేదో సైగ చేస్తున్నాడు. జేబులోంచి డబ్బులు తీసి చూపిస్తున్నాడు, యేం చెయ్యాలో పాలుబోటం లేదు. వాడు చిన్నగా సైకిల్ మీద నుండి దిగి స్టాండేస్తున్నాడు. యింగంతే... చెంబు అట్లాగే పట్టుకొని ఆవజాన డవున్లోకి పరిగెత్తా ! లోపలికెళ్ళేకొద్దీ ముళ్ళకంచెలు –యెట్టంటే అట్ట అడ్డంగా పెరిగిపోయి పెరిగెత్తడానికి వీలులేకుండా వున్నయ్. బట్టలకి తగులుకొంటన్నయ్, వొళ్ళంతా చీరుస్తున్నయ్.

వాటిని తప్పించుకొని ముందుకు నడుస్తానే యనక్కి తిరిగి చూశా. వాడు డవున్లోకి నాలుగడుగులేసి ఆడ్నే ఆగిపోయి నన్నే చూస్తన్నాడు. అయినా నేనాగలా! ఆ కంచెల్లోంచి చాలా దూరం నడిచాక చివర్లో అడ్డంగా నాలుగు మూర్ల యడల్పు మురిక్కాలవ పారతా వుంది. ఆడ నిలబడి తిరిగి చూశా. వాడు ఆడ్నే వున్నాడు. కొద్ది కొద్దిగా కనబడుతున్నాడు.

కాళ్ళల్లో ముళ్ళు దిగబడ్డయ్. వకదాని తర్వాత వొకటెత్తి రెండు అరికాళ్ళూ చూసుకున్నా. పాదాల్నిండా పియ్యి, కజాబిజా తొక్కానేమొ అతుక్కుపోయింది. యేళ్ళ మద్యనుంచి పొడుచుకొచ్చి అంచుల్లో కెల్లకొచ్చి...! చెప్పుల్లేకుండా నల్లమట్టి పొలంలో నడిస్తే మట్టి బూట్లొస్తాయే, అట్లొచ్చినయ్ పియ్యబూట్లు! మోకాల్లోతున్న ఆ మురిక్కాలం యట్టానో దాటి మట్టిరోడ్డుమీదకొచ్చా. ఆడాడ నిలబడ్డ వాన నీళ్ళల్లో కాళ్ళు కడుకున్నా! కడిగాక అరికాళు

మొన్న యెండాకాలంలోనే కొవ్వొత్తులు తయారు చేసే ఫ్యాక్టరీ పెట్టారిక్కడ. దగ్గిర్లో! అంతకు ముందు మాగేర్లో అందరూ రకరకాల పన్లకి పోతావుండేవాళ్ళు యెండలో యెండుకుంటా, వానలో తడుసుకుంటా! నేను కూడా సెలవలకి యెండా వానా పనులే చేసేదాన్ని! ఇప్పుడు కాండిల్స్ పని! నా డబ్బులు మమ్మా నాన్న అంటుకోరు. నాపుస్తకాలకి, నా బట్టలకే. అన్నం కూరా వండి మమ్మ కాండిల్ పనికి యెల్లిపోయింది.

ళ్ళు చూసుకుంటే చాలా చోట్ల సర్కారు ముళ్ళు దిగి నల్లగా నీడలాగా కనబడతన్నయ్. నడుస్తుంటే కలుక్కు కలుక్కుమంటున్నాయ్. అడుగు దీసి అడుగేస్తుంటే ప్రాణం మింటబోతంది చెంబులో నీళ్ళన్నీ యెప్పుడు పొయ్యినయ్యో పొయ్యినయ్.రోడ్డుమీద కొంత మంది నాకెల్లి చెంబుకెల్లి మార్చిమార్చి చూస్తున్నారు. చెంబేడన్నా పడేద్దామనుకున్నా కానీ దొడ్డికి పోవాలంటే యీ వొక్కటే మంచి చెంబు. వొకదానికి గొంతూడి పోయింది. పట్టుకోవడం కుదరదు. వొకదానికి బొక్కపడిందాయె!

ఆ మట్టిరోడ్డు మీదా చానా దూరం నడచి, రైలు గేటు యెక్కి దిగి, కట్టకివతల పక్క చాలా దూరం యనక్కి నడిచి యింటికొచ్చా! మజ్జమజ్జలో చూస్తానే వున్నా నా యనకగానీ వస్తన్నాడా...! లేకపోతే కట్టమీద నుంచి యివతలికి దిగి నేను నడుస్తున్న రోడ్డు మీదకి జేరి నాకెదురుగానీ వస్తన్నాడా అని... కనబళ్ళా!

చెంబు దీస్కోని యిదంతా సుట్టుకొని నడవటం... యేందో...బో యిదిగా వుంది. సిగ్గుగా! పెళ్ళికూతురు బడే సిగ్గు కాదది. యిబ్బంది, యగతాళి. అవమానం. దొడ్లోకి పోయి నడుం దెగ్గిర్నుంచి కిందికి ఆ మొయినంగా సుబ్బరంగా కడిగి పడేశా... రుద్ది రుద్ది... దొడ్లో వున్న చిన్న చిన్న బట్టల సబ్బు ముక్కలతో, కాకెత్తుకు పోద్దని వొంటి సబ్బు యింట్లో పెట్టుకుంటుంటాం.

నడిమంచంలో కూర్చొని, అరికాలు వొళ్ళో పెట్టుకొని పిన్నీసుతో వొక్కొక్క ముల్లూ తీసిపారేశా. కొన్ని చాలా లోపలికి దిగి కుడతంటే రక్తమొచ్చింది. కొన్ని సగానికి యిరిగిపొయ్యి, ఆ ములుకులు లోపలే వుండిపోయినయ్. యింకో పదన్నా వుంటయ్.

వామ్మో యిన్ని ముళ్ళే! యిన్ని ముళ్ళని కాళ్ళల్లో బెట్టుకుని యెట్టా నడిచొచ్చానో... ఆ యేసయ్యకే తెలియాలి. ఆ ముళ్ళన్నీ పొట్లం కట్టి నాలుగ్గంటలకి మమ్మొచ్చాక చూపిచ్చా.

మొత్తం చెప్పా.. మమ్మకి చెబుతుంటే యేడుపొచ్చింది. పెద్దగా యేడ్చా...

'అవ్వో నా తల్లీ! యెంత వనయిందే...! నిన్నా యేనయే కాపాడాడమ్మా! గాలినాబట్టలు, మన గేర్లోంచి ఆడపిల్లలు దొడ్డికి పొయ్యారంటే చాలు, బతకనియ్యట్లా... లేకి మాటలు మాట్లాడటం, యెకిలి చేష్టలు చెయ్యడం! సెడినా బట్ట. వొక్కొక్క నా బట్టని మజ్జకి మడిసి రైలు కింద బెట్టాల... తిడతానే వుంది మా అమ్మ. సగ్గుబియ్యం గంజిలాగా మరుగతా వుంది... ఉప్పు కళ్ళు వేడి చేసి, పాత గుడ్డలో చిన్న మూటగట్టి నా చేతికిచ్చింది. నేను సగ్గుబియ్యం గంజి తాగుతూ ఉప్పు మూటతో అరికాళ్ళకి కోపడం పెట్టుకున్నా!

మమ్మ మొకం చాలా బాధగా వుంది. ఆందోళనగా వుంది. తిడతానే చెంబుతో నీళ్ళత్తకొచ్చి మాత్ర నా చేతిలో బెడతా 'యేసుకోమ్మా' అంది. నా అరికాళ్ళు చూస్తా – 'సీరు సున్నం బెల్లం చింతపండు కలిపి నూరి అరికాలికి పూసి కట్టుకడితే నెప్పంతా లాగేస్తది... ముళ్ళు రేపొద్దున కల్లా బయటకురికొస్తయ్...' అంది. యెదురింట్లో ప్రేమక్క బ్లెస్సింగ్‌టన్ గాడ్ని సంకలో పట్టి లేపి దూరంగా జరిపి, తపా తపా అడుగులేసుకుంటూ బయటికి తెచ్చి, వాడి కాళ్ళు నేల మీద ఆనిస్తా కూర్చుంది.

వీడికింకా నిలబడటం రాదు. కాళ్ళెమ్మటి దొడ్డికి కారతాఉంది. అరిచెయ్యెంత యడల్పున రెండు చోట్ల కార్చాడు. 'కొడుకు అట్లు పాత్తన్నాడే' అంది పాలు బొయ్యడానికొచ్చిన తేరోజమ్మ పెద్దమ్మ. 'ఆ యిరోశనాలవుతున్నాయ్యాంటీ' అని చెబుతూనే 'దాయిజ్జా...న్చు...న్చు..ను...' అని పిలిచింది. యెప్పుడొచ్చినయ్యో, రెండు నడికారు కుక్కలు తోకూపుకుంటూ... సుబ్బరంగా ఆ రెంటిట్లనీ నాకి పడేశినయ్. చాలక వాడి కాళ్ళు కూడా నాకుతున్నయ్. ప్రేమక్క వాటినేం అనట్లా! వాడు వొకటే మొయినంగా కాళ్ళు చేతులూ ఆడిస్తా, మీది మీదికి దూకుతా, పెద్ద పెద్దగా కేకలేస్తా నవ్వుతున్నాడు. 'దొడ్డికూర్చునేటప్పుడు పిల్లలు బోవుషారుగా వుంటారు. చిన్నమ్మాయ్...' అని నవ్వుకుంటా అంటంది ప్రేమక్క.

మళ్ళీ కడుపులో కొంచెం కొంచెం తేడా మొదలయ్యింది. అయినా యింకిప్పుడు బయ్యం లేదు బడి నుంచొచ్చిన ఆడపిల్లలు, ముసలా ముతక చాలామంది చెంబుదీసుకొని బయలు తేరతారు. ఇప్పుడు నేను నడచిపోడం చాలా కష్టం. చెప్పులేసుకున్నా - కట్ట మీదున్న రాళ్ళ మీద నడవాలంటే కష్టం. యెట్లాపోవడం? పాదాల మీద చల్లటి నీళ్ళు పోసుకుంటే యిరోచనం తొందర్ని కొద్దిగ సేపు వాయిదా వెయ్యొచ్చు. చిన్నగా గాబుకాడికి నడిచెల్లి చెంబుముంచి, పాదాల మీద గుమ్మరిచ్చుకున్నా. లక్ష గాజు పెంకులు పాదాలలోకి దిగబడినట్టుంది. నోట్లోంచి శబ్దం కూడా రాలా, గాలంతా గుండెల్లోకి తన్నింది. ఆడ ఆగింది. తీట...

చీకటి వడేదాకా ఆవడం కష్టమనిపిస్తుంది, చీకటిపడడానికి చాలా టయముంది. ఈలోపు వొకసారి యెళ్ళి రావడమే మంచిది.

కష్టమ్మీద చెప్పులేసుకొని గాబుకాడ చెంబు ముంచుతుంటే - 'యేందమ్మా, మాత్తరేసుకున్నా కట్టుకోలేదే...!' అనంటా నా చేతిలో చెంబు తీసుకుని మమ్మ నా పక్కనే నడుస్తా వుంది. అడుగు తీసి అడుగేయడం గగనమవుతోంది. మమ్మ నా పాదాలెంక జూస్తా మళ్ళీ ' ఆ సైతాన్ నా బట్ట' అని తిట్లకి లంకిచ్చుకుంది. మా యనక నుంచి చెంబు తీసుకొని వచ్చిన సెవిటి కరుణమ్మవ్వ 'యెప్పుడొచ్చావ్ సిన్నమ్మాయ్' అని నా బుగ్గల్లాగి ఆ యేళ్ళు ముద్దు పెట్టుకుంది. సగం పళ్ళు వూడిపోయినయ్, మనిషి బాగా వడిలింది. యెండి తునకలాగా వుంది. కానీ వుషారు తగ్గలా! 'రాత్రొచ్చానవ్వా' అంటే 'యేందీ నిన్నొచ్చావా' అని తల్లీకూతుళ్ళు పెళ్ళి నడక నడుస్తున్నారే, నడవండి, నడవండి... నాకు తొందరగుంది. నే బోతున్నా' అని ముసి ముసిగా నవ్వుకుంటూ మమ్మల్ని దాటెల్లిపోయింది. నాకు కరుణమ్మవ్వంటే బోయిష్టం నాకే గాదు పిల్లలందరికీ! చిన్నప్పుడు మా పిల్లలందర్ని పోగేసి రకరకాల ఆటలు ఆడిచ్చేది. భలే భలే కతలు చెప్పేది. యిప్పటికీ అంతే..

ఇక కట్టెక్కుతామనగా రైలు కూత యినబడింది. 'రైలుబోనియమ్మా' అంది మమ్ము. వక్క రవ్వ ముందొచ్చినట్లయితే ఈ పాటికి కట్టదాటి కంపలో కెళ్ళుందేదాన్నే... మమ్మ చెప్పినా వినకుండా... కానీ పాదాలు నడవనివ్వవ్! నిలబడలేకున్నా! కడుపు నెప్పి కాళ్ళ నెప్పి...

రైలు వొకటే మొయినంగా కూతేస్తావుంది. చెవులు చిల్లులు పడతన్నయ్. దగ్గరకొచ్చే కొద్ది రైలు స్పీడు తగ్గి స్లో అయింది. స్లో అయ్యి ఆగిపొయ్యింది. కూతేస్తా ఆగింది. 'సిగ్నలిచ్చినా కూడా ఆగిందే' అంటంది మమ్ము. అయిదు నిమిషాల తర్వాత మా గేర్లో వాళ్ళు కట్టమీదకి లగెత్తుతున్నారు - 'సెవిటి కరుణమ్మ దొడ్డికెల్లి రైలు కింద పడి సచ్చిపొయ్యిందంట' అనుకుంటా! రైలు పెద్దగా కూతేసి, చిన్నగా కదిలి, మా ముందు నుంచి వెళ్ళిపోయింది.

వామో కరుణమ్మవ్వోవ్' అని అరుసుకుంటూ మమ్మ నన్నిడిసి పెట్టి కట్టమీదకి పరిగెత్తింది. నా గుండెల్లో లక్ష రైళ్ళు పరిగెత్తినయ్. అడుగు తీసి అడుగెయ్యలేకపోతన్నా.

బట్టల్లోనే యిరోచనం అయింది. నిలబడిన చోటే కూలబడిపోయా గుండెల్లోంచి దుఃఖం పెద్ద రైలు కూతలా తన్నుకొస్తంది. ✦

---

(10వ పేజీ తరువాయి)

ఖర్చవుతుంది. మా ఆడవాళ్ళకి పొలాల్లోకి వెళ్ళిపోయే అలవాటుందని చెప్పాడు. వింతేమిటంటే అభివృద్ధి చెందుతున్న దేశం అని గొప్పలు చెప్పుకుంటున్న మన దేశంలో మారుమూల గ్రామాల్లో కూడా సెల్‌ఫోన్ వాడకం, టివి కనెక్షన్లు ఉన్నాయి. కానీ స్త్రీలకు మరుగుదొడ్లు లేవు. ఒక తండ్రి స్త్రీలకి మరుగుదొడ్లు కట్టించడం అంటే పాతికవేలు ఖర్చు అని భావిస్తాడే తప్ప అవి లేనందున కుషుబూ లాంటి బాలికలెంతమంది ఆత్మహత్యలు చేసుకుంటున్నారో ఇంకెంత మంది స్త్రీల మానప్రాణాలకు ముప్పు వాటిల్లుతుందో ఆలోచించడం లేదు. దీనంతటికి కారణం మగవాడి మూర్ఖపు ఆలోచనా సరళి. దీనిని మార్చే ప్రయత్నం ప్రభుత్వాలు చేపట్టాలి. అవగాహనా కార్యక్రమాలను నిర్వహించాలి.

ఢిల్లీలో సకల సౌకర్యాలు అనుభవిస్తూ గ్రామీణ ప్రజల ఆదాయంకంటే 50 రెట్లు ఎక్కువ జీతం తీసుకుంటున్న మన పార్లమెంటు సభ్యులు, ప్రభుత్వ పెద్దలు, ఇతర ప్రజాప్రతినిధులు పార్లమెంటు బయట, లోపల 'బేటీ బచావో' నినాదాన్ని ఊదరగొడుతున్నారే గాని వారిని రక్షించడానికి, వారి ఆత్మాభిమానాన్ని పరిరక్షించడానికి ఆవశ్యమైన సౌచాలయాల నిర్మాణాల పట్ల ఎందుకు దృష్టి సారించడం లేదు? ఇటీవల ప్రపంచ యోగా దినోత్సవం నాడు దేశంలోని లక్షల సంఖ్యలో బాలికలు యోగాసనాలు వేసి మనకు ప్రపంచ రికార్డు సాధించి పెట్టారు. ఈ విషయాన్ని ఎంతో గొప్పగా ప్రచారం చేసుకున్న పాలకులు ప్రపంచంలో మరగుదొడ్డి లేక చేసుకున్న ఆత్మహత్యల్లో ఖుష్‌బూది చిట్టచివరిదవ్వాలనే లక్ష్యంతో పనిచెయ్యాలి.

*(ది హిందూ సౌజన్యంతో..)*

✦

## నివాళి

# మానవత్వానికి మాతృమూర్తి టి.సి. లక్ష్మమ్మ గారు

అది 16-7-15 వ తేదీ ఉదయం 12 గంటల సమయం. హైదరాబాద్ స్టార్ హాస్పటల్‌లో ఐసీయూలో ఉన్న కామ్రేడ్ లక్ష్మమ్మ గారిని చూసేందుకు మా అమ్మాయి స్పెషల్ పర్మిషన్ తీసుకుని నన్ను లోపలకు పంపించింది. దగ్గరకు వెళ్ళి ముఖంమీద చెయ్యివేసి, లక్ష్మమ్మగారు అని రెండు మూడు సార్లు పిలిచాను.. తలూపారు, గుర్తుపట్టారు. 'మీకు ఏం కావాలి? ఆకలి అవుతోందా?' అని అడిగాను. అవుతోందన్నట్లు తలూపారు. "ఆకలి అవుతోందంటు న్నారమ్మా ఎట్లాగా? ఏమి ఆహారం ఇస్తున్నారు?" అని అడిగితే సెలైన్ ద్వారానే ఆహారం ఇస్తున్నాం అన్నది సిస్టర్. బాధ కల్గింది. "లక్ష్మమ్మగారూ నేను మీ దగ్గరే వుంటాను. రవిగారు, శర్మగారు అందరూ ఇక్కడే వున్నారు. మీకు తగ్గిపోతుంది. ఇంటికి వెళ్ళిపోదాం" అన్నాను. ఎందుకో తల నెమ్మదిగా అడ్డంగా ఊపారు. వ్యాధి తగ్గదు అని ఆమె ఆలోచనేమో అనిపించింది. "లక్ష్మమ్మగారు చాలా గొప్ప మనిషమ్మా... ఆమెకు సేవచేయటం అంటే అది మీ అదృష్టమమ్మా మీలాంటి అమ్మాయిలందరికీ మంచి భవిష్యత్తు కావాలని ఎన్నో సేవలు చేసారు. మీ సేవలోనే దైవత్వం ఉంటుంది"అని సిస్టర్‌తో అన్నాను. లక్ష్మమ్మగారిని వదిలి బైటకు రాలేకపోయాను. కడసారి ఆ 20 నిమిషాలే ఆమె దర్శనభాగ్యం. వెంటనే ఇంటికి రాలేక బయటే చాలాసేపు కూర్చుని వచ్చాము.

18-7-15 సాయంత్రం 5.30 గంటలకు మా మనుమడి సహాయంతో మన్నకాల వనిమీద సిఐటియూ కార్యాలయానికి వెళ్ళాను. అక్కడ కా. సుధాభాస్కర్, రాజారావుగార్లు కా. లక్ష్మమ్మగారి మరణవార్త చెప్పారు. కాస్సేపు కళ్ళు చీకట్లు కమ్మాయి. ఏదో పెద్దకొండకూలిపోయి నట్లయింది.

మహాపురుషులందరూ నినదించిన సమసమాజ నిర్మాణాన్ని సామ్యవాద సిద్ధాంతం, మార్క్సిజమే మార్గదర్శకంగా ఆకలి, అజీర్తి లేని సమసమాజం అదే సోషలిస్టు సమాజం మార్క్సిజంలో వున్న నిజమైన మానవత్వాన్ని, సామాజిక సేవా సంపదను అందించి భర్తకే గురువైన సిద్ధాంతశక్తి లక్ష్మమ్మగారు. శ్రమజీవుల సౌభాగ్య కవచమూ, మానవజీవిత మనుగడకు మూలం అనే మార్క్సిస్టు మూల సూత్రాలు పఠించి ఆ మార్గంలో ఆశయసాధనకు అత్యంత కఠిన పరీక్షలనెదుర్కొంటూ ప్రజాతంత్ర ఉద్యమాలు నిర్మించిన చైతన్యమూర్తులు లక్ష్మమ్మ దంపతులు.



1954 ఏప్రిల్ ఆఖరులో కృష్ణాజిల్లా అంగలూరులో జరిగిన రాష్ట్ర మహిళా మహాసభకు ప.గో.జిల్లా భీమవరంలో వున్న జిల్లా తొలితరం మహిళా ఉద్యమనేత గోకరాజు వెంకాయమ్మ గారు నన్ను తనతో తీస్కెళ్ళారు. ఢిల్లీ నుంచి వచ్చిన జాతీయ నాయకులు రేణూచక్రవర్తి, హజ్రాబేగం మొదలైన మహిళా నేతలను నేను మొదటిసారి చూసాను. అప్పటికి నాకు పుస్తకపరిజ్ఞానం తప్ప బయటి ప్రపంచం తెలియదు. చాలా కొత్త. లక్ష్మమ్మగారు అప్పటికే ప్రజాఉద్యమాలలో ఉత్సాహంగా పనిచేస్తున్నారు. ఆమె వ్యక్తిత్వంలో అణువుణువూ సామాజిక చైతన్యం ఉట్టిపడేది.

1970వ సంవత్సరం విజయవాడలో జరిగిన మహిళా రాజకీయ పాఠశాలలో నాకు మొదటిసారి లక్ష్మమ్మగారితో వ్యక్తిగత పరిచయం. లక్ష్మమ్మగారు వంటశాల అజమాయిషీ బాధ్యత చూస్తూనే తరగతులలో పాల్గొనేవారు. ఈనాటికీ నేను మొదటిసారి గమనించిన ఆమె ఈ రాజకీయ సిద్ధాంత పరిజ్ఞానం ఆమె సామాజిక స్ఫూర్తి తొణికిసలాడే ఆమె వ్యక్తిత్వం నిరంతరం నాకు జీవితపాఠంగానే వుంటుంది. కా. రవిగార్ని చూసినప్పుడల్లా ఆ తల్లి వారసత్వమే ఆయన మంచి రచయితగా అభివృద్ధి అవటానికి కారణం అనుకుంటాను.

నిరంతరం వేదవిద్యలు పఠిస్తూ, సనాతన ఆచారాలతో మునిగితేలే అగ్రకులంలో పుట్టిన లక్ష్మమ్మ దంపతుల సాహస జీవనయాత్ర అక్షరాల అదొక నిజమైన ఆర్థిక, సాంఘిక, రాజకీయ విప్లవమే. అత్యంత గడ్డు పరిస్థితుల్లో గంపెడు కుటుంబ భారాన్ని నిర్వహించటంలో ఆమె ఆచరించిన సోషలిస్టు పంథా సోషలిజంలోనే ప్రజాపాలన, మాతృత్వాన్ని చూపగలదు అని కష్టకాలంలో లక్ష్మమ్మగారి కుటుంబ నిర్వహణే రుజువు చేసింది. మార్క్సిజంలోని ప్రధాన అంశమైన అంతర్జాతీయ కార్మికవర్గ దృక్పథ స్వభావం, కామ్రేడ్ లక్ష్మమ్మగారి పాత్ర ఆమె వ్యక్తిత్వంలోనే మనం చూడగలం.

అగ్రకుల ఛాందస ఆచారాలలో పుట్టి శ్రమజీవులే పూజనీయులు, మానవత్వమే మా కులమని నిరంతరం గ్రామీణ వ్యవసాయ కార్మికులతో, పేపరుమిల్లు కార్మికులతో కలసిపోయి వారి సమస్యల పరిష్కారం కోసం జరిగిన ఉద్యమాలలో లక్ష్మమ్మగారి పాత్ర అద్వితీయం. ముఖ్యంగా ముస్లిం మహిళల్లో తలాక్ పద్ధతికి వ్యతిరేకంగా ఆందోళన చేసి, భర్తలను కోల్పోయిన మహిళలకు అండగా నిలచి

వారి భర్తలకు అత్తమామలకు నచ్చచెప్పి కుటుంబాలను నిలిపిన మానవతామూర్తి లక్ష్మమ్మగారు. అల్లే విడాకులు తీసుకునే దంపతులకు నచ్చచెప్పి విడాకులు మాన్పించి ఎన్నో సంసారాలను కాపాడిన దయామయి లక్ష్మమ్మగారు. మహిళల్లో ఆత్మరక్షణా చైతన్యం కోసం ఎంతగానో కృషి చేసిన ఆమె సామాజిక సేవ అత్యున్నతం. నెలల పసిబిడ్డలను చంకనెత్తుకుని ఎన్నికల ప్రచారాలలో మహిళలను సమాయత్తం చేయటానికి కాలినడకనే గ్రామాలు తిరుగుతూ అట్టడుగు వర్గాలలో ఎవరు ఏమిపెడితే అది తిని శ్రామిక జనచైతన్యం కోసం పెత్తందార్లకు వ్యతిరేకంగా గ్రామీణ ప్రజలకు ధైర్యం చెప్పటానికి లక్ష్మమ్మగారు చేసిన కృషి అజరామరం. రత్నాలసీమలో జాతిరత్నమే లక్ష్మమ్మగారు.

ఒకసారి ఎన్నికల సందర్భంగా నేను కర్నూలు వెళ్ళినప్పుడు కా. లక్ష్మమ్మగారు నన్ను ఇంటికి తీస్కెళ్ళారు. లక్ష్మమ్మగారి అత్తగారు కూడా అక్కడే ఉన్నారు. ఆమె పెద్దవయస్సులో వున్నా ఆరోగ్యం పరవాలేదు. కానీ నడవలేరు. పూర్వకాలపు స్త్రీ అయినా సమతామాతగా సామాజిక సంక్షేమం కోరుకుంటూ కోడలు లక్ష్మమ్మగారి సేవా కార్యక్రమాలను ప్రోత్సహించి గౌరవించారు. కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమాలను, ప్రియతమ నేత కా. సుందరయ్యగారిని ఎంతగానో గౌరవించారు. ఆవిడ తన అంత్యక్రియలను ఏ ఆచారాలు లేకుండా పార్టీ పద్ధతిలో జరపమని ఆదేశించారు. లక్ష్మమ్మ దంపతుల త్యాగపూరిత, ఆదర్శజీవనం, సామ్యవాద విశిష్టతను ఆ మహాతల్లి గుర్తించారు. ఆచరించారు. నిరంతరం ఫ్యాక్షనిస్టు, నిరంకుశ పెత్తందారుల అదుపు ఆజ్ఞలలో నలిగిపోయే రాయలసీమ గ్రామీణ ప్రాంతాలలో బడుగు జీవుల ఉన్నతికై పీడిత ప్రజల విముక్తికై కఠోర పరీక్షలనెదుర్కొంటూ ప్రజాతంత్ర ఉద్యమాల వారధులుగా లక్ష్మమ్మ దంపతులు పనిచేశారు. కఠోర శ్రామిక జీవనయానం వారి జైత్రయాత్ర వివరించటానికి నా భాషాజ్ఞానం చాలదు. వారి మార్గంలో సోషలిజం అజేయం అనేది

**1970వ సంవత్సరం విజయవాడలో జరిగిన మహిళా రాజకీయ పాఠశాలలో నాకు మొదటిసారి లక్ష్మమ్మగారితో వ్యక్తిగత పరిచయం. లక్ష్మమ్మగారు వంటశాల అజమాయిషీ బాధ్యత చూస్తూనే తరగతులలో పాల్గొనేవారు. ఈనాటికీ నేను మొదటిసారి గమనించిన ఆమె ఈ రాజకీయ సిద్ధాంత పరిజ్ఞానం ఆమె సామాజిక స్ఫూర్తి తొణికిసలాడే ఆమె వ్యక్తిత్వం నిరంతరం నాకు జీవితపాఠంగానే వుంటుంది.**

రుజువవుతుందని కొండంత ఆశతో ప్రజా ఉద్యమాలలో అంతర్యామిగా లక్ష్మమ్మగారు చిరంజీవి. ఆమె చరితం భావితరానికి మార్గదర్శకం. ఉద్యమాల విస్తరణకు దిక్సూచి ధన్యజీవి కా. లక్ష్మమ్మగారు చరితార్థం ఆమె జీవితం.

ప్రియ సహచరి
లక్ష్మమ్మగార్కి శ్రద్ధాంజలి ఘటిస్తూ...
అల్లూరి మన్మోహిని.

*(17వ పేజీ తరువాయి)*

విడిచిపెట్టాల్సిన లాంచీ కొన్ని కారణాల చేత లాంచీ ఆలస్యంగా బయలుదేరుతుందని కబురు పంపారు. ఈ ఆలస్యాన్ని సహించలేక లాంచీ దిగి, స్విమ్మింగ్ దుస్తులు ధరించి గోదావరిలోకి ఉరికి 15 మైళ్ళ దూరం ఈది ఎనిమిదిన్నర గంటలకు నరసాపురం రేవు చేరుకొన్నారు. ఆనాడు అమావాస్య తాము ఎన్నడూ కనీవినీ ఎరుగని ఈత అని ప్రజలు చెప్పుకొని, ఆమెను చూడడానికి తండోపతండాలుగా ప్రజలు వచ్చారు. జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్‌లో నివసించిన కాలంలో భారత స్వాతంత్ర్య ఉద్యమం, భారత మహిళాభ్యుదయం గూర్చి ప్రసంగాలను, ఇష్టాగోష్టులను నిర్వహించారు. ఆ దేశపు మహిళా ఉద్యమంలో చురుకుగా పాల్గొన్నారు. 1958లో మాస్కో వెళ్ళి అక్కడ స్థిరపడ్డారు.

1965 జులై 27న ఒక రోడ్డు ప్రమాదంలో ఆమె మరణించారు. ఆమె మృతి చెందిన నాడు కూడా ఉదయం కసరత్తూ, ఈత ముగించుకొని బజారుకు బయలుదేరారు. తిరిగి వచ్చేటప్పుడు రోడ్డు దాటుతుండగా కారు ప్రమాదంలో మరణించారు.

ఆ వార్త స్విట్జర్లాండ్‌లో వున్న వారి కుటుంబానికి తెలియజేశారు. వారు జవాబుగా ఆమె మరణించిన స్థలంలో లేక భూస్థాపితం చేసిన స్థలంలో జ్ఞాపకార్థం ఏదైనా నిర్మించారా? నిర్మిస్తే దాని ఫోటోగ్రాఫు పంపాల్సిందిగా వారు కోరారు. దానికి జవాబుగా సమాధి కట్టించటం హిందూ సంప్రదాయం కాదని, మా తల్లిదండ్రులకు సమాధులు కట్టించలేదనీ, అది మా ఆచారం కాదనీ లక్ష్మణరావు తెలియజేశారు. ఆ సమాధానం వారికి అప్రియంగా, ఆగ్రహం తెప్పించేదిగా ఉందనిపించింది.

సోవియట్ దేశంలో ఆచారం, పద్ధతుల ప్రకారం ఒకేరోజున దహనం చేసిన వారి చితాభస్మాన్ని, అస్థికల్నీ 14 రోజుల వరకూ వేర్వేరుగా భద్రపరుస్తారు. ఆనాడు చనిపోయిన వారి చితాభస్మాలను వారి బంధువులు కోరిన యెడల (రాత మూలకంగా) వారికి అందజేస్తారు. లేనిచో, వాటిని భూస్థాపితం చేస్తారు. మెల్లీ చితాభస్మం లక్ష్మణరావు గారు తీసుకోకపోవటంతో మెల్లీ బంధువులకు మరింత కోపం, దు:ఖం కలిగించి వుంటుంది.

ధైర్య సాహసోపేతంగా, తెలుగు వారి గృహిణిగా, భారతీయ స్వాతంత్ర్యోద్యమ నాయకురాలిగా, భారత ప్రజల కష్టనిష్ఠూరాలను పంచుకొన్న నాయకురాలిగా భారతీయ సమాజంలో అంతర్భాగమై నిల్చిపోయింది. ఆమె జీవితం మనందరికీ స్ఫూర్తిదాయకమే. ✦

కథ

# అడగని వరం

ఎస్.ఎస్. లక్ష్మీదేవమ్మ

జానకమ్మది మధ్యతరగతి కుటుంబం. తన భర్త తెచ్చే చాలీ చాలని జీతపురాళ్ళతో గుట్టుగా సంసారం చేసుకుంటూ తన ముగ్గురు బిడ్డల చదువులను కొనసాగిస్తుంది. చుట్టుప్రక్కల వాళ్ళు జానకమ్మను చాలా ఇష్టపడతారు. తనకున్న దాంట్లో సహాయం చేసే మనస్తత్వం. మృదుస్వభావి. తమ సాధక బాధకాలు శారదమ్మతో చెప్పుకొని ఓదార్పు పొందేవారు. బస్తీలో అందరికి తలలో నాలుకలా వుంది జానకమ్మ.

ఒకరోజు అనుకోకుండ జానకమ్మ దూరపు బంధువు వరుసకు పిన్ని అయిన సత్యమ్మ వంగిన నడుముతో, చేతిలో కర్రతో వృద్ధాప్య భారంతో సరిగా నడవలేని పరిస్థితిలో జానకమ్మ దగ్గరికి వచ్చేసింది. తనకు ఎవ్వరు లేరు. ఈ సమయంలో ఆమెకు జానకమ్మ గుర్తొచ్చింది. చిన్నప్పటి నుండి తెలిసిన జానకమ్మ అంటే సత్యమ్మకు పంచప్రాణాలు.

జానకమ్మ ఈ ఆకస్మిక రాకకు ఆశ్చర్యపోతూ 'ఏమిటి పిన్ని ఇలా వచ్చావు' అని అడిగింది.

'ఏం చేస్తాను అమ్మాయి. ఈ వయసులో నీదగ్గర సేద తీరాలనిపించింది. నాకున్న నగా, నట్రా, బంగారం, నగదు అంతా మూటగట్టుకొచ్చాను. నీవే నాకు దిక్కు. అంతా నీదే భారం. చివరిదాక నన్ను చూచుకొని కడతేర్చు తల్లి' అని బ్రతిమాలుతూ కంటనీరు పెట్టుకుంది సత్యమ్మ. పిన్ని ఇలా మాట్లాడుతుంటే జానకమ్మకు కన్నీరు ఆగలేదు.

వృద్ధాప్యం తన పిన్నమ్మను ఎలా కృంగదీసింది. ఎంతో ఉన్నతంగా బ్రతికిన చిన్నమ్మ నన్ను బ్రతిమాలుకోవడమేమిటి? ఏమిటి సృష్టి వైపరీత్యం, అనుకున్న జానకమ్మ చిన్నమ్మకు భరోసా ఇచ్చింది. ఎలాంటి దిగులు పెట్టుకోవద్దని, తనను బిడ్డగానే భావించమని గట్టిగా చెప్పింది.

ఒకరోజు సత్యమ్మ జానకమ్మను ప్రక్కకు పిలిచి "అమ్మాయి నేను తెచ్చిన మూటను అలానే పెట్టావా ఏంటీ? ఇన్నాళ్ళు నేను ఆ మూటను చూసుకునే బ్రతికాను. ఇక చాలు నీవు ఆ సొమ్మును సద్వినియోగం చేసుకో. ఇల్లు కట్టుకో, పిల్లల చదువుకు ఖర్చు పెట్టు" అని చెప్పింది. జానకమ్మ పిన్నమ్మ కోరిక ప్రకారం చెయ్యడానికి పూనుకుంది.

పెద్ద గదులు, పెద్ద వరండా, ఓపెన్ కిచెన్, పెద్దహాలు అన్ని హంగులతో ఇల్లు పూర్తయింది. కొంతమంది జానకమ్మకు సలహా ఇచ్చిందేమిటంటే సత్యమ్మకు ఒక రూం కేటాయించి అక్కడనే వుండేటట్లు ఏర్పాటు చెయ్యమని. కానీ జానకమ్మకు ఈ సలహా నచ్చలేదు. ఒక రూంలో పడేస్తే చిన్నమ్మకు ఎలా పొద్దుపోతుంది. ముందే పల్లెటూరు నుండి వచ్చినావిడ. కనుక శారదమ్మ మానవీయ కోణం నుండి ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చింది. పెద్దహాలులో ఒక ప్రక్క పిన్నమ్మ మంచం ఏర్పాటు చేసింది. ఒక పనిమనిషిని పిన్నమ్మ కొరకే ఏర్పాటుచేసింది. పొద్దున్నే పిన్నమ్మను బాత్‌రూమ్‌కు తీసికెళ్ళి కాలకృత్యాలు అయిపోగానే స్నానం చేయించి శుభ్రమైన బట్టలు కట్టి మంచం మీద కూర్చోబెట్టాలి. వెంటనే టీ, టిఫెను ఇచ్చి, మందులు ఇవ్వాలి. ఇక అప్పుడు సత్యమ్మ ఆ ఇంటికొచ్చిపోయే వాళ్ళతో ముచ్చట్లు, తనకళ్ళ ముందే వంట అయిపోతుంది. ఇంటి నిండా మనుషులు. జానకమ్మ ఇల్లు నిత్య కళ్యాణం పచ్చతోరణంగా వుండేది. వంట ఘుమ ఘుమలతో ఇల్లు పండుగ వాతావరణం వుండేది.

కొన్నాళ్ళకు జానకమ్మకు ఒక సమస్య వచ్చింది. జానకమ్మ కూతురు సుజాత బి.ఎ చదువుతోంది. అమ్మాయి ప్రేమలో పడిపోయింది. అబ్బాయిది ఇంటర్ కాస్ట్. ఈ విషయం తెలుసుకున్న జానకమ్మ కుప్పకూలిపోయింది. ఇంకేమన్నా ఉన్నదా! బంధు బలగానికి ఈ విషయం తెలిస్తే తన ముఖం ఎక్కడ పెట్టుకోవాలా అని వాపోయింది. ఇంతలోగా సుజాత బామ్మకు విషయం తెలిపింది. ఇది విన్న బామ్మ అమ్మాయికి ధైర్యం చెప్పింది. "ప్రేమించడం తప్పు కాదని, కులం చూసుకుని ప్రేమ పుట్టదని, ఇద్దరి మనసులు ఒకటైన నాడు ప్రేమ పుడుతుందని, మీ అమ్మతో నేను మాట్లాతానులే నీవు ధైర్యంగా వుండు "అని బామ్మ నోటి నుండి మాటలు వస్తుంటే నమ్మశక్యంగా లేదు సుజాతకు.

వెంటనే సత్యమ్మ జానకమ్మను పిలిచింది. "ఏమిటమ్మాయ్ ఈ మధ్య చాలా బాధగా అగుపిస్తున్నావు ఏమిటి సంగతి?" అని అడిగింది. జానకమ్మ తన పిన్నమ్మ ఇలా అడగగానే భోరున ఏడ్చేసింది. పిన్ని నాకు ఒక పెద్ద సమస్య వచ్చి పడింది. సుజాత ఎవర్నో ప్రేమించిందట. ఆ అబ్బాయి మన కులం వాడు కాదట, నేనేం చేసేది? అంటూ ఏడ్వటం మొదలుపెట్టింది. సత్యమ్మకు కోపం వచ్చింది. 'ఇక చాల్లే ఆపు నీ ఏడుపు. పిల్ల ఏదో కొంపలు మునిగిన తప్పు చేసిందని బాధపడుతున్నావేమిటి? ప్రేమించటం తప్పా? ప్రేమ అనేది ఎవరి మీద ఎప్పుడు పుడుతుందో ఎవరికి తెలుసు? డబ్బును చూసి, హోదాను చూసి ప్రేమ పుడుతుందా? ఏ కులం వాళ్ళు ఆ కులం వాళ్ళనే ప్రేమించుకోవాలని వుందా? అమ్మాయి ఇద్దరు మనుషులు కలిసి కాపురం చేసుకోవడానికి కులంతో సంబంధమేమిటే? కులం కుచ్చితాలు పోవాలి. జన్మత: లేని

ఆపు నీ ఏడుపు. పిల్ల ఏదో కొంపలు మునిగిన తప్పు చేసిందని బాధపడుతున్నావేమిటి? ప్రేమించటం తప్పా? ప్రేమ అనేది ఎవరి మీద ఎప్పుడు పుడుతుందో ఎవరికి తెలుసు? డబ్బును చూసి, హోదాను చూసి ప్రేమ పుడుతుందా? ఏ కులం వాళ్ళు ఆ కులం వాళ్ళనే ప్రేమించుకోవాలని వుందా? అమ్మాయి ఇద్దరు మనుషులు కలిసి కాపురం చేసుకోవడానికి కులంతో సంబంధమేమిటే? కులం కుచ్చితాలు పోవాలి.

కులం మధ్యలో వచ్చింది. నీవు చాలా మంచిదానవు జానకమ్మ ఈ విషయం పెద్ద మనసుతో ఆలోచించు. పిల్లను బాధపెట్టకు, నీవు బాధ పడకు' అని పిన్ని అంటుంటే పల్లెటూరులో వుండివచ్చిన పిన్ని తనకంటే మేలు అనుకున్నది జానకమ్మ.

మొత్తంమీద శుభస్య శీఘ్రం అని ఆ కులాంతర వివాహం ఘనంగా జరిపించారు. ఒకసారి ఎవరో అడిగారు సత్యమ్మను. "అవ్వ ఊర్లో ఎలావుందీ? ఇప్పుడు ఎలా వుందీ జీవితం" అని. "ఏం చెప్పను నాయినా ఊర్లో వున్నప్పుడు ఊరు పొమ్మంటుంది, కాడు రమ్మంటంది అన్నట్లు వుండేది. ఎప్పుడెప్పుడు పిలుపొస్తుందో ఆ దేవుడి నుండి అని ఎదురు చూస్తుండేదానిని. కానీ ఇప్పుడు ఇంకా బ్రతకాలనిపిస్తుంది. రోజులు ఎలా వెళ్ళిపోతున్నాయో తెలవడంలేదు. ఇదంతా నా తల్లి జానకమ్మ నుంచే. ఎంత సంపద ఇస్తే మాత్రం ఇంత మానవత్వంతో చూసుకుంటారా?" అన్నది.

ఆస్థి వచ్చినందునే జానకమ్మ ఇలా చెయ్యలేదు. లక్షల ఆస్థులను తీసుకొని తల్లి తండ్రులను ఎంత మాత్రం పట్టించుకోని వాళ్ళను చూస్తున్నాం. అరచేతిలో అన్నం పెడితే 60 ఏండ్లు తలచుకునే వారని ఒక నానుడి. కానీ ఇప్పుడు చేసిన మేలును రెప్పపాటులో మరచిపోవడమే గాక ఇంకా ఎక్కువ సహాయం చేసేది వుందే అనుకునేవాళ్ళు ఎక్కువైపోయారు.

స్వార్థం పెరిగిపోవడం రోజు రోజుకి ఎక్కువైంది. ఈ దుష్ట సమాజ ప్రభావం చాలామటుకు కారణం, ఎవరిని నమ్మాలో ఎవరిని నమ్మకూడదో అర్థం కాని సంధికాలం ఇది.

సత్యమ్మ జానకమ్మ మీద ప్రేమతో నమ్మకం వుంచి ప్రశాంతంగా వుండింది. ఇచ్చిన మాట ప్రకారం ఎలాంటి లోటు రాకుండా జానకమ్మ మానవత్వంతో తన పిన్నమ్మను కడదాక చూసుకుంది. ఇది ఆదర్శమే!! జానకమ్మకు హ్యాట్సాఫ్!!. ✦

## మోటూరు ఉదయం ట్రస్టు ఆధ్వర్యంలో

# కుటుంబ న్యాయ సలహా కేంద్రం ప్రారంభం



మహిళలపై హింస రోజురోజుకూ పెరుగుతూనే ఉందిగానీ, తగ్గడం లేదు. నేటి వేగవంతమైన జీవన విధానం కారణమంటూ మేధావులు చెప్తున్నారు. కానీ వీటి మూలాల్ని గుర్తించకుండా పరిష్కారం సాధ్యంకాదు. ఒకవేళ పరిష్కారమైనా, అవి తాత్కాలిక ఉపశమనమే. మహిళని చూసే దృష్టికోణంలోనే మార్పు రావాలి. స్త్రీని ఒక మనిషిగా గుర్తించాలి. ఆధునిక మహిళ ఆర్థికంగా కుటుంబంలో భాగస్వామ్యం అవుతున్నా, పురుషుడు మాత్రం తన వంతు సహకారాన్ని అందించడం లేదు. స్త్రీని బానిసగానే చూస్తున్నాడు. అవమానించడం, లైంగికంగా వేధించడం, కట్న కానుకలు ఆశించడం తదితర రూపాలలో హింస పెరిగంది. ఆమె లక్షలు సంపాదించవచ్చు, అతనికి ఉద్యోగమే లేక ఆమె సంపాదనపైనే ఆధారపడవచ్చు. అమ్మాయిలు కూడా అన్నింటా తాముంటున్నప్పుడు ఇంటిపనిలో కూడా పురుషుల భాగస్వామ్యాన్ని కోరుకుంటున్నారు. ఉమ్మడి కుటుంబాలు లేకపోవడంతో బేధాభిప్రాయాలే పెద్ద గొడవలుగా పరిణామం చెందుతున్నాయి. మరోవైపు ఎంత దూరంలో ఉన్నా తల్లిదండ్రుల జోక్యం వారి ప్రభావం చూపుతోంది.

మరోవైపు సామాజికంగా అనేక సమస్యల్ని నేటి యువత ఎదుర్కొంటున్నారు. సాంకేతికత ఎంత పెరిగిందో అంతకు రెట్టింపు దుష్ప్రభావం యువతపై పడుతోంది. నేటి యువతలో పునరుత్పత్తి ప్రక్రియలో లోపాలు ఎక్కువగా వస్తున్నాయి. ముమ్ముందు ఇదో పెద్ద సామాజిక సమస్యగా మన ముందుకు రాబోతోంది. టీనేజిలో ఉన్న అమ్మాయిలు కూడా వేధింపులు, మోసాలు,

ప్రేమ వైఫల్యాలు లాంటి సమస్యలు ఎదుర్కొంటున్నారు.

వీటన్నింటి నేపథ్యంలో ఐద్వా ఆధ్వర్యంలో కుటుంబ న్యాయసలహా కేంద్రాలు పనిచేస్తున్నాయి. ప్రధానంగా మోటూరు ఉదయం ట్రస్టు ఆధ్వర్యంలో హైదరాబాద్ కేంద్రంగా ఐదేళ్ళుగా పనిచేసింది. రాష్ట్ర విభజన తర్వాత ట్రస్టు కార్యకలాపాలు విజయవాడ కేంద్రంగా జరుగుతుండటంతో న్యాయసలహా కేంద్రం కూడా ప్రారంభమైంది. విజయవాడలోని రెడ్ సర్కిల్ ఏరియాలో బెల్లపు శోభనాద్రి గ్రంథాలయంలో ట్రస్టు ఆధ్వర్యంలో యువత, కుటుంబ న్యాయసలహా కేంద్రాన్ని జులై నాల్గవ తేదీన ప్రారంభించారు. ఈ కేంద్రం ప్రతి శుక్రవారం పనిచేస్తుంది.

**ప్రారంభ సభ వివరాలు..**

న్యాయసలహా కేంద్రాన్ని ఫ్యామిలీకోర్టు కృష్ణాజిల్లా జడ్జి జస్టిస్ వి.నిర్మలా గీతాంబ ప్రారంభించారు. అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం (ఐద్వా) ఆధ్వర్యంలో మాంటిస్సోరి మహిళా కళాశాలలో సభను ఏర్పాటు చేశారు. ఆ సందర్భంగా వక్తలు మహిళలపై హింసకు కారణాలు, స్త్రీలు ఎదుర్కొంటున్న సమస్యల్ని ప్రస్తావించారు. కుటుంబంలో భార్యాభర్తల మధ్య వచ్చిన తగాదాల్ని సాధ్యమైనంత వరకు పరిష్కరించి, వారిని కలిపి ఉంచటానికి ప్రయత్నించాలని సూచించారు. విడాకుల కేసులు పెరగటం వల్ల దాని ప్రభావం సమాజంపైనా, పిల్లలపైనా పడుతుందని వారు ఆందోళన వ్యక్తం చేశారు. కుటుంబ సమస్యలకు ఆఖరి ప్రయత్నం కోర్టులు అన్నారు. కుటుంబంలో గొడవలు వచ్చినప్పుడు ఎవరికి చెప్పుకోవాలో తెలియక చాలామంది ఇబ్బందులు పడుతున్నారని తెలిపారు. ఇలాంటి న్యాయసలహా కేంద్రాన్ని ఏర్పాటు చేయటం ద్వారా మహిళలకు ధైర్యం వస్తుందన్నారు. కొంతమంది వారి స్వార్థం కోసం సినిమాలను అశ్లీలంగా తీస్తుండటం దురదృష్టకరమన్నారు. ఈ క్రమంలో కూడా అనేక సమస్యలు వస్తుంటాయని వాటిని పరిష్కరించుకోవటానికి న్యాయసలహా కేంద్రం ఎంతో దోహదం చేస్తుందని అన్నారు. సమాజంలో వచ్చే ఒత్తిళ్లు కుటుంబ జీవనంపై కూడా ప్రభావితం చేస్తాయన్నారు. మహిళలు మానసిక ఒత్తిడికిలోనై అనారోగ్యం పాలవుతున్నారని చెప్పారు. అలాంటి వారికి కౌన్సెలింగ్ చేయటం ద్వారా ఫలితాలు ఉంటాయన్నారు. మద్యానికి బానిస కావటం వల్ల ఎక్కువగా కుటుంబంలో సమస్యలు వస్తున్నాయని చెప్పారు. మహిళలు హక్కులను సాధించుకునే క్రమంలో జరిగే పోరాటంలో మహిళలు వారి హక్కుల్ని దుర్వినియోగం చేస్తున్నారనే ప్రచారం ఎక్కువగా ఉందన్నారు. అలాంటి ప్రచారం వల్లనే 498(ఎ) యాక్ట్ నీరుగారిపోతోందని చెప్పారు. కుటుంబాల్ని రక్షించే బాధ్యతను మహిళలపై నెట్టేశారన్నారు. మహిళల హక్కుల గురించి విస్తృత ప్రచారం జరగాలన్నారు. వివాహానికి ముందు కాబోయే భార్యాభర్తలు వైద్యపరీక్షలు చేయించుకునే సంస్కృతి రావాలన్నారు.. భార్యాభర్తల మధ్య శారీరక సమస్యలే కాకుండా మానసిక సమస్యలు కూడా ఉండటానికి అవకాశం ఉన్నందున న్యాయసలహా కేంద్రం సమస్యల్ని పరిష్కరించే క్రమంలో సైకాలజిస్టు, సైక్రియాటిస్టుల్ని, గైనకాలజిస్టుల్ని కూడా సంప్రదించాలని సూచించారు.

డాక్టర్ మోటూరు ఉష అధ్యక్షత వహించిన సభలో ఫ్యామిలీకోర్టు కృష్ణాజిల్లా జడ్జి జస్టిస్ వి.నిర్మలా గీతాంబ, మాంటిసోరి కోటేశ్వరమ్మ, సైక్రియాటిస్ట్, ప్రొఫెసర్ రాధికారెడ్డి, ప్రముఖ న్యాయవాది సుంకర రాజేంద్రప్రసాద్, గైనకాలజిస్ట్ వెల్లంకి శ్రీదేవి తదితరులు ప్రసంగించారు. తొలుత మహిళా ఉద్యమ నిర్మాతలు మానికొండ సూర్యావతి, మోటూరు ఉదయం చిత్రపటాలకు పూలమాలలు వేసి నివాళులర్పించారు. ఈ సందర్భంగా ఇటీవల కళాశాల విద్యార్థులకు వ్యాసరచన, వక్తృత్వం పోటీలను నిర్వహించారు. ఈ పోటీల్లో విజేతలుగా నిలిచిన వారికి బహుమతులు అందజేశారు.

✦

---

## మేలుకొలుపు

కాలచక్రం తిరుగుతూనే ఉంటుంది
చరిత్ర పునరావృతం అవుతూనే ఉంటుంది
పాపాయి – అమ్మాయి – అమ్మ
మళ్ళీ ఆ అమ్మకి ఓ పాపాయి
ఇదేనా చక్రభ్రమణం అంటే?
నాన్న – అన్న – ఆయన – అబ్బాయి
స్థానం మారినా
బంధుత్వం మారినా
అందరిదీ ఒకటే బుద్ధి
అదే మగబుద్ధి
అదే స్వార్థం
'అతివ' మనసు తెలుసుకోలేని 'అతిశయం'
తమ సేవకై
ఆ బ్రహ్మ స్త్రీజాతిని పుట్టించాడని
ఓ దురభిప్రాయం!
అందులోంచి పుట్టింది శ్రమదోపిడి
స్త్రీ శక్తిని నిర్వీర్యం చేసే
ఎత్తుగడ అది.
ఎదురు తిరగకుండా
పాతివ్రత్య కథలు
శీలవతుల చరిత్రలు
వారి మహిమలు
సూర్యోదయాన్ని ఆపేశక్తి 'ట'
రాళ్ళను గుగ్గిళ్ళుగా మార్చే యుక్తి'ట'
ఇవేనా స్త్రీ జీవితాన్ని
ఉద్ధరించే కథలూ కావ్యాలు?
ఇవి –
స్త్రీ శక్తిని నిర్జించే కథలు
స్త్రీ శ్రమను దోపిడీ చేసే కథలు
దుర్మార్గుల నెదిరించిన కథలు
అన్యాయాలనెదిరించిన కథలు
అవమానానికి బుసలు కొట్టి
ప్రతీకారేచ్ఛను రగిలించిన కథలు
కావాలి – అవి
స్త్రీ జాతిలో జవసత్వాలను మేలుకొలపాలి
దాస్య విముక్తికై దారి చూపాలి
అందుకు –
ప్రతి మహిళా ఓ చైతన్య మూర్తి కావాలి
ప్రతి మహిళా ఓ మహిషాసుర మర్దినిలా
కదలాలి.

– ఆర్. దుర్గా ప్రసన్న

హేతువు

# 'పుష్కరము' నమ్మకములు

- బాబు గోగినేని

'నదీ పుష్కరం' హిందూ మతాచారం. మన దేశంలో 12 ముఖ్యనదులు, 12 రాశులు ఉన్నాయి. ఒక్కొక్క నదికి ఒక్కొక్క రాశి అనుసంధానించబడింది. బృహస్పతి 12 భూ సంవత్సరాలకొకసారి సూర్యుని చుట్టూ తిరుగుతుంది. అందువల్ల ప్రతి నదికీ పన్నెండేళ్లకు ఒకసారి పుష్కరాలొస్తాయి. ఈ విధంగా ఆ గ్రహం ఏడాది పాటు ప్రతి రాశియందు ఉంటుంది. ఆ ఏడాదిలోని మొదటి, చివరి పన్నెండు రోజులు అతి పవిత్రమైనవి. ఈ పవిత్ర సమయంలో 33 కోట్ల సకల హిందూ దేవతలు పుష్కర నదిలో స్నానమాచరిస్తారు. సర్వపాపాలు పోగొట్టుకునేందుకు ఇదే సరైన సమయం. ఈ సమయంలో కాలం చేయడం అదృష్టమనే నమ్మకాలు ఉండడం వల్ల పుష్కరాలకు వేల సంఖ్యలో వచ్చే యాత్రికుల సమూహం చిన్నపాటి కుంభమేళాను తలపిస్తుంది. మక్కా యాత్రికుల జనసమూహం ఎంత విశిష్టమైనదో, అంతటి ప్రాశస్త్యము కలది ఈ కుంభమేళ.

బృహస్పతి సింహరాశి యందు ప్రవేశించినందున ఈసారి గోదావరి పుష్కరాలొచ్చాయి. 'నదిలో పవిత్ర స్నానమాచరించండి, మీ సర్వపాపాలు తుడిచిపెట్టుకు పోతాయి' అని పండిత సమేతంగా ముఖ్యమంత్రివర్యులే సెలవిచ్చారు. ప్రజాధనంతో చేసిన ఎన్నో ప్రకటనలు ప్రజలను పుష్కరమాచరించి పునీతులగుటకు ఆకర్షించాయి. ఇది వారు తమ పవిత్రతకు చిహ్నంగా భావించారు. పుణ్యం లభించడానికి ప్రతి ఒక్కరికీ పవిత్రమైన హృదయం కలిగి ఉండడమే కాదు పేదవారికి దానం, విరాళాలూ ఇవ్వాలి. నిరుపేదలను, అవసరార్థులను, ఆకలిగొన్నవారిని, రోగులను కాదని ఒక బ్రాహ్మణ పూజారికి దానం ఎందుకివ్వాలి? ఆ పూజారి బ్రాహ్మణుడే ఎందుకు అయి వుండాలి? ఆ బ్రాహ్మణునికి గో దానం, అధిక మొత్తంలో బియ్యం దానమివ్వడం పుణ్యకార్యమెలాగో ఎవరూ వివరించ లేకపోతున్నారు.

చాలా ఏళ్ల కిందట నేను గోదావరి పుష్కరాలకు వెళ్లాను. వేలాది యాత్రికులు రావడం వల్ల మలీనమైన పుష్కరఘాట్ల నీటి వల్ల పుణ్యం మాత్రమే వచ్చును.. రోగాలు రావని అనుకోవడమెలా? ప్రతిచోటా సగం ధరించిన వస్త్రాలతో, ఏనాడో మరుగైన భాషతో బ్రాహ్మణులు, భక్తుల పితృదేవతలకు పిండప్రదానం చేస్తూ కనిపిస్తారు. 300 ఏళ్ల కిందట హేతువాద కవియైన వేమన ఘాటుగానే ఈ ఆచారాన్ని 'పిండములు తినుటకు వచ్చు కాకులు తమ పూర్వీకులు ఎలాగవుతారు?' అని ప్రశ్నించారు. గత పుష్కరాల్లో తమ పూర్వీకులకు స్వర్గప్రాప్తి కలుగుటకు వారసులు సహకరించినచో, మళ్లీ 12 ఏళ్ల తర్వాత ఈ ఖర్మ చేయాల్సిన అవసరం ఏంటి? రావులపాలెం వద్ద చూడచక్కని గ్రామాలను తిరుగుట ఎంతో ఆహ్లాదకరమైన అనుభవం. అప్పట్లో రావులపాలెం వద్దనున్న గోదావరి నది ఉనికి కూడా ఎవరికి తెలియదు. అక్కడే ఈ గోదావరి మహానదీమతల్లిని దర్శించుకున్నాను.

## గోదావరి నది - ప్రత్యేకతలు

గోదావరి ఒక మహానది. గంగా నదంత విశిష్టత ఉండుట వలన దీన్ని 'దక్షిణ గంగ' అని అంటారు. పొడవైన, స్ఫూర్తిదాయకమైన నది. ఈ నదీమ 'తల్లి' ప్రాణదాతయే కాదు ఉధృతమైన వరదలు వచ్చినప్పుడు ప్రాణాలను సైతం హరిస్తుంది. ఈ విషయాన్ని కూడా దృష్టిలో పెట్టుకోవాలి. ఏదేమైనా ఈ నదియొక్క మరో కోణం చూద్దాం.

ప్రపంచంలో పొడవైన నది నైలు నది. తరువాతి స్థానం అమెజాన్ నదిది. అవి రెండూ 6500 కిలోమీటర్ల కంటే పొడవైనవి. ఇక్కడ విచారించదగ్గ విషయం ఏమిటంటే 37వ అతి పెద్ద నదైన మన



గంగా నది మిక్కిలి కలుషితమైన నదుల్లో 5వ స్థానంలో ఉంది. గంగా నది పొడవు దాదాపు 2600 కిలోమీటర్లు కాగా గోదావరి నది పొడవు 1450 కిలోమీటర్లు. మనకు తెలిసిన ఇతర నదులతో పోలిస్తే, స్టెన్స్‌ని థేమ్స్ నది కంటే దాదాపు 30 రెట్లు ఎక్కువగా నీటిని మన గోదావరి నది విడుదల చేస్తుంది. వాస్తవానికి గోదావరి నది ఎంతో స్ఫూర్తిదాయకమైన నది, అయినా అంతకంటే పొడవైన ఇతర నదులు మరింత ఆశ్చర్యచకితులను చేస్తాయి. గోదావరి దేశంలోని మూడు రాష్ట్రాల్లో ప్రవహిస్తుండగా నైలు నది ఆఫ్రికాలోని 11 దేశాల్లో ప్రవహిస్తూ జీవజలమిస్తోంది.

## రాశిచక్రాలు - గుడ్డి నమ్మకాలు

బాబిలోనియుల మూఢ నమ్మకమైన జ్యోతిష్యశాస్త్ర రాశిచక్ర చిహ్నాలు గ్రీసు దేశస్తులచే గ్రహించబడ్డాయి. ఆ తరువాత అవి భారతదేశంలో ప్రవేశించి స్థానిక లెక్కలు మరియు జ్యోతిష్యశాస్త్ర గ్రంథాల్లో చేర్చబడ్డాయి. 'భూమి చుట్టూ సూర్యుడు తిరుగును' అనుకుంటే తప్పా ఇదంతా ఆలోచించాల్సిన అవసరం లేదు. ఎన్ని అబద్దాలు ప్రచారంలో ఉన్నా రాశిచక్ర చిహ్నాల గురించి వేదాల్లో ఎక్కడా ప్రస్తావించలేదు. రెండు డాక్టరేట్లు పొందిన జ్యోతిష్యశాస్త్రజ్ఞుడు సైతం ఇది తప్పు అని నిరూపించలేకపోయారు.

## రాశియందు ప్రవేశించటం ?

మన వద్దనుండి 62 కోట్లు లేదా 620 మిలియన్ కిలోమీటర్ల దూరమున్న

బృహస్పతి 60 కాంతి సంవత్సరాల దూరంలో 30 నక్షత్రాలు గల సింహరాశి యందు ఎలా ప్రవేశిస్తుంది? ఒక 'కాంతి సంవత్సరం' అనగా ఎన్ని వేల కోట్ల కిలోమీటర్ల దూరమో వారికి తెలుసా? మరి బృహస్పతి ఆ రాశియందు ఎలా 'ప్రవేశిస్తుంది'? రాశిచక్ర చిహ్నాల స్మారక మూర్ఖత్వము పారలాక్స్ దోషముపై ఆధారపడినది. చంద్రునిపై నుండి చూస్తే ఈ రాశులు మరో విధంగా కనిపిస్తాయి.

ఈ మధ్య కాలంలో వారు 13 రాశిచక్ర చిహ్నాల గురించి మాట్లాడుతున్నారు. అంటే మరో నదిని వెతుక్కోవాలి. తస్మాత్ జాగ్రత్త! పుష్కరాలు హిందూ నదులకే వర్తిస్తాయి. 144 ఏళ్లకు ఒక్కసారే వస్తాయని పదేపదే చెబుతున్నారు. కొందరు జ్యోతిష్య శాస్త్రజ్ఞులు ఈ 144 అనే సంఖ్యనూ విభేదిస్తున్నారు. 'రాశియందు ప్రవేశించుట' అన్న సిద్ధాంతమే తప్పయినప్పుడు ప్రవేశం 144 ఏళ్లకా? 1440 ఏళ్లకా?అనే చర్చ అర్థం లేనిది. రాశుల గురించి వేదాల్లో ఎక్కడా చెప్పలేదు. మూఢనమ్మకాలను ఆసరా చేసుకుని లాభం పొందే కొందరి వల్ల వేదాల పట్ల ఈ తప్పుడు భావం ప్రచారంలో ఉంది. వేదాలు ఆ కాలంలో శిఖరాగ్ర స్థాయి తత్వశాస్త్రమును, ఎన్నో ఆసక్తికరమైన అంశాలను కలిగి ఉన్నాయి.

### జ్యోతిష్య శాస్త్రజ్ఞులా ?

ఇప్పుడో సూటి ప్రశ్న.. గోదావరి నదిలో పుణ్య స్నానమాచరించడానికి వెళ్ళి తొక్కిసలాటలో మృత్యువాత పడ్డ 23 మంది నిరుపేదల జీవితాల గురించి కనీసం ఏ ఒక్క జ్యోతిష్య శాస్త్రజ్ఞుడూ ఊహించలేక పోయాడెందుకు? జ్యోతిష్యంలో చిలుక శాస్త్రంలో రెండు డాక్టరేట్లు కలిగి టి.వి చర్చల్లో నాతో పాల్గొన్న వ్యక్తి వారికేదైనా హెచ్చరిక చేశారా?మరి ముఖ్య మంత్రివర్యులు 'మీ పాపాలను నీటిలో వదలండి' అన్నారు. ప్రాణాలనూ ఆయన విడవాలన్నారా? సామాన్యులు పాప భారంతో ఉన్నారని రాజకీయ నాయకులు అనుకుంటున్నారా? చాలామంది నిజాయితీతో జీవించే ప్రయత్నం చేస్తున్నారు కదా? ఇది వారిని అవమానించడం కాదా?

### స్వచ్ఛతా ? లేదా పరిశుభ్రతా ?

కొన్ని విషయాల్లో స్పష్టత ఉండడం అవసరం. 'స్వచ్ఛత' లేదా 'దైవభక్తి' మరియూ 'పరిశుభ్రత' వేరు. పవిత్రతనా? స్వచ్ఛతనా? అందువల్లనేమో ఈ పుణ్యభారత్‌లో ఇంకా స్వచ్ఛభారత్ అవసరమైంది. పుట్టుకతో వచ్చే స్వచ్ఛతపై కుల వ్యవస్థ ఆధారపడింది. నదిలో పవిత్రస్నానమాచరించే చోట మురికి నీరు గమనించారా? వస్త్రాల్లోని మరకలను పోగొట్టి నవీన డిటర్జెంట్ వలె, పాపాలు పోగొట్టగలిగేంతటి శక్తివంతమైన నదులు తమను తాము శుభ్రపరచుకుని, రసాయన కాలుష్యం నుండి విముక్తిని ఎందుకు పొందలేకపోతున్నాయి?

### పాపము మరియు నేరము-బ్రహ్మ చేసినది సరియైనదేనా ?

పాపం వేరు, నేరం వేరు. పుష్కరాలను సమర్థిస్తూ చెప్పబడిన పురాణగాథ ప్రకారం వ్యభిచార పాపం నుండి విముక్తి పొందేందుకు బ్రహ్మ ఇంద్రుణ్ణి పుష్కర పుణ్యస్నానం చేయమన్నారు. దేవతల రాజైన ఇంద్రునిచే మోసగించబడిన అహల్యకు బ్రహ్మ ఏ సహకారమూ అందించలేదు. ఇంద్రుడు అహల్య భర్తవలె మారు వేషంలో వచ్చి చీకటిలో ఆమెతో భౌతిక సంబంధం ఏర్పరచుకున్నాడు. ఫలితంగా రాయిగా మారాలని అహల్యను ఆమె భర్త శపించాడు. స్త్రీ జననేంద్రియాలు శరీరమంతా పొందమని ఇంద్రుడ్ని కూడా అహల్య భర్త భయంకరంగా శపించాడు. ఇలాంటి ఇంద్రునికి బ్రహ్మ సహకరించాడు. నవీన నైతిక అవగాహన ప్రకారం ఆలోచిస్తే ఒక బాధితురాలు శిక్షించబడి ఒక నేరస్థునికి సహాయం అందిన ఈ కథను పండుగగా ఎలా నిర్వహించుకోగలం? భారత శిక్షాస్మృతి సెక్షన్ 497 ప్రకారం ఇంద్రుని చర్య శిక్షార్హమైనది.

### నవీన భారతం

నవీన భారతం పురాణకాలం నుండి పుట్టింది. అయినా నవీన నాగరికతను పుణికిపుచ్చుకోడానికి ఎదురు చూస్తోంది. నవీన జ్ఞానం ఆధారంగా మన నమ్మకాలను, విలువలను మలచుకోవచ్చు. అలా చేసినప్పుడు భారతదేశం ఎంత శక్తివంతమైన దేశం కాగలదో చూడొచ్చు. భారతదేశ సంప్రదాయం, జాతీయవాదం మరియు విదేశీ సంప్రదాయ దుష్పరిణామాల గురించి మాట్లాడే మన గొప్ప జాతీయవాదులు బాబిలోనియా మరియు గ్రీకు మూఢ నమ్మకాలు హిందూ సంప్రదాయంలో భాగమవటాన్ని ఎందుకు ప్రశ్నించరు? భారతదేశ సంప్రదాయం అంటే హిందూ సంప్రదాయం మాత్రమే కాక నాస్తికుల, చార్వాకులు, బౌద్ధుల, జైనుల, సిక్కుల, ముస్లిముల, క్రైస్తవుల మరియు ఇతర సంప్రదాయాలు కూడా ఉన్నాయని ఎందుకు గుర్తించరు?

### ప్రత్యేక ప్రశ్నలు

'మీరు చెప్పేది బాధిస్తోంద'ని కొందరు, 'మీరు క్రైస్తవులను మరియు ముస్లిములను ఎందుకు విమర్శించరు?' అని మరికొందరు అడుగుతుంటారు. తెలివైనవాడెవడైనా పుష్కరాల గురించి చర్చ వచ్చినప్పుడు ఇస్లాం మతం గురించి మాట్లాడుతాడా? నేను చెప్పేది నచ్చకపోతే వినకు. లేదా ఛానల్ మార్చుకో. అంతేగానీ చిన్న పిల్లవాడివలె ప్రవర్తించకు. ఇంకా ఇతరులను (ముస్లిములను, క్రైస్తవులను) ఎందుకు విమర్శించవని అడుగకు.

అతి తేలికైన జవాబు ఏమంటే ముస్లిములకు, క్రైస్తవులకు పుష్కరాలు ఉండవు. వారి పండుగలూ, పబ్బాలు ఉన్నప్పుడు రాష్ట్రం ఇంతలా ప్రోత్సహించదు. ఇక్కడ మాత్రం ఎంతో ప్రోత్సహిస్తుంది. ఈ చర్చలను మేము నిర్వహించము. మేము దూరదర్శన్ నిర్వహించే చర్చల్లో అతిథులం మాత్రమే. అవును, క్రైస్తవులకు కూడా ప్రార్థనా పరంగా నయం చేయుట ప్రార్థన నూనెలు, ఇతర మోసాలు ఉన్నాయి. దానికి సంబంధించిన చర్చ జరిగినప్పుడు తప్పక మాట్లాడుతాం. చాలాసార్లు మనం చర్చల కోసం ఎదురు చూడం. ఫిలిప్పైన్సు నుండి వచ్చిన మోసగాడైన అలెక్స్ ఆర్బిటో అతేంద్రియ నయంవరచు విధానం

గుర్తుందా? ఆయన భారతదేశం వచ్చినప్పుడు మానవతావాదులు, హేతువాదుల ద్వారా బహిర్గతపరచబడ్డాడు. మరి ఆయన ఈ కుంభకోణం చేసేటప్పుడు హిందూ ప్రముఖులందరూ ఎందుకు ప్రేక్షపాత్ర వహించారు?

**నదులను మీరు నిజంగా గౌరవిస్తున్నారా ?**

మీరు నిజంగా నదులను గౌరవిస్తే ఏ ఒక్క నదికూడా ఇంతలా మలినమై కలుషితమైపోదు. కాలుష్యాన్ని నివారించి నదులను పరిరక్షించండి. మీకు నచ్చనివారిని మా ద్వారా విమర్శింపజేయాలని చూడకండి. మేము శతృత్వాన్ని ప్రోత్సహించం. మేము ఎవరిచే రెచ్చగొట్టబడము, ఎందుకంటే మేము ఎవర్నీ ద్వేషించం. మేము మీ మతాన్ని ద్వేషించం.

మేము దర్శనాలు, అద్భుతాలు, మతగ్రంథాలూ మరియు మతగురువులపై ఆధారపడ్డ అన్ని మతాలనూ తిరస్కరిస్తున్నాం. మాలో చాలామంది జ్ఞాన, మానవ హక్కులు, ప్రజాస్వామ్య ఆధారితమైన జీవిత సంబద్ధ నవీన తత్వాన్ని ప్రోత్సహిస్తారు. మేము మిమ్మల్ని కేవలం సమాజంలోని నమ్మకాలపై దృష్టి పెట్టేందుకు ఆహ్వానిస్తున్నాం. మా ఏకైక లక్ష్యం హేతుబద్ధమైన ఆలోచనాతత్వం గల సమాజం. అదే అందరికీ సంతోషకరమైన జీవితాన్నిస్తుంది. మీరు సైతం మా అంచనాలు, ప్రకటనలపై హేతుబద్ధమైన విమర్శలు చేయొచ్చు. అప్పుడు మా ఆలోచనలు మెరుగుపడతాయి. ఆలోచనల పోటీతో ప్రగతి సాధించవచ్చు. నిజానికి హిందూత్వం మెరుగుపడింది ఈ విధంగానే - స్వామీ వివేకానంద, స్వామీ దయానంద సరస్వతి, గాంధీజీ హిందూత్వం మెరుగుపడేందుకు కృషి చేశారు. ముందుకు పోయేందుకు అన్ని మతాలకూ సంస్కర్తలు అవసరం. కానీ మన లాంటివాళ్ళు మనల్ని, మన కుటుంబాలను మూఢనమ్మకాలు, అహేతుకత నుండి పరిరక్షించుకోవాలి.



పుస్తక సమీక్ష

## అసాధారణ జీవిత కథ 'నేను మలాలా'

- హారప్రసాద్

పాకిస్థాన్‌లోని స్వాత్‌లోయ్ ప్రకృతి అందాలు కనువిందుచేసే ప్రాంతం. అక్కడ 1997వ సంవత్సరం జూలై 12న మలాలా పుట్టింది. 'నేను మలాలా' పుస్తకం మలాలా జీవిత కథ. ఈ సంవత్సరం జూలై 12 నాటికి ఆమెకు 18 సంవత్సరాలు నిండాయి. ఈ పుస్తకం రాసి రెండేళ్ళయింది. సాధారణంగా జీవిత చరమాంకంలో జీవిత కథలు రాసుకుంటారు. ఓటు హక్కు వయస్సు కూడా లేని మలాలా తన జీవిత కథను రాయాల్సి రావడమే ఇక్కడ ప్రత్యేకత. ఇది నిండు జీవితం కథ కాదు. ఆటపాటలతో హాయిగా గడపాల్సిన బాల్యాన్ని పోగొట్టుకున్న బాలిక కథ. ప్రశాంతంగా పాఠశాలకు వెళ్లి చదువుకోవాల్సిన వయస్సులో ఆ చదువుకునే హక్కుకోసం ప్రాణాలొడ్డి పోరాడిన మలాలా కథ. స్వాత్‌లోయతో పాటు పాకిస్థాన్‌లోని ఏజన్సీ ప్రాంతాలను తాలిబన్లు ఆక్రమించి ప్రజలను వెంటాడి నరమేథం సృష్టించారు. అన్ని హక్కులను కోల్పోయి తాలిబన్ల మతమౌఢ్యపు తీవ్రవాద చర్యలకు బలైన ప్రజల గాథ 'నేను మలాలా'.




స్వాత్‌లోయలో తాలిబన్ల ప్రవేశానికి ముందు మలాలా కుటుంబం ప్రశాంతంగానే గడిపింది. ఈ పుస్తకంలో మలాలాతో పాటు మలాలా తండ్రి జియావుద్దీన్ కూడా హీరోనే. ఆధునిక భావాలతో అలరారే విద్యావేత్త జియావుద్దీన్. ఉదాత్తమైన ఆశయాలతో బాలబాలికలకు విద్యనందించాలనే తపనతో పాఠశాలను స్థాపించి నడపడానికి నానాపాట్లు పడ్డాడు. మలాలా తన తండ్రి పాఠశాలలోనే చదువుకుంది. తన తరగతిలో మొదటిశ్రేణి విద్యార్థినిగా రాణించింది. తన చదువు గురించీ, పాఠశాల గురించి, టీచర్ల గురించీ చాలా విపులంగా ఈ పుస్తకంలో వివరించింది. స్నేహితులతో చిరుకొట్లాటలు, తమ్ముళ్లతో గిల్లికజ్జాలు, తండ్రి జియావుద్దీన్ అనుబంధం, తల్లి తోర్‌పెకాయ్ ప్రేమ గురించి మనసుకు హత్తుకునేలా రాసింది. మలాలా మనతో మాట్లాడుతూ తన జీవిత

కథను చెబుతున్నట్టు ఉంటుందీ పుస్తకం. పాకిస్థాన్‌లోని స్వాత్‌లోయలో తన ఇంటిలో మనం కూడా ఆమెతో తిరుగుతూ ఆమె గురించి తెలుసుకుంటున్న భావనకు గురవుతాం.

మలాలా కుటుంబం తాలిబన్ల ఆదేశాలను ధిక్కరించింది. వారి మూర్ఖపు చర్యలకు నిరసన తెలిపింది. దాంతో తాలిబన్లు మలాలా కుటుంబంపై దాడికి పాల్పడ్డారు. అనేక బెదిరింపుల మధ్య మలాలా కుటుంబం గడిపిన కాలాన్ని ఈ పుస్తకం మనకు సజీవంగా పట్టిస్తుంది. మలాలా వ్యక్తిత్వం ఉన్నతంగా రూపొందడంలో తన చుట్టూ ఉన్న వాతావరణం ఎలా దోహదం చేసిందో పాఠకుడికి తెలుస్తుంది. ఒక సాధారణ బాలిక ప్రపంచవ్యాప్తంగా ప్రభావిత వ్యక్తిగా రూపొందడానికి కావలసిన నేపథ్యం మలాలా జీవితం చుట్టూ ఏర్పడింది. ఈ పుస్తకంలో ఉంది కేవలం మలాలా జీవితం మాత్రమే కాదు. మలాలా యూసుఫ్‌జెయ్ కుటుంబం తాలిబన్ల కారణంగా పడ్డ బాధలను వివరించేది మాత్రమే కాదు. ఈ రోజున ప్రపంచం అంతా ఏ సమస్యల గురించి మాట్లాడుకుంటుందో ఆ అంశాలన్నీ ఈ పుస్తకంలో ఉన్నాయి. తీవ్రవాదం, బాలికల చదువు, స్త్రీల హక్కులు, పేదరికం, పాలకుల విధానాలు ఇవన్నీ ఈ పుస్తకంలో అంశాలే. మలాలా గొంతు తన జీవితాన్ని గురించి వివరిస్తున్నట్లు ఉండదు. ఆ సమస్యలను ఎదుర్కోవడంలో ఈ ప్రపంచంలో మనలాంటి వారందరూ గొంతు విప్పాలని కోరుతున్నట్టు ఉంటుంది. ప్రపంచంలో ఒకచోట తీవ్రవాద సమస్య ఉందంటే మిగతా వారికి సంబంధం లేనట్టు అనుకోవద్దనే అంతర్లీన హెచ్చరిక మనకు వినిపిస్తా ఉంటుంది. ప్రపంచంలో ఒకచోట మతమౌఢ్యం కోరలు చాస్తుందంటే మనకు సంబంధం లేదని అనుకోవద్దనే అభ్యర్థన వినిపిస్తుంటుంది.

అమెరికాలోని వరల్డ్‌ట్రేడ్ సెంటర్‌పై విమానదాడికి పాల్పడిన బిన్‌లాడెన్‌ను మట్టుపెట్టిన విధానాన్ని వివరంగా రాసింది మలాలా. అమెరికా తను అనుకున్నది చేయడానికి ఎంతటి అతిక్రమణలకైనా పాల్పడుతుందని మలాలా రాసిన వివరాలు తెలియజేస్తాయి- 'వాళ్లు గుర్తించిన ఇంటిమీద శక్తివంతమైన డ్రోన్‌తో, చీకటిలో కూడా మనిషిని ఆనవాలు పట్టగల ఎక్స్‌రే పరికరాలు ఉన్న అధునాతన డ్రోన్‌తో అక్కడ ఎవరెవరు ఉన్నదీ పసికట్టారు. బారాటిగడ్డం ఉన్న పొడుగాటి మనిషి, పెరట్లో పచార్లు చేస్తూ ఉండడం, అది బిన్‌లాడెన్ అని గుర్తించడం చకచకా జరిగిపోయాయి. లక్ష్యం చిక్కింది వాళ్ల చేతికి. 'పేసర్' అని ఆ లక్ష్యానికి గుప్తనామం పెట్టుకున్నారు' అంటూ అమెరికా బిన్‌లాడెన్‌ను మట్టుపెట్టడానికి చేపట్టిన 'డ్రోన్' దాడులను ఆసక్తికరంగా వివరిస్తుంది. పాకిస్థాన్ పాలకులకు కూడా తెలియకుండా అమెరికా తన సాంకేతిక పరిజ్ఞానం ద్వారా చొరబడిన విధానం ఆందోళనకు గురిచేస్తుంది. తీవ్రవాదుల పట్ల పాకిస్థాన్, అమెరికా విధానాలు ప్రజల జీవితాలతో ఎలా చెలగాటమాడాయో మలాలా తీవ్రగొంతుతో చెబుతుంది.

పాకిస్థాన్‌కు మన దేశానికి చారిత్రక కారణాల రీత్యా ఏర్పడిన విభేదాలు మనకు తెలిసిందే. మన దేశం గురించి, పాకిస్థాన్ విభజన గురించి ఈ పుస్తకంలో కూడా మలాలా ప్రస్తావిస్తుంది. మలాలా ప్రస్తావించిన కొన్ని అంశాలు ఆ దేశాన్ని వాస్తవికంగా అర్థం చేసుకోవడానికి కొంత దోహదం చేస్తాయి. ఆమె ఎంత నిజాయితీగా తన అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తుందంటే ఒకచోట - 'మనం గనక భారతదేశం నుండి విడిపోకుండా ఉండి ఉంటే ఇంతకన్నా బాగా ఉండేవాళ్లమా నాన్నా' అనడిగా నేను అబ్బాజాన్‌ని. పాకిస్థాన్ ఏర్పడక ముందు భారతదేశంలో హిందూ - ముస్లిం మధ్యన ఘర్షణలు చెలరేగేవి. ఇప్పుడు స్వతంత్రదేశంగా అవతరించినాక కూడా ఆ కొట్లాటలు సాగుతూనే ఉన్నాయి. ముజాహిర్లు-పష్తూన్ల మధ్యన, షియాలు - సున్నీల మధ్య ఎడతెగని ఘర్షణలు జరుగుతూనే ఉన్నాయి.' అని రాస్తుంది. దేశ విభజన సమయంలో రెండువేపులా జరిగిన భయానక నరమేధం గురించి లెక్కలతో సహా వివరిస్తూ చాలా ఆవేదన చెందుతుంది. తన దేశంలోని అస్థిరమైన పాలనా వ్యవస్థ ప్రజలను ఎంతగా ఇబ్బందులకు గురిచేస్తుందో వివరిస్తుంది. ఈ ప్రస్తావనలన్నీ పాఠకుడికి ఆ దేశంలో రెండు దశాబ్దాలుగా జరుగుతున్న పరిణామాలను వాస్తవిక కోణంలో అర్థం చేయిస్తాయి.

"ఆధునిక మహిళ కావడం అంటే పర్దా లేకుండా తిరగడమే కాదు, ఆధునిక భావాలను అలవరచుకోవాలని." ఈ పుస్తకంలో ఒకచోట మలాలా రాసిన ఈ వాక్యాలు మతాలు, ఆచారాల పట్ల ఆమె అవగాహనను పాఠకుడికి పట్టిస్తాయి. ఆచారాలు, సంప్రదాయాల పేరుతో మతమౌఢ్యం తీవ్రవాదరూపం తీసుకోవడాన్ని శక్తివంతంగా నిలదీసింది మలాలా.

**మలాలా కుటుంబం తాలిబన్ల ఆదేశాలను ధిక్కరించింది. వారి మూర్ఖపు చర్యలకు నిరసన తెలిపింది. దాంతో తాలిబన్లు మలాలా కుటుంబంపై దాడికి పాల్పడ్డారు. అనేక బెదిరింపుల మధ్య మలాలా కుటుంబం గడిపిన కాలాన్ని ఈ పుస్తకం మనకు సజీవంగా పట్టిస్తుంది. మలాలా వ్యక్తిత్వం ఉన్నతంగా రూపొందడంలో తన చుట్టూ ఉన్న వాతావరణం ఎలా దోహదం చేసిందో పాఠకుడికి తెలుస్తుంది. ఒక సాధారణ బాలిక ప్రపంచవ్యాప్తంగా ప్రభావిత వ్యక్తిగా రూపొందడానికి కావలసిన నేపథ్యం మలాలా జీవితం చుట్టూ ఏర్పడింది.**

ఆడవాళ్ళు చదువుకోరాదని ఎక్కడ ఉందో చూపించండని నినదించింది. ఒక పక్క ఆధునిక ప్రజాస్వామ్య పవనాలు ప్రపంచం నిండా కనపడుతున్నాయి. మరోపక్క ఛాందసవు భావజాలంతో నిండిన సంప్రదాయాలు, కట్టుబాట్లు మనుషులను పీడిస్తున్నాయి. ఈ వైరుధ్యాల్ని ఈ పుస్తకం చాలా చక్కగా చిత్రీకరించింది.

మలాలా చదువుకు తాలిబన్ల నుండి ఆటంకాలు ఎదురయ్యే కొలదీ మలాలాకు బాలికలు చదువుకోవడం అనే అంశంపై ఆసక్తి పెరుగుతూ వచ్చింది. అది క్రమంగా మలాలా ఆశయంగా పరిణామం చెందింది. మలాలాను ప్రభావితం చేసిన అంశాలను ఆమె ప్రస్తావించడం ఈ పుస్తకంలో కనపడుతుంది. ఒకచోట – 'మేం మలకండ్ కనుమ దాటి ప్రయాణించేటప్పుడు నేను బత్తాయిపళ్లు అమ్ముతున్న ఒక ఆడపిల్లను చూశాను. ఎన్ని పళ్లు అమ్మేది లెక్క తెలియడానికి ఓ కాగితం మీద పెన్సిల్‌తో ఎన్ని పళ్లు అమ్మితే అన్ని గీతలు గీస్తా ఉండడం నా కంటపడింది. తనకి చదువులేని మూలాని అలా చేస్తున్నానని చెప్పింది. నేను తనని ఫొటో కూడా తీశాను. అలాంటి వాళ్లకోసం వాళ్లు చదువుకునే దాని కోసం, నా శక్తిమేరా సాయం చెయ్యాలని ఆ రోజునే నా మనసులో ఒట్టేసుకున్నా.' బాలికల చదువు పట్ల మలాలా దృఢ సంకల్పానికి ఆమె జీవితాన్ని ప్రభావితం చేసిన ఇటువంటి అంశాలే కారణం.

మలాలా ఎదుర్కొన్నది తీవ్రవాదుల ఉక్కుపంజానే అయినా ఆమెకు వారిమీద ద్వేషం కలుగలేదు. వారి పిల్లలకు కూడా చదువు అందివ్వండి అని ప్రపంచానికి విజ్ఞప్తి చేసేంత విశాలత్వాన్ని ప్రదర్శించింది. 'తాలిబాన్లు నన్ను చంపాలనుకున్నారు. కానీ వారి చర్యల వల్ల నా ఆశయాలు మరింత పదునెక్కాయి. మరింత విస్తరిస్తున్నాయి. వారు విఫలం చెందారు' అని ఐక్యరాజ్యసమితి వేదికపై ఘంటాపథంగా చెప్పడం మలాలాకే చెల్లింది. 'తుపాకులు, తూటాలు కాదు పుస్తకాలూ, కలాలూ కావాలి అనే ఆమె ప్రసిద్ధ నినాదం కూడా ఆమె ఆశయాన్ని ప్రతిధ్వనిస్తుంది.

పద్దెనిమిది సంవత్సరాలు దాటకుండానే వయసుకు మించిన అనుభవాలు మలాలాకు ఎదురయ్యాయి. భీతిల్లచేసే సంఘటనలకు సైతం చెక్కుచెదరకుండా ఆత్మవిశ్వాసంతో హక్కుల పతాకమై నిలిచింది మలాలా. 'తాలిబన్లు మా పుస్తకాలు, పెన్నులు ధ్వంసం చెయ్యగలరేమో కానీ మా ఆలోచనలను ధ్వంసం చేయ్యలేరుగా.'' అంటూ తీవ్రవాదాన్ని సవాలు చేస్తున్న మలాలాకు ప్రపంచం జేజేలు పలికింది. 'ఇహ మీదట ఈ ప్రపంచం నన్ను 'తాలిబాన్ కాల్పులకు గురైన ఆడపిల్ల' అని గుర్తించే దానికన్నా 'చదువుకునే హక్కుకోసం పోరాడిన ఆడపిల్లగా గుర్తింపబడడమే నాకు ఇష్టం, అందుకోసం నా జీవితాన్ని పూర్తిగా అంకితం చేస్తాను.'' అనడంలో ప్రపంచానికి ఒక సందేశాన్ని అందించిన మలాలా జీవితం నేటి యువతకు అత్యంత స్ఫూర్తిదాయకం. ముఖ్యంగా మన దేశం నేడు చాలా కీలక పరిణామాల మధ్య ఉంది. మతఛాందసాన్ని అన్ని రంగాలలో జొప్పించడానికి ప్రయత్నాలు జరుగుతున్న దశలో ఉన్నాం. మత దురభిమానం మత మౌఢ్యంగా మారి ఎంతటి దుర్మార్గచర్యలకు పాల్పడుతుందో మలాలా అనుభవాలు చెప్తాయి. ఇటువంటి పరిస్థితుల పట్ల ప్రజలు అప్రమత్తంగా ఉండాలి. మలాలా రాసిన ఈ పుస్తకం అటువంటి పరిస్థితుల గురించి మనకు ఒక హెచ్చరిక చేస్తుంది. అతిచిన్న వయసులోనే మలాలా అంతర్జాతీయ పరిణామాలను అవగాహన చేసుకున్న తీరు పాఠకులను ఆశ్చర్యానికి గురిచేస్తుంది. పుస్తకం నిండా పరిచిన మలాలా అభిప్రాయాలు ఎంతో పరిణతితో కనిపిస్తాయి. ఆమె తన శక్తినంతా బాలికల చదువు అనే అంశంపై కేంద్రీకరించింది. చదువు జీవితాలలో మార్పుతెస్తుందని ఆమె నమ్ముతుంది. ఆమె ప్రయత్నం నెరవేరాలని ఆశిద్దాం. ప్రపంచంలో ప్రతిదాన్ని శాసిస్తున్న పెట్టుబడిదారీ ఆర్థిక విధానం ఆమె లక్ష్యానికి ఓ పెద్ద ఆటంకం. ప్రజల్ని వినియోగదారులుగా చూసే ఆర్థిక విధానాలు మానవీయ విలువలకు వ్యతిరేకమైనవి. ఈ విషయాలు కూడా మలాలా గ్రహింపులో ఉన్నాయనే ఈ పుస్తకంలో కొన్నిచోట్ల ప్రస్తావించిన అంశాల వల్ల తెలుస్తుంది. మొత్తంగా ఈ పుస్తకం అనేక అంశాల పట్ల పాఠకుడిలో ఆలోచనలను రేపుతుంది. ముఖ్యంగా యువతీయువకులకు ఉత్తేజాన్ని ఇచ్చే పుస్తకం 'నేను మలాలా'.

ఇంగ్లీషులో ఈ పుస్తకం ఇంత బాగా రూపొందడానికి తగిన కృషి దీని వెనుక ఉంది. మలాలకు తోడుగా నిలిచిన సహరచయిత్రి క్రిష్టియన్ లాంబ్‌తో మొదలుకొని ప్రసిద్ధ సంపాదకుల చేయూత ఈ పుస్తకానికి ఉంది. క్రిష్టియన్ లాంబ్ స్వాత్‌లోయను సందర్శించి ఆ ప్రాంత చరిత్రను తెలుసుకుంది. మలాలా వంశానికి చెందిన మస్థూన్ జాతి గురించి అధ్యయనం చేసింది. ఈ పరిశ్రమ చేయడం వల్ల ఈ పుస్తకానికి మరింత జీవం వచ్చింది. ఈ పుస్తకంలోని అంశం ప్రాధాన్యతను గురించి ఎవరికీ చెప్పనక్కర్లేదు. మలాలా ఈ రోజున బాలికలు చదువుకునే హక్కుకోసం పోరాడుతున్న యువతి. ప్రపంచవ్యాప్తంగా అందరికీ తెలిసిన నోబుల్ బహుమతి గ్రహీత. బాలికల హక్కుల కార్యకర్త. ఈ స్ఫూర్తివంతమైన, ఉత్తేజకరమైన మలాలా పసి జీవితాన్ని అంతే స్థాయిలో ఈ పుస్తకం మనముందు ఉంచుతుంది. ఈ పుస్తకం అనువాదం అనిపించదు. తెలుగు పుస్తకం చదువుతున్నంత హాయిగా ఉంటుంది. ఈ పుస్తకానికి చక్కటి అనువాదం చేసిన కె. సత్యరంజన్‌కు, ప్రచురించిన 'ఐద్వా' వారికి అభినందనలు.

✦

జ్ఞాపకం

# లాల్‌సలాం ప్రభక్కా... లాల్‌సలాం...లాల్‌సలాం...

- దేవేంద్ర, ఎడిటర్ జనగానం

ప్రభావతి అక్క జెండా...జెండా...ఎర్ర జెండా - చమటోర్చే జీవులకు అండ... దండా అని పాడుతూ ఉంటే వినిపించే సంగతులు, గమకాలు భావస్ఫూర్తికమైన ఉచ్ఛరణ, శ్రావ్యత, మెలొడీ ఆమెతో కలిసి పని చేసిన మాలాంటి వారికి ఓ అద్భుతమైన అనుభవం.

ఇటీవల కాలంలో సిఐటియు నాయకులుగా కృషి చేస్తూ చనిపోయిన శ్రీహరిగారు ఆ పాటను ప్రశంసించేవారు. ప్రభావతి అక్క గొంతుకు ఉన్న ప్రత్యేకత హేతుబద్ధంగా వివరిస్తూ ఉంటే ఎంతో గర్వంగా అనిపించేది మాకు.

ప్రజానాట్యమండలి ఆధ్వర్యంలో మెట్టమెదటి సారిగా విజయవాడలో పునాది రాళ్ళు సినిమా సంగీత దర్శకులు 'ప్రేమ్‌జీ' గారి ఆధ్వర్యంలో 'సువార్తవాణి'లో 'డిక్సన్' గారు రికార్డు చేసిన మొదటి క్యాసెట్‌కు జీవం పోసిన అద్భుత గొంతు ప్రభావతి అక్కది.

" అమర వీరులారా...అరుణమూర్తులారా...

అందుకోండి మా జోహార్లు...అందుకోండి మా విప్లవ జోహార్లు..."

ప్రారంభ గీతం

"కొంగు నడుముకు చుట్టవే చెల్లెమ్మ...

కొడవళ్ళు చేపట్టవే చెల్లెమ్మ..."

అన్న మహిళా గీతం ఒకటేమిటీ? ఆ క్యాసెట్ మొత్తం మీద విజయవాడ కాశీనాథ్, సీనియర్ గాయకులు జగన్ పోటాపోటీగా పాడి అద్భుతంగా క్యాసెట్ రూపొందడంలోప్రభక్క నిర్వహించిన పాత్ర మరువలేనిది. నాలుగు దశాబ్దాలు గడిచినా ఇప్పటికీ డిక్సన్‌గారు ఆ క్యాసెట్‌ను మర్చిపోకుండా గుర్తు చేసుకోవడం విశేషం. ఆ తరువాత ఆమె పాట లేకుండా ఏ క్యాసెట్ లేదు. పదుల సంఖ్యలో గీతాలు ఆలపించింది. ప్రభక్క

80వ దశకంలో ఖమ్మంలో అఖిల భారత రైతు మహాసభల సందర్భంగా నేను రాసిన నదీమతల్లి నృత్య రూపకం, మహాసభల స్వాగత గీతం ఖమ్మంలోనే బాని చేయటం జరిగింది. హార్మోనిస్టు ఆంథోని, తబలిస్టు అప్పారావు, ఫ్లూటిస్టు ఆమోస్ వంటి సీనియర్ సంగీతకారుల సహకారంతో తయారైన అద్భుత రూపం అది. ప్రభావతి అక్క ఖమ్మం బేగం అద్భుతంగా జీవం పోశారు. నెల్లూరు, గుంటూరులలో జరిగిన యుటిఎఫ్ మహాసభలలో ప్రభక్క పాటలు ఉద్రూతలూగించాయి. భీమవరంలో రైతు మహాసభల కోసం నే రాసిన స్వాగతం గీతం ఇప్పటికీ రైతు సంఘం పతాక గీతంగా ప్రాచుర్యం పొందుతూనే ఉంది. ఆ పాట అంత బాగా రావడానికి రాజమండ్రి సురేష్, ప్రభక్క జగన్ చేసిన ఉమ్మడి కృషి ఎప్పటికీ మర్చిపోలేను.

విశాఖ ప్రజానాట్యమండలి మహాసభ తరువాత నెల్లూరులో చాలా పెద్ద ఎత్తున ప్రజానాట్యమండలి మహాసభ జరిగింది. ఆ మహాసభకు వెలుతూ రైల్లో

"కట్నం పేరిట మారణహెూమం



పుత్తడి బొమ్మ పూర్ణమ్మ బుర్రకథ దళంలో శేషారత్నం, ప్రభావతి, సబేరా

క్షణ క్షణం ఇల పెరిగిందా?"

అని నేను రాసిన గీతాన్ని మహాసభ జరుగుతున్న సందర్భంలోనే నెల్లూరులో వేపా నర్సింహారావుగారు రాగమాలికగా సమకూర్చితే మహాసభలో ప్రభక్క జగన్ అద్భుతంగా ఆలపించినప్పుడు హాలంతా కరతాళధ్వనులతో మారుమ్రోగిపోయిన క్షణాలను నేను ఎప్పటికీ మరిచిపోలేను. మంగళగిరిలో జరిగిన యువజన మహాసభ, విజయవాడలో .జరిగిన ప్రజానాట్యమండలి మహాసభ వేదికలమీద సీనియర్ గాయకురాలుగా తాను, తన తరువాత తరంలో వచ్చిన బేగం, లెనినా చౌదరి వంటి వారికి ఇచ్చిన శిక్షణ సంఘ నిర్మాణంలో ఎంతో ఉపయోగపడింది. సహజంగా కళాకారుల మధ్య ఈర్ష్య, ద్వేషాలు ఎక్కువ అంటారు. అక్కతో సహచర్యం చేసిన జూనియర్ గాయనీమణులు ఎవ్వరూ ముచ్చుకైనా ఎలాంటి ఆక్షేపణలు చేయలేని విశిష్ట వ్యక్తిత్వం ప్రభక్కది. అక్షరాస్యతా ఉద్యమం, సారా వ్యతిరేక ఉద్యమం ఇలా ఒకటేమిటి? తెలుగునాట సాగిన ప్రతి అభ్యుదయ పోరాట ప్రస్థానంలో అక్క తనదైన ప్రత్యేక శైలితో అటు నాయకురాలిగా, ఇటు గాయనీమణిగా విశేష సేవలు అందించింది.

తొలి తరం ప్రజానాట్యమండలి నాయకురాళ్ళు మానికొండ సూర్యావతి, మోటూరు ఉదయం, కొండపల్లి కోటేశ్వరమ్మ, వీరమాచనేని సరోజినిల తరువాత దశాబ్ధాలుగా స్థబ్ధుగా ఉన్న ప్రజానాట్యమండలిలో మహిళా నాయకురాలిగా, రాష్ట్ర ఆఫీసు బేరర్‌గా మళ్ళీ కీర్తి ప్రతిష్టలు తెచ్చిన మొదటి వ్యక్తి ప్రభావతిగారు.

రాత్రి, అపరాత్రి, దూరభారం, ఏదీ లెక్కచేయకుండా ఉద్యమ ప్రస్థానం చేసిన గొప్ప నాయకురాలు ప్రభావతిగారే. ప్రభక్క నుండి నేటి తరం నేర్చుకోవలసిన ఎన్నో విశిష్ట లక్షణాలు ఉన్నాయి. చిత్తశుద్ధి, శాస్త్రీయ అవగాహన, క్రమశిక్షణ, స్వయం సాధన, జూనియర్స్‌ను ప్రోత్సహించే పద్ధతి, వ్యక్తిగత కీర్తి ప్రతిష్టల కంటే సంఘ ప్రతిష్ట కోసం కృషిసల్పడం, ఏ కష్టనష్టాలకైనా, ఎలాంటి నిర్బంధాలకైనా వెరవని ధీరోధాత్తత, ఇవన్నీ మనం ఆమె నుండి నేర్చుకోవలసిన సుగుణాలు.

ఈ మధ్య ఒక సినిమాలో ఒక కవి వ్రాసినట్లు

"పుడుతూనే ఉయ్యాల...
పోతే నిను మొయ్యాల...
ఈలోపే ఏదో చెయ్యాల..."

అన్న పాట ఏదో ఐటం సాంగ్ మాత్రమే కాదు. పుట్టుక-చావు ఈ రెండూ మన ప్రమేయం లేకుండా జరిగిపోయే ప్రకృతి పరిణామాలు. పుట్టి, శాశ్వతంగా ప్రకృతిలో ఎవరూ నిలిచిపోరు. తన కోసం తాను బ్రతకడం తప్పుకాదు. పైగా అనివార్యం కూడా. అదే సమయంలో పదుగురి కోసం బ్రతికేవాడు ఎప్పుడూ చిరంజీవిగా ప్రజల నాలుకలపై నీరాజనాలు పొందుతూనే ఉంటారు. వారే కారణ జన్ములు మహానుభావులు.

ప్రభావతిగారి జీవితం నిస్సారంగా, నిర్జీవంగా, ఏ క్షణమూ లేదు. ఓ చైతన్య ప్రవాహంగా, ఓ ఉద్యమ కెరటంలా, కళాప్రభంజనంలా సాగిపోయింది. ఆమె పాట, ఆమె మాట, ఆమె నుండి పొందిన వాత్సల్యం, ఆప్యాయత, అనురాగాలు మాకు ఉద్యమంలో వచ్చే ఆటుపోట్లు నుండి ఎటువడితే అటు కొట్టుకుపోకుండా నిబద్ధత, పీడిత జన పక్షాన నికరంగా పోరాడే స్ఫూర్తిని మాకు ఇచ్చాయి. ఇంకా ఇస్తూనే ఉంటాయి.

లాల్‌సలాం ప్రభక్కా... లాల్‌సలాం...లాల్‌సలాం...

ఆరోగ్యం

# మెనోపాజ్ తరువాత బరువుపెరగడం ?

- డా॥ ఎం. రమాదేవి

ముట్లు ఆగిపోయిన తర్వాత శరీరంలోని ఫీమేల్ హార్మోన్ల పరిమాణం తగ్గుతుంది. అండాశయాల నుంచి ఈ హార్మోన్ల విడుదల ఆగిపోవడమే దీనికి కారణం. శరీరంలో ఈ హార్మోన్ల లేమి వల్ల అనేక మార్పులు వస్తాయి. వీటిలో ఒకటి శరీర బరువులో వచ్చే మార్పులు. ఇవి ఎలా అంటే శరీరం బరువు పూర్వం కంటే పెరిగే అవకాశం వుంటుంది. ఇది కేవలం హార్మోన్లు లోపించడం వల్ల కాకపోవచ్చు గానీ, ఈ దశకి చేరుకునేసరికి శరీరానికి చిన్నప్పటితో పోలిస్తే 20-25 శాతం క్యాలరీల అవసరం తగ్గుతుంది. కానీ శరీరం ఈ క్యాలరీలు స్వీకరించడానికి అలవాటు పడిపోయి వుండటం మూలాన, అదే విధంగా ఆహారం తీసుకుంటూ వుంటాం. ఫలితంగా ఈ అదనపు క్యాలరీలు కొవ్వురూపంలో శరీరంలో నిల్వ వుంటాయి. కొంతకాలం ఇలా కొనసాగితే శరీరం బరువు పెరుగుతుంది.

## పొట్ట చుట్టు కొలత పెరగడం

శరీరంలో వుండే కొవ్వు పదార్థం కూడా ఈస్ట్రోజన్ హార్మోను తగ్గడం వల్ల కొన్ని ప్రదేశాలలో తగ్గడం, కొన్ని చోట్ల పెరుగుతుంది. ఉదాహరణకు పొట్టచుట్టూ పెరగడం, నడుము చుట్టుకొలత పెరగడం, పిరుదుల దగ్గర ఫ్యాట్ చేరటం లాంటివి. పొట్టచుట్టు కొలత పెరగడం మంచి సంకేతం కాదు. దీనివల్ల బి.పి, షుగర్ లాంటివి అధికంగా వచ్చే అవకాశం వుంటుంది.

మెనోపాజ్ దశ చేరుకునేటప్పటికి స్త్రీలలో రెస్టింగ్ మెటబాలిక్ రేట్ (ఆర్.ఎమ్.ఆర్) తగ్గుతుంది. ఇది ఎంత ఎక్కువగా వుంటే అన్ని ఎక్కువ క్యాలరీలు వ్యయమవుతాయి. సులువైన భాషలో చెప్పాలంటే, ఈ వయసు వచ్చేసరికి, శరీరానికి చలనం తగ్గుతుంది. చిన్నవయసులో సొంతంగా చేసుకునే పనులెన్నిటినో, ఇతరులకు పురమాయించడానికి అలవాటుపడతాం. ఓపిక వుండదు. దీనివల్ల శరీరంలో క్యాలరీలు ఎక్కువగా నిల్వకాబడి ఫలితంగా బరువు పెరుగుతుంది.

## థైరాయిడ్ గ్రంథి

కొంతమంది స్త్రీలలో మధ్య వయసు వచ్చేసరికి ఫీమేల్ హార్మోన్ల మార్పుతోపాటు థైరాయిడ్ గ్రంథి పనితీరు కూడా మారుతుంది. అటువంటి వారిలో ఇంకా సులభంగా బరువు పెరుగుతుంది.

## ఎంత బరువు వుండాలి

ఒక వ్యక్తి బరువు ఎంత వుండాలి అన్నది వారి వారి వయసు, పొడవు, స్త్రీయా, పురుషుడా - ఇలాంటి అనేక విషయాల మీద ఆధారపడి వుంటుంది. మరి ఏ వ్యక్తికైనా శరీర బరువు వుండవలసిన దానికంటే ఎక్కువుందా, తక్కువుందా తెలుసుకోవడానికి, ఈ బరువు వల్ల ఏవైనా ప్రమాదకరమైన పరిస్థితికి దారితేసే అవకాశం వుందా? అనే విషయాలను కనుగొనడానికి సాధారణంగా వాడే పద్ధతిని బి.ఎమ్.ఐ, లేదా బాడీ మాస్ ఇండెక్స్ అంటారు.

## బరువు ఎక్కువైతే

శరీర బరువుతో పాటు నడుం దగ్గర, పొట్ట చుట్టు కొలత ఎక్కువైతే రోగగ్రస్తులయ్యే అవకాశం కొంత అధికమవుతుంది. శరీర బరువు అదుపు తప్పిన వారిలో భవిష్యత్తులో మధుమేహం, బి.పి. పెరగడం, రక్తంలో కొలెస్ట్రాల్, ఇతర కొవ్వు పదార్థాలు పెరగడం, గుండెపోటు, పక్షవాతం, కీళ్ళ నొప్పులు లాంటి వ్యాధులు వచ్చే అవకాశం ఎక్కువగా వుంటుంది.

## నివారణ కోసం తీసుకోవలసిన జాగ్రత్తలు

మెనోపాజ్ దశకి చేరినప్పుడు ముందుగానే నివారణ చర్యలు చేపట్టడం మంచిది. ఇందులో ముఖ్యమైన అంశం తక్కువ క్యాలరీలు వున్న ఆహారం తినడం, ఎక్కువ వ్యాయామం చేయడం. ఈ విషయాన్ని దృష్టిలో వుంచుకుని జీవనశైలిలో మార్పులు చేసుకోవాలి. ఆహారంలో కొవ్వుపదార్థాలు, తీపి పదార్థాలు తగ్గించుకుని ఆకుకూరలూ, కాయగూరలూ, పళ్ళు ఎక్కువగా తీసుకోవాలి. సక్రమంగా వ్యాయామం చేయాలి. కనీసం 30-45 ని॥లు వాకింగ్ చేయుటం లాంటివి అలవరచుకోవాలి.

# సామాజిక మార్పే మహిళలపై అత్యాచారాలను అంతమొందిస్తుంది

## చర్చా వేదికలో వెల్లడైన ప్రముఖుల ఆలోచనలు



అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం (ఐద్వా) ఆధ్వర్యంలో మాంటిస్సోరి మహిళా కళాశాల ఆడిటోరియంలో "మహిళలపై హింస, అత్యాచారాలను అరికట్టేదెలా?" అను అంశంపై చర్చా వేదిక జరిగింది. రచయిత డి. శమంతకమణి, చెన్నుపాటి, విద్య, డి. రమాదేవి నిర్వహణలో జరిగిన ఈ చర్చా కార్యక్రమాన్ని ప్రముఖ రచయిత ఓల్గా గారు ప్రారంభించారు. ఈ సమస్య గురించి మాట్లాడుకోవడం ఇదే ఆరంభమూ కాదు అంతంకాదు అంటూ సమాజంలోనూ, ప్రభుత్వ యంత్రాంగం లోనూ స్త్రీ పట్ల, స్త్రీల సమస్యలపట్ల చిన్న చూపు ఉన్నదని, మగపిల్లలే కావాలనుకునే భావజాలం వల్లనే ఆడపిల్లల నిష్పత్తి తగ్గిపోవడానికి కారణమవుతుందని అన్నారు. ఒక ఘటన జరిగినపుడు మాత్రమే ఫైట్ చేయడం కాదు మనం చేయవలసింది, పిల్లల పెంపకంలోనూ, పిల్లలకు అందిస్తున్న సిలబస్‌లోనూ మార్పు వచ్చినపుడు మాత్రమే సమాజంలో మార్పును తీసుకురాగలమని అన్నారు. స్త్రీలను గౌరవించే సీరియల్స్, సినిమాలు రావాలని, వాటి కోసం ప్రజలు తలపడాలని పిలుపునిచ్చారు.

వాసవ్య మహిళా మండలి అధినేత చెన్నుపాటి విద్య గారు మాట్లాడుతూ హిమబిందు కేసు విషయంలో పోలీసులు సరైన సాక్ష్యాలను కోర్టుకు ప్రొవైడ్‌చేయనందున నిర్దోషులని తీర్పు ఇవ్వడాన్ని తీవ్రంగా ఖండించారు. పోలీసు యంత్రాంగం చేయవలసిన పని చేయకపోవడంవల్ల ఇటువంటి ఘటనలు పునరావృతమయ్యే అవకాశం ఉందని, ఈ కేసు విషయంలో న్యాయం జరిగే వరకూ ఆ కుటుంబానికి అన్ని సంఘాలు, సమాజం వెన్ను దన్నుగా ఉండాల్సిన అవసరం ఉందని అన్నారు. మహిళలపై హింస సమస్య మహిళలది మాత్రమే కాదని ఇది సమాజం అంతటిదీ అని, దీనిపై హింసను వ్యతిరేకించే అందరూ విస్తృతంగా ప్రచారం చేయాలని కోరారు. ఎంఎల్‌సి బొడ్డు నాగేశ్వరరావు గారు మాట్లాడుతూ ప్రభుత్వం అనుసరిస్తున్న సరళీకరణ, ప్రైవేటీకరణ విధానాల వల్ల స్త్రీ విద్యకు ఆటంకం ఏర్పడుతుందని, ఉద్యోగాలు కూడా పరిమితం చేయబడుతున్నాయని, మహిళా ప్రజాప్రతినిధులు అవమానాలకు గురికాబడుతున్నారని, ఈ వైఖరులను మార్చుకోవాలని పేర్కొన్నారు.

సప్తగిరి గ్రామీణ బ్యాంక్ ఎంప్లాయిస్ యూనియన్ నాయకులు వెంకటేశ్వరరెడ్డి గారు మాట్లాడుతూ హిమబిందు కేసు విషయంలో పోలీసుల వైఫల్యం స్పష్టంగా ఉందని, స్త్రీలను విలాస వస్తువులుగా చూడడం వల్ల అత్యాచారాలు పెరుగుతున్నాయని ఆందోళన వ్యక్తం చేశారు. సమాజంలో మార్పు కోసం అందరూ కృషి చేయాలని, అందుకు తమ ఎంప్లాయిస్ యూనియన్ ముందుంటుంది పిలుపునిచ్చారు. మాంటిస్సోరి విద్యా సంస్థల అధినేత వి. కోటేశ్వరమ్మ గారు మాట్లాడుతూ కళాశాలల్లో, విశ్వవిద్యాలయాల్లో పిల్లల్లో సోదరభావం కలిగించే బాధ్యత ఉపాధ్యాయులపై ఉంది. ఇటువంటి వాతావరణంలో మాత్రమే ర్యాగింగ్‌ను అరికట్టే అవకాశం ఉంటుందని, బోధనా అంశాల్లో కూడా ఆడమగ సమానం అనేది చెబితే అది కొంత మార్పును తీసుకురాగలదని పేర్కొన్నారు.

అంకురం సినిమా డైరెక్టర్ సి. ఉమా మహేశ్వరరావు మాట్లాడుతూ సమాజంలో సినిమాల ప్రభావం చాలా ఎక్కువగా పనిచేస్తుందని, మహిళల స్వేచ్ఛ, నిర్ణయాధికారాలను సమాజం గుర్తించడంలేదని, వ్యక్తిగతంగా గ్రూపులుగా కాక అందరం కలిసి చేయడం ద్వారానే మార్పు సాధ్యమని, కొన్ని కేసులకు సంబంధించి సాక్ష్యాలను తీసుకు రాలేము అటువంటి సందర్భాలలో దొరికిన చిన్న క్లూను కూడా వదిలి పెట్టకుండా పోలీసు యంత్రాంగం పని చేసినపుడు మాత్రమే న్యాయం జరుగుతుందని అన్నారు. ఎం.బి. అధ్యయన కేంద్రం నిర్వాహకులు పి. మురళీ కృష్ణ గారు మాట్లాడుతూ రాజకీయ వ్యవస్థ స్వప్రయోజనాలతో కూడుకుని ఉందని, ఎంఆర్‌వో వనజాక్షి ఘటనలో అన్యాయాన్ని ఎదుర్కొన్నందుకు అభినందించాల్సిన

ఆమెను మందలించడం పక్షపాత వైఖరికి నిదర్శనమని, పోలీసు యంత్రాంగంలో సమూల మార్పులు రావలసినఅవసరం ఎంతైనా ఉందని అన్నారు. నాగార్జున యూనివర్సిటీ ప్రొఫెసర్ వి. జ్యోతి మాట్లాడుతూ రాజకీయ వ్యవస్థ కొన్ని లక్ష్యాలతో కూడుకుని ఉండాలని, ఆడపిల్లలకు సమాన అవకాశాలు కల్పిస్తామని మానిఫెస్టోలో కమిట్ అయినవారికే ఓటు వేయాలని పిలుపునిచ్చారు.

పాత సమాజంలోని అసమానతలు, నూతన ఆర్థిక విధానాల్లో స్త్రీ అంగడి సరుకుగా మారిన పరిస్థితులను అంతమొందించేందుకు చర్చల్లో పాల్గొన్న మిత్రుల సూచనల మేరకు వచ్చిన అభిప్రాయాలను ప్రభుత్వానికి తెలియ జేయాలని, ఆయా ఘటనలపై విస్తృత ప్రచారానికి ఒక వేదిక ఏర్పాటుకావాలని, ఆయా సంస్థలు, వ్యక్తులు తమ తమ రంగాలలో, ప్రాంతాలలో సమాన అవకాశాల కోసం ప్రయత్నాలు సాగించాలని ఐద్వా కార్యదర్శి డి. రమాదేవి ప్రకటించారు.

ఇంకా ఈ కార్యక్రమంలో శ్రామిక విద్యా పీఠ్ డైరెక్టర్ విద్యా ఖన్నా, రచయిత వేమూరి సత్యవతిగారు, వివిధ మహిళా సంఘాలు, యువజన, విద్యార్థి సంఘాల నాయకులు, నగర ప్రముఖులు పాల్గొన్నారు.

✦

కేస్ స్టడీ

# వాళ్లిద్దరికీ నచ్చజెప్పారు

- శాంతిశ్రీ

**భార్యభర్తలు ఒకరికొకరు తోడూనీడా. మరి నిజంగా ఆ బంధాలు అలాగే ఉంటున్నాయా? అలా ఉండాలనుకున్నా ఉండలేని పరిస్థితులూ మన చుట్టూ ఉన్నాయి. అన్నింటినీ అధిగమించి ఆ విధంగా ఉంటున్న భార్యాభర్తలు కొద్దిమంది మాత్రమే ఉంటున్నారు. యవ్వనంలో కాకుండా నడి వయస్సు వచ్చేసరికి ఈ తోడూ నీడా అత్యవసరం. మరి ఆ లేటు వయస్సులో కూడా ఇద్దరూ దూరం కావాలనుకుంటే? సమస్యే. పిల్లలు పెద్దవుతున్న క్రమంలో తల్లిదండ్రులు ఒకరికొకరుగా ఉండటం అవసరం. కానీ విడిపోవాల్సిందే అనుకుంటే అది బాధాకరం. అలా విడిపోవాలని 'ఐద్వా అదాలత్'కు వచ్చారు ఓ జంట. వాళ్ళకి ఆ పరిస్థితి ఎందుకు వచ్చింది? చివరికి ఏమైందో తెలుసుకోవాలంటే కేస్ స్టడీ చదవండి.**

ఆమెకు యాభై ఏళ్ళకు పైనే వయస్సు. తన మేనమామతో కలిసి ఐద్వా లీగల్‌సెల్‌కు వచ్చింది. తన సమస్య గురించి ఇలా వివరించింది.

"నన్ను ఇక్కడకు పశ్చిమగోదావరి జిల్లా ఐద్వా వారు ఇక్కడకు వెళ్లమన్నారు. నా పేరు తులసి. మావారి పేరు తిరుమలరావు. నేను ఎం.ఏ. చదువుకున్నా. మేము ముగ్గురు అక్కచెల్లెళ్లం. నాకు పెళ్ళి తర్వాత ఒకరోజు ఫిట్స్ వచ్చాయి. కానీ ఆయన నాకు మొదటి నుండి ఈ జబ్బు ఉందనీ, మేము ఆ విషయం దాచి పెళ్ళి చేశామని అంటారు. నన్ను 'మెంటల్' అంటూ నాకు పిల్లల్ని దూరం చేశారు. పనివాళ్ళ ముందే నన్ను చాలా చులకనగా మాట్లాడతారు. దాంతో వాళ్లకి నేను లోకువ అయిపోయాను. నేను ఇప్పుడు మా అమ్మ దగ్గర ఉంటున్నాను. నా పొలం, బంగారం అంతా ఆయన స్వాధీనంలోనే ఉన్నాయి. నాకు అవి ఇప్పిస్తే, నా బతుకు నేను బతుకుతాను. లేకపోతే భవిష్యత్తులో నాకు ఇబ్బంది కదా!" అని చెప్పింది.

బాధ్యులు తిరుమలరావుని కూడా ఆరోజే రమ్మని ఫోన్ చేయడంతో ఆయన కూడా వచ్చారు. ఆయన వైపు నుండి సమస్య ఏమిటో చెప్పమన్నారు. ఆయన మాట్లాడుతూ.. "ఆమెకు పెళ్ళి తర్వాత కాదు, పదిహేడేళ్ళ వయస్సులోనే ఆమెకు ఫిట్స్ వచ్చాయి. ఇదిగోండి డాక్టర్స్ రిపోర్టులు. అలా అబద్ధం చెప్పడం సరికాదు. అయిపోయిందేదో అయిపోయింది. కానీ ఇప్పుడు కూడా నోరు తెరిస్తే అబద్ధాలే చెబుతుంది. చిన్న చిన్న విషయాలకే ఈ విషయంలోనే ఆమె అంటే నాకు కోపం. పిల్లలకు రాకుండా ప్రెగ్నెంట్‌గా ఉన్నప్పుడే ఇంజెక్షన్ ఇస్తారు. పాపను కడుపుతో ఉన్నప్పుడు అలాగే ఇంజెక్షన్ చేయబట్టి. పాప మంచిగా పుట్టింది. బాబు పుట్టేప్పుడు కూడా ఇలాగే ఇంజెక్షన్ చేయాలి. అయితే నేను ఆ సమయంలో నా వ్యాపారం నిమిత్తం వేరే దేశంలో ఉన్నాను. ఆమె ఇంజెక్షన్ చేయించుకోలేదు. ఫలితంగా నా కొడుకు ఆటిజమ్‌తో పుట్టాడు. అమ్మాయి అమెరికాలో చదువుకుంటోంది. బాబుని ఆటిజమ్ వల్ల హైదరాబాద్‌లో ప్రత్యేక ఆసుపత్రిలో చేర్పించాం. ఇప్పుడు వాడికి అన్నీ చేయాలి. ఆ సమయంలో కూడా బాబుని ఎలా చూసుకోవాలో, ఏమి తినిపించాలో అన్నీ ఆమెకు తెలుసు. అయినా వాడు తినకూడనివే కొని పెడుతుంది.

ఆమెకు ఇంట్లో డబ్బులు అన్నీ అందుబాటులో ఉంచుతాను. ఇంట్లో పనివాళ్ళు ఉంటారు, అయినా ఏమీ పట్టించుకోదు. పిల్లల్ని, నన్నూ అసలే పట్టించుకోదు. మొన్న పాప అమెరికా వెళుతుంటే, ఆమెకు చూపించకుండా పంపడం ఎందుకని, తీసికెళ్లి చూపించి పంపాను. కనీసం పాప వెళ్లాక 'క్షేమంగా చేరావా?' అని ఒక్కమాట పాపను అడగలేదు. ఇదీ ఆమె వరుస. ఆమె నాకు ఏవిధంగా సపోర్టుగా ఉండదు. కేవలం డబ్బులు కావాలి అంతే. ఆమెను నేను ఎంత బాగా చూసుకున్నానో తననే అడగండి చెబుతుంది. ఇప్పుడు పొలం, బంగారం అనీ వచ్చిందంటే, ఇది ఆమె ఆలోచన కాదు. వాళ్ళమ్మ ఆమెను వదిలించుకోవడానికి చేసిన పని. నేను కోరుకున్నదే తనూ అడుగుతుంది. బంగారం ఆమెది ఆమెకు ఇచ్చేస్తాను. పొలం కాగితాలు ఎప్పుడో ఆమెకే ఇచ్చేశాను. వాళ్ళమ్మ దగ్గరే

ఉన్నాయి. నాకు ఆమెది ఒక్క పైసా కూడా అక్కర్లేదు. ఇక నుండి ఆమెకూ నాకూ ఎటువంటి సంబంధం లేదు. నాకు విడాకులు ఇప్పించేయండి! నా పిల్లల్ని నేనే చూసుకుంటాను" అన్నాడు.

బాధ్యులు తులసిని పిలిచి..'అమ్మా! మీరు కూడా ఆలోచించుకోండి. ఇప్పుడు మీ అమ్మ ఉన్నంతకాలం చూసుకుంటారు. తర్వాత మీ పరిస్థితి ఏమిటి? ఇప్పుడు కాకపోయినా, తర్వాత అయినా మీ పిల్లలతో మీరు ఉండాలి. ఆయన అన్నారని కాదుగానీ, మీరు కూడా మీ పాత్ర సరిగా నిర్వహించలేదు. అదే సమయంలో ఆయన కోపమో, మీరు చెప్పినట్లు చేయడం లేదనో తెలియదుగానీ, మీ పట్ల ఆయన చాలా విముఖత వ్యక్తం చేయడం బాధాకరం. మీరు ఇప్పటికైనా పిల్లలతో మాట్లాడుతూ, వాళ్ళ మంచిచెడ్డల్ని తెలుసుకోకపోతే, వాళ్ళ మనస్సుల్లో మీకు చోటు ఉండదు. మా సలహా అయితే అది. అది మీరు అర్థం చేసుకుంటే, మీ పరిస్థితి మరోలా ఉంటుంది. ఇప్పటికైనా పాపతో అప్పుడప్పుడు ఫోన్‌లో మాట్లాడండి" అని వివరంగా చెప్పారు.

"తిరుమలరావ్ గారూ! మీరు పెద్దవాళ్ళు. అలాగే ఎన్నోరకాలుగా ఇబ్బందుల్ని ఎదుర్కొంటున్నారు. మీరూ జీవితంలో చాలా నష్టపోయారు. మేము కాదనటం లేదు. కానీ ఆమెను మంచిగా మలుచుకోవడంలో మీరూ విఫలమయ్యారు. అలాగే మీరే పనివాళ్ళ ముందు ఆమెను 'మెంటల్' అని సంబోధిస్తే, వాళ్ళకీ ఆమె చులకనే. ఆమె స్వతహానే కొంత సమస్య ఉంది. ఇవి కూడా తోడవటంతో ఆమె డిప్రెషన్‌లోకి వెళ్లడం సాధారణంగా జరిగిపోతుంది. అందుకే మీరు కూడా ఆమె అడిగినవి ఇచ్చినా, భవిష్యత్తులో మీరూ, పాప ఆమెను చూసుకోవాలి. ఆమెతో పూర్తిగా తెంచుకోవాలనే ఆలోచన సరికాదు. ఎలాగో మీరు మరో వివాహం చేసుకునే పరిస్థితి లేదని అంటున్నారు. ఈ పరిస్థితిలో మీరు ఇప్పటికే ఎందరికో సాయం చేస్తున్నానని చెప్తున్నారు. ఆమె పట్లా అలాంటి దృక్పథంతోనే ఉండండి. మేము మిమ్మల్ని కోరేది అదే" అని చెప్పారు.

ఆమెకు ఆయన బంగారం, పొలం ఆమె బంధువుల సమక్షంలోనే ఇచ్చేస్తానన్నారు. ఆమె గురించి తర్వాత ఆలోచిస్తానని చెప్పారు.

ఆమె మాత్రం తనకు న్యాయం చేసినందుకు కృతజ్ఞతలు చెప్పి, ఇంటికి బయల్దేరారు.



చట్టాలు

# కుటుంబ హింసనుండి మహిళలకు రక్షణ చట్టం

– ఆర్. దుర్గా ప్రసన్న, అడ్వకేట్



మనుషులంతా ఒక్కటే, మానవులంతా ఒక్కటే. కానీ ధనిక, పేద, తెలుపు, నలుపు రంగుల్లో తేడా ఏమిటనీ చాలామంది ప్రశ్నిస్తుంటారు. కానీ స్త్రీలు పురుషులు అంటూ మనుషుల్లో భేదం చాలా ఎక్కువగా న్యాయం, అన్యాయం అంటూ విన్పిస్తూనే ఉంటుంది. ముఖ్యంగా కుటుంబ జీవనంలో స్త్రీలను బలహీనులుగా, సంపాదన లేనివారిగా చిత్రీకరించి వారిని వెనక్కి నెట్టి వారి హక్కులకు భంగం కలిగిస్తూ ఉండటం మనం చూస్తునే వున్నాం. స్త్రీ మూర్తి తల్లిగా, భార్యగా, కుమారిగా, కోడలిగా, సోదరిగా అనేక స్థానాల్లో ఉండి ఇతర కుటుంబ సభ్యులతో జీవిస్తూ ఇప్పుడు అనేక రూపాల్లో హింసను భరిస్తూ ఉండటం మనం గమనిస్తూనే ఉన్నాము. అటువంటి సందర్భంలో స్త్రీలు హింసను భరించకుండా ఉంటూ తమ హక్కులను సాధించుకోవడానికి ఉపకరించే చట్టమే The Protection of Women From Domestic Violence Act, 2005 కుటుంబ హింస నుండి మహిళలకు రక్షణ కల్పించే చట్టం దీన్నే వాడుకలో Domestic Violence Act గా అందరికీ పరిచయం. నిజానికి స్త్రీ పై జరిగే హింస మానవహక్కులను కాలరాయడమే అయినప్పటికీ ప్రపంచవ్యాప్తంగా స్త్రీలను హింసనుండి కాపాడడానికి అనేక ప్రయత్నాలు ప్రపంచ వ్యాప్తంగా జరుగుతూనే ఉన్నాయి. అందులో భాగంగా 1994 నుండి కుటుంబ హింసనుండి మనదేశంలో మహిళలకు ఒక చట్టం ఉంది. అది పటిష్టంగా అమలు జరగాలని భావించారు. కానీ అనేకమైన ఆటంకాలను, అవాంతరాలనూ ఎదుర్కొని 2005వ సంవత్సరంలో ఈ చట్టం ఆమోదించడం జరిగింది. 2006వ సంవత్సరం నుండి భారతదేశంలో అమలులోకి వచ్చింది. ఈ చట్టం (సివిల్ ప్రొసీజర్ కోడ్ వర్తిస్తుంది) కోర్టు పరిధిలో విచారించబడుతుంది.

పటిష్టమైన కుటుంబ జీవితం, కుటుంబ విలువలు అని గట్టిగా చెప్పుకునే భారతదేశంలో కుటుంబ వ్యవస్థలో స్త్రీలకు ఆ కుటుంబ హింస నుండి రక్షణ కల్పించే చట్టం అమలులోకి రావడం మంచి స్వాగతించదగ్గ పరిణామం.

అనేక కుటుంబాల్లో స్త్రీలకు స్వేచ్ఛలేదు, వారి మాటకు

విలువలేదు. అనేకమైన ఆంక్షలు, ఆటంకాల మధ్య వారి బాల్యం, విద్యాభ్యాసం, వివాహ జీవితం గడిచిపోతూ ఉంది. పుట్టింట్లో ఉన్నా, అత్తవారింటికి వెళ్ళినా వారి యొక్క కష్టాలు, బాధలు మౌనంగా భరించి సహనశీలిగా పేరు తెచ్చుకో మంటారేగానీ ఆ కష్టాలకూ, కన్నీళ్ళకూ కారకులైన పురుష కుటుంబ సభ్యులకు దండనగానీ, మందలింపుగానీ ఉండవు. ఇటువంటి నేపధ్యంలో కుటుంబ హింసని ప్రభుత్వం నేరంగా గుర్తించి, నేరస్తులకు శిక్షవిధించి బాధిత స్త్రీలకు ఉపశమనం కల్పిస్తుంది. ఈ చట్టం ద్వారా మహిళలు, పిల్లలు (మగపిల్లలయితే 18 స॥లోపు వారు) లబ్దిదారులు.

## ఈ చట్టం క్రింద కుటుంబ హింస అంటే

1. శారీరకహింస, ప్రాణహాని తలపెట్టడం (కొట్టడం, తిట్టడం) లాంటి చర్యలన్నీ కూడా శారీరక హింసగా పరిగణించబడతాయి.
2. లైంగిక హింస అంటే భార్య/ఆమె ఇష్టానికి వ్యతిరేకంగా సంభోగానికి ప్రయత్నించడం, బలవంతపెట్టడం అంతేగాక ఆమె గౌరవానికి భంగం కలిగించే పనులన్నీ లైంగిక హింసగా పరిగణించబడతాయి.
3. మాటలు భావోద్రేక హింస లేదా మానసిక హింస అంటే అవమానకరంగా మాట్లాడటం, హేళన పూరిత వ్యాఖ్యలు, పిల్లలు పుట్టలేదని, ఆడపిల్ల పుట్టిందని బాధించడం, ఆమె తరపువారిని, ఆమెకిష్టమైన వారిని తిట్టడం, వారిని శారీరకంగా హింసిస్తానని బెదిరించడం- ఇలా ఆమె మనసును గాయపరిచే ఏ మాట అయినా మానసిక హింస క్రిందకు వస్తుంది.
4. ఆర్ధిక హింస అంటే కుటుంబ నిర్వహణకు అవసరమైన డబ్బు భార్యకు ఇవ్వకపోవడం, చట్టప్రకారం హక్కుగా పొందిన ఆమె ఆస్థిపాస్తుల మీద ఆమెకి హక్కులేకుండా చెయ్యడం, ఇంటి అద్దె చెల్లించకపోవడం, ఆమె ఆదాయాన్ని లాక్కోవడం, ఆదనపు కట్నం తెమ్మని వేధించడం లాంటి వేధింపులన్నీ కూడా నేరమే. ఇటువంటి హింసలన్నీ కూడా భర్తే కాక ఇతర కుటుంబ సభ్యుల నుండీ ఎదురైనా కూడా వారు కూడా నేరస్థులు లేదా నేరంలో భాగస్వాములుగా పరిగణించబడతారు.

**అనేక కుటుంబాల్లో స్త్రీలకు స్వేచ్ఛలేదు, వారి మాటకు విలువలేదు. అనేకమైన ఆంక్షలు, ఆటంకాల మధ్య వారి బాల్యం, విద్యాభ్యాసం, వివాహ జీవితం గడిచిపోతూ ఉంది. పుట్టింట్లో ఉన్నా, అత్తవారింటికి వెళ్ళినా వారి యొక్క కష్టాలు, బాధలు మౌనంగా భరించి సహనశీలిగా పేరు తెచ్చుకో మంటారేగానీ ఆ కష్టాలకూ, కన్నీళ్ళకూ కారకులైన పురుష కుటుంబ సభ్యులకు దండనగానీ, మందలింపుగానీ ఉండవు. ఇటువంటి నేపధ్యంలో కుటుంబ హింసని ప్రభుత్వం నేరంగా గుర్తించి, నేరస్తులకు శిక్షవిధించి బాధిత స్త్రీలకు ఉపశమనం కల్పిస్తుంది. ఈ చట్టం ద్వారా మహిళలు, పిల్లలు (మగపిల్లలయితే 18 స॥లోపు వారు) లబ్దిదారులు.**

ఈ చట్టం ప్రకారం బాధిత మహిళలు కోర్టుకి వెళ్ళడానికి ఏమాత్రం సంకోచపడకుండా బాధిత స్త్రీలకు రక్షణ కల్పించడానికి, ఫిర్యాదు చేయడానికి ఈ చట్టం రక్షణ అధికారులను నియమిస్తూ ఉత్తర్వులు చేయడం జరిగింది.

- అంటే ఒక వ్యక్తి కుటుంబ హింస జరుగుతుందని కానీ లేదా జరిగే అవకాశం ఉందని గానీ తగిన విశ్వసనీయ కారణాలు సమాచారంతో రక్షణాధికారిని కలిసి సమాచారం ఇవ్వవచ్చును. Sec.4, Sec.1 క్రింద సమాచారమిచ్చే ఏ వ్యక్తిపైన సివిల్ లేదా క్రిమినల్ పరమైన బాధ్యతలు వేధింపులు ఉండవు.

- కుటుంబ హింస గురించి ఫిర్యాదు అందుకున్నప్పుడు పోలీసు అధికారి, రక్షణాధికారి, సేవలందించే వారు బాధితురాలికి అవసరమైన అన్ని న్యాయపరమైన, చట్టపరమైన విషయాలపై అవగాహన కల్పించాలి. అవేమిటంటే లీగల్ సర్వీసెస్ ఆథారిటీ క్రింద ఆమెకు ఉచితన్యాయ సేవలు అందుతాయని, అవసరమైతే ఐ.పి.సి లోని సెక్షన్ 498 ఎ క్రింద ఆమెకు ఫిర్యాదు చేసుకునే హక్కు ఉందని, రక్షణాధికారుల సేవల గురించి వివరించడమేకాక ఈ చట్టం ద్వారా రక్షణ ఉత్తర్వులు, ఆర్ధిక ఉపశమనం (మనోవర్తి వగైరా) కోసం ఉత్తర్వులు, పిల్లల కస్టడీ ఉత్తర్వు, ఇంటిలో ఉండేందుకు ఉత్తర్వులు, పరిహారం ఉత్తర్వులు వీటిలో ఒకటిగానీ, ఒకటికంటే ఎక్కువ ఉత్తర్వులనుగానీ పొందవచ్చును. అంతేకాక ప్రతివాదితో కలిసి ఉన్న ఇంటిలో నివసించే హక్కును కూడా పొందవచ్చును.

- బాధితురాలికి ఆశ్రయం కావాలని కోరుతూ ఒక బాధితురాలు లేదా ఆమె తరపున రక్షణాధికారి లేదా సేవలందించేవారు షెల్టర్ హోం ఇన్‌చార్జీకి దరఖాస్తు చేస్తే, ఇన్‌చార్జీ విధిగా బాధితురాలికి వైద్యసేవలుకూడ అందించాలి.

సెక్షన్ : 29 ప్రకారం ఇతర కేసులలాగానే మెజిస్ట్రేట్ కోర్టులో వెలువడిన ఉత్తర్వులపై, ఉత్తర్వులు అందిన 30 రోజుల్లోగా సెషన్స్ కోర్టులో అప్పీలు దాఖలు చేసుకోవచ్చును.

ఏది ఏమైన కుటుంబసభ్యుల మధ్య సహకారం, సహజీవనం అనివార్యం అయినపుడు పరస్పరం, ప్రేమ, అప్యాయతలతో మెలిగినపుడు గౌరవం, అభిమానం ఇచ్చి పుచ్చుకున్నపుడే ఆరోగ్యకరమైన ఆనందకరమైన వాతావరణం నెలకొంటుంది. చట్టాన్ని ఆశ్రయించే వారి సంఖ్య తగ్గుతుంది. ✦

తీర్మానం

# డ్వాక్రా ఋణమాఫీ వాగ్దానం వెంటనే అమలు చేయాలి

## తీర్మానం




ఒకవైపు పెరిగిన ధరలు, మరొకవైపు భర్త తెచ్చిన ఆదాయం మద్యానికి పోవడం, ఇంకొక వైపు వడ్డీలకు అప్పులు తెచ్చి బ్యాంకుకు అప్పులు కట్టడం, కుటుంబాన్ని పోషించాల్సిన బాధ్యత కూడా మహిళపైనే పడడం పెనంమీంచి పొయ్యిలోకి పడినట్లు అయింది. అభయహస్తంలో కనీసం వెయ్యి రూపాయలు ఇవ్వాలని మహిళల నుండి డిమాండ్ వస్తోంది. సామాజికంగా, ఆర్థికంగా భద్రత లేని నేటి పరిస్థితిలో కేవలం ఋణమాఫీ సమస్యతోపాటు స్త్రీలపై హింస రోజురోజుకు తీవ్రతరం అవుతోంది. హింస పెరగడానికి కారణమైన మద్యాన్ని ప్రభుత్వం ఆదాయ వనరుగా చూస్తోంది. మద్యం నియంత్రణ కొరకు డ్వాక్రా మహిళలు డిమాండ్ చేస్తున్నారు.

రాష్ట్రంలో 8 లక్షల గ్రూపులలో 84 లక్షల మంది మహిళలు సభ్యులుగా వున్నారు. రాష్ట్ర వ్యాప్తంగా గ్రామీణ ప్రాంతాల్లో 62,94,730 మందిని, పట్టణ ప్రాంతాల్లో 11,72,050 మందిని గుర్తించి ఈ పథకాన్ని వర్తింపచేయాలని ప్రభుత్వం నిర్ణయం తీసుకుంది. 64 లక్షల మందికి మాత్రమే ఋణమాఫీ వర్తిస్తుంది. మిగతా 15 లక్షల మందికి మొండిచేయి చూపిస్తుంది. ఋణమాఫీకి 7,400 కోట్లు అవసరం కాగా కేవలం 2,660 కోట్లు మాత్రమే కేటాయించారు. దీనిని బట్టే ఋణమాఫీ ఏ పద్ధతిలో అమలవుతుందో అర్థమౌతుంది.

గత ప్రభుత్వం పావలా వడ్డీ అని, వడ్డీలేని ఋణాలని ఇప్పుడు ఋణమాఫీ అని మహిళలను ఓటు బ్యాంకుగా చూస్తూ తన పబ్బం గడుపుకుంటోంది. ఈ అసంతృప్తి నుండి ప్రక్కదారి మళ్ళించడం కోసం మహిళలను ఇసుక క్వారీలు, సంక్షేమ పథకాలు డ్వాక్రా మహిళలకే వర్తింపజేస్తామని ఆర్భాటంగా ప్రచారం చేసుకుంటుంది. పేరుకు మాత్రమే ఇసుక రీచ్‌లు డ్వాక్రా గ్రూపుల పేరుతో ఉన్నాయి. ఇసుక సిండికేట్లుగా ఏర్పడి అక్రమ ఇసుక రవాణా జరుగుతోంది. నికర లాభాల్లో 25% వాటా డ్వాక్రా గ్రూపులకు ఇవ్వాలని జివోలో ఉన్నా కూడా ఆచరణలో అమలు జరగటంలేదు. 25% వాటాకావాలని పట్టుబట్టిన చోట దాడులకు పాల్పడుతున్నారు. (ఉదా: కోరుమల్లి ఘటన) గ్రూపుకు లక్ష రూపాయల ఋణమాఫీ చేస్తామని చెప్పి చివరకు గ్రూపుకు 30 వేలు చొప్పున 3 దఫాలుగా వేస్తానని అవి కార్పస్ నిధి (మూలనిధి)గా వాడుకోవాలని వ్యాపారాలు చేసుకుని అభివృద్ధి కావాలని చెబుతున్నారు. ఒకే గ్రూపులో కొంతమందికి రాలేదు. ఋణ మాఫీ ప్రకటనలతో ఎస్సీ, ఎస్టీ గ్రూపులు ఎక్కువగా డిఫాల్ట్ అయ్యాయి. కార్పొరేట్ సంస్థలకు లక్షల కోట్ల రూపాయలు రాయితీలు ఇస్తారు గానీ, డ్వాక్రా మహిళలు కష్టపడి కడుపుకట్టుకొని పొదుపు చేసే సొమ్ముకు మాత్రం ఋణమాఫీ ఇవ్వరు. బ్యాంకులు గ్రూపులు పొదుపు చేసుకున్న మొత్తాన్ని వారి అవసరాలకు తీసుకోన్వికుండా అడ్డుకుంటున్నాయి.

డ్వాక్రా గ్రూపులు స్వతంత్రంగా పనిచేసేందుకు కావల్సిన. యంత్రాంగాన్ని ఏర్పాటు చేయాలి. రాజకీయజోక్యం ఉండ కూడదు. డ్వాక్రా మహిళలకు ఎన్నికల ముందు ఇచ్చిన హామీ ప్రకారం ఋణమాఫీ వర్తించేటట్లు చూడాలని సదస్సు తీర్మానించింది.

**డిమాండ్స్ :**

1. వాగ్దానం ఇచ్చిన మేరకు ఆధార్‌లింక్‌తో నిమిత్తం లేకుండా ప్రతిగ్రూపుకు లక్ష రూపాయల ఋణమాఫీ అమలు చేయాలి.
2. ప్రస్తుతం జమ చేస్తున్న రూ.3,000/-లు పెట్టుబడి నిధిగా గాక ఋణమాఫీ ఖాతాకు జమచేయాలి.
3. అభయహస్తం పథకంలో ఉన్న సభ్యులకు రూ.500/-లు అదనంగా పెన్షన్ వాగ్దానం మేరకు అమలు చేయాలి.
4. స్కాలర్‌షిప్‌ల క్రింద అర్హత ఉన్నవారికి చెల్లించాల్సిన నిధులను తక్షణం రిలీజ్ చేయాలి.
5. పొదుపు డబ్బు వినియోగంపై బ్యాంకు ఆంక్షలు ఎత్తివేయాలి. బలవంతంగా డిపాజిట్లు, ఇన్సూరెన్స్‌లు కట్టించరాదు.
6. డ్వాక్రా గ్రూపులకు ఇసుక క్వారీలలో వచ్చే ఆదాయంలో 25 శాతం ఇస్తామన్న జి.ఓ. 93 ప్రకారం ఇసుక డబ్బును డ్వాక్రా గ్రూపులకు రిలీజ్ చేయాలి. డ్వాక్రా గ్రూపులపై దాడులు చేస్తున్న ఇసుక మాఫియా, పోలీసులపై చర్యలు తీసుకోవాలి.
7. పొదుపుకు ఆటంకంగాను, కుటుంబంలో వేధింపులకు కారణంగాను ఉన్న నూతన మద్యం విధానాన్ని ఉపసంహరించాలి.
8. ఎస్సీ, ఎస్టీ గ్రూపులకు ఋణమాఫీ వాగ్దానంతో పెద్ద ఎత్తున డిఫాల్ట్ అయ్యాయి. ఆ గ్రూపులకు ప్రభుత్వమే సంపూర్ణంగా ఋణాలు చెల్లించాలి.
9. కాల పరిమితి ఎత్తివేసి 10 లక్షల వరకూ డ్వాక్రా గ్రూపులకివ్వాలి.

✦

మీడియా

# భజరంగి భాయ్‌జాన్

- కె. సమత

హిందూ, ముస్లిమ్ మత కల్లోలాలకు స్పందనగా అనేక చిత్రాలు వచ్చాయి. "హిందూ ముస్లిమ్ భాయి భాయి" అంటూ ప్రేక్షకుల హృదయాల్ని కదిలించి, సోదర భావం క్షణ కాలం ఉప్పొంగేలా చెయ్యగల శక్తి సినిమాకే ఉంది. ఆనాటి కబీర్ నుండి ఈనాటి గాంధీవరకు ఎంత మంది ఎన్ని రకాలుగా చెప్పినా ఏ విధంగా చెప్పినా సందేశం ఒక్కటే. అన్ని మతాలలోనూ సారం ఒక్కటే. కబీర్, గాంధీ మేధస్సుతో, అనుభవాలతో చెప్పిన మాటలు కేవలం ఒక సెక్షన్ వరకే పరిమితమయ్యాయి. ఉన్నత చదువుల్లో ఉన్నవారికి, చరిత్రపై అభిమానం, సామాజిక స్పృహ కలిగినవారికి తప్ప సగటు మనిషికి గాంధీ, అంబేద్కర్, టాగూర్ ఏం చెప్పారో తెలుసుకోవలసిన అవసరం లేదు. రోజు గడవాలంటే చేతిలో పని, కడుపు నిండా తిండి, కంటి నిండా నిద్ర ఉంటే చాలు. ఈరోజు కంటే రేపు ఇంకా బాగా బతకాలనే ఒక ఆశ, అంతా మంచే జరుగుతుందనే ఒక నమ్మకం, ఆ నమ్మకానికి ప్రతిరూపం దేవుడు. దైవత్వాన్ని, జీవన శైలిని కలుపుతూ మనిషి ప్రవర్తనను అదుపు చేసేదే మతం. మతం మనిషిని దైవ మార్గంలో ఎలా నడవాలో చెబితే, మనిషి తాను నడిచే మార్గమే ఉన్నతమైనదని ఆచరిస్తాడు. నేను నమ్మిన వాడే దేవుడు, నేను ఆచరించేదే దివ్య మార్గం అనే నమ్మకం దాదాపు ఆస్తికులందరిలోనూ కనిపించే లక్షణం. నా మతం గొప్ప అంటే నాది గొప్ప అనే పోటీతత్వంలో సోదర భావం కొట్టుకుపోతుంది. దానివల్ల మతాల మధ్య దూరం, శత్రుత్వం పెరుగుతోంది. ఈ మతాల మధ్య వైరం ఈనాటిది కాకపోయినా మారుతున్న కాలాన్ని బట్టి ఎప్పటికప్పుడు తీవ్రంగా ముందుకొస్తోంది. స్వాతంత్ర్యం వచ్చిన నాటి నుండి ఇండియా-పాకిస్తాన్‌ల మధ్య పెరుగుతూ వచ్చిన అంతరం ఇందుకు ఒక నిదర్శనం. భజరంగి భాయ్‌జాన్ చిత్రం ఇండో పాక్ సంబంధాలను, ఇరు దేశాలకూ ఒకరంటే ఒకరికి ఉన్న స్టీరియో టైప్ హిస్టీరియాను టచ్ చేస్తూ హిందూ ముస్లిమ్‌ల మధ్య ఉండాల్సిన సోదరభావాన్ని హైలైట్ చేస్తుంది.

భజరంగి భాయ్‌జాన్ సినిమాలో సల్మాన్ ఖాన్ నటించిన భజరంగి పాత్ర ఒక సనాతన హిందువును రిప్రజంట్ చేస్తే షహీదా పాత్రలో నటించిన చిన్న పిల్ల ఇండియాలో ముస్లిమ్ మైనారిటీల పరిస్థితిని రిప్రజంట్ చేస్తుంది. కథ విషయానికి వస్తే ఏడేళ్ళ ప్రాయంలో ఉన్న పాకిస్తానీ షహీదాకు మాటలు రావు. తన తల్లి ఆమెకు ఎలా అయినా మాటలు వచ్చేలా చేయాలని ట్రీట్‌మెంట్ కోసం ఇండియన్ వీసా తీసుకుని ఢిల్లీకి బయలుదేరుతుంది. తిరిగి పాకిస్తాన్ వెళ్తుండగా సిగ్నల్ పడి రైలు ఆగుతుంది. పక్కన గోతిలో పడిపోయిన మేక పిల్లను కాపాడడానికి షహీదా ట్రెయిన్ దిగుతుంది. ఇంతలో ఆ ట్రెయిన్ వెళ్లిపోతుంది. అది గమనించని వాళ్ళ అమ్మ ఇండియా బోర్డర్ దాటిన తర్వాత తన కూతురు ఎక్కడ అని వెతుకుతుంది. ఎంత వెతికినా కనిపించకపోయేసరికి కుమిలిపోతుంది. సరిహద్దులో రక్షణ దళం వాళ్ళను బ్రతిమాలి ఒక్కసారి తనను ఇండియా పంపమని, బోర్డర్ గేట్స్ తీయమని ప్రాధేయపడుతుంది. కానీ దానికి మళ్ళీ వీసా తీసుకోవాలని, గేట్లు తీయడం కుదరదని చెబుతారు. తప్పిపోయిన షహీదా భజరంగి వద్దకు చేరుతుంది. మాటలు రాని షహీదా కూడా తన లాగా బ్రాహ్మిణ్ అనుకుని తనను చేరదీస్తాడు. మాంసాహారం తినాలని ఆమె కోరిక. మసీదు కనపడగానే ప్రార్ధన చేయడం చూసి తను ముస్లిమ్ అని తెలుసుకుంటాడు. ఇండియా, పాకిస్తాన్ క్రికెట్ మ్యాచ్ వచ్చినపుడు పాకిస్తాన్ జెండాని టివి దగ్గరకు వెళ్ళి ముద్దు పెట్టుకోవడం, చప్పట్లు కొట్టడం చూసి తనొక పాకిస్తాని అని తెలుసుకుని పాస్‌పోర్ట్, వీసా లేని, సరిగ్గా చదువుకోని, ఒక సనాతన హిందూ భజరంగి ఆ పసిపాపని ఎలా తన తల్లి వద్దకు చేర్చాడు అనేదే ఈ సినిమా కథ. తను గీసుకున్న గీత దాటి చూస్తే ఎలా ఉంటుందో ఇండియన్ భజరంగి పాక్ బాయ్‌జాన్‌గా ఇరు దేశాల ప్రజల మద్దతు పొందినపుడు అర్ధమవుతుంది. షహీదా, భజరంగి మధ్య ఏర్పడిన బంధం సెంటిమెంట్‌ని పండించింది.

ఈ సినిమాలో స్టార్ ఎవరంటే షహీదాగా నటించిన హర్షాలి మల్హోత్రా అనే చెప్పుకోవాలి. పెద్ద స్టార్‌డమ్ ఉన్న సల్మాన్‌ఖాన్‌ని డామినేట్ చేసింది తన నటన. తన అమాయకమైన నవ్వు, తను ఏడ్చినపుడు ముక్కు ఎర్రపడడం, మూగ అమ్మాయి పాత్రలో ఒక్క డైలాగ్ కూడా లేకుండానే ప్రేక్షకుల హృదయాల్ని కదిలించేసింది హర్షాలి. సినిమా షూటింగ్ జరిగినపుడు తనకు సరిగ్గా ఆరేళ్ళ ప్రాయం. కానీ నటనలో చాలా ఏళ్ళుగా అనుభవం ఉన్న నటిగా చేసింది. ఎన్నో ప్రశంసల్ని అందుకుంది. రాబోయే కాలంలో బాలనటిగా మరిన్ని అవార్డులు అందుకుని, మంచి పేరు సంపాదించుకుంటుందనడంలో ఎలాంటి సందేహమూ లేదు. భజరంగి భాయ్‌జాన్ ఫేమ్ తో హర్షాలి సోషల్ నెట్‌వర్కింగ్ సైట్స్‌లో విశేష ప్రాచుర్యం పొందింది. ఆమె నటన గురించి పొగుడుతూ అనేక పోస్ట్‌లు, ట్వీట్స్ వచ్చాయి.

కరీనా కపూర్ నటించిన పాత్ర ఈ సినిమాలో ప్రత్యేకమైనది. భజరంగి నిజాయితీ చూసి ఇష్టపడ్డ ప్రియురాలు కరీనా. తన తండ్రిలోనూ, భజరంగిలోనూ ఉన్న సనాతనవాదానికి భిన్నంగా ఆలోచించే ఒక ఇండిపెండెంట్ అమ్మాయి. పెద్ద వయసులో ఉన్న తన తండ్రి ఆలోచనలను మాత్రం మార్చగలను అని ముస్లింలపై భజరంగికి ఉన్న స్టీరియోటైపు హిస్టీరియాను తన మాటల ద్వారా మారుస్తుంది. మొత్తం మీద రంజాన్ రోజు రిలీజ్ అయిన "భజరంగి భాయ్‌జాన్" ఇండియాలోనే కాక పాకిస్తాన్‌లోనూ భారీ కలెక్షన్స్ సాధించింది.

✦

# తెలంగాణ రాష్ట్రంలో మద్యంపై ఐద్వా సమరం

## బస్సు యాత్ర...




తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం ప్రవేశపెట్టిన చీప్‌లిక్కర్‌పై ఐద్వా రగిల్చిన ఉద్యమం అగ్ని మండింది తెలంగాణాలోని పది జిల్లాలు మండల కేంద్రాలను బస్సుయాత్ర చుట్టేసింది. ప్రారంభసభలో బాలల హక్కుల నేత శాంతసిన్హా బస్‌యాత్రను ప్రారంబిస్తూ జరిగిన సభలో మాట్లాడుతూ మధ్యం వల్ల సమాజం చిన్నా బిన్నం అవుతుందన్నారు. మహిళల సంసారాలను గుల్లచేస్తున్న మహమ్మరి,తో ప్రభుత్వం ఖజానా నింపుకోవడం ఏమిటని ప్రశ్నించారు. మహిళలు జీవించే హక్కును సైతం కోల్పోతున్నారని ఆవేదన వ్యక్తం చేశారు. చీప్‌లిక్కర్‌వల్ల తాగుడుకు ఎక్కువగా బానిసలై మద్యం మరణాలు పెరిగే ప్రమాదం ఉందన్నారు. ఐద్వా నిర్వహించే బస్‌యాత్రకు తమ సంపూర్ణ మద్దతు తెలియజేశారు. ఐద్వా ప్యాట్రన్ తెలంగాణ సాయుద పోరాటయోదులు మల్లు స్వరాజ్యం మాట్లాడుతూ మద్యాన్ని ప్రజలకు తాగించి సంసారాలు కూలగొట్టే ఈ రాష్ట్ర ప్రభుత్వం ఖజానానింపుకోవాలా, వారికి మరో మార్గం దొరకలేదా అన్నారు. నాటి తెలంగాణ సాయుధపోరాట కాలంలో ఇలాంటి మధ్య విధానాలు లేవన్నారు. నేడు మధ్యం ఏరులైపారితే నాటి నిజాంకు పట్టిన గతే పడుతుందన్నారు.

బాలల హక్కుల నేత శాంతసిన్హా, మల్లుస్వరాజ్యంగార్లు జెండా ఊపి బస్సు జాతా ప్రారంభించారు. వరంగల్ జిల్లా హన్మకొండ అంబేద్కర్ సెంటర్‌లో ప్రొ॥ కాత్యాయిని విధ్మహే ముఖ్యఅతిదిగా పాల్గొని మాట్లాడుతూ మధ్యంపాలసీపై ఇంకా ఎవ్వరు ఉద్యమం లేవనెత్తుతారని ఆలోచించాం ఐద్వా బస్‌యాత్ర ప్రారంభానికి మేదావులంతా పూర్తిగా సపోర్టు చేస్తామన్నారు లిక్కర్‌వల్ల జరిగే నష్టాలు అంతా ఇంతా కావని ఇది వెనక్కి తీసుకునేంత వరకు మా వంతుగా పోరాడుతామన్నారు.

గంగదేవిపల్లి ఉప సర్పంచ్ కూసం రాజమౌళి, మాజి సర్పంచ్ కూసం పుష్పగార్లు బస్సుజాతాను స్వాగతించి మాట్లాడుతూ ఐద్వా ఛీవ్‌లిక్కర్‌పై తీసుకున్న ఉద్యమం సమాజానికి ఎంతో ఉపయోగపడుతుందని జాతా నాయకత్వానికి అభినందనలు తెలియజేసారు. గంగదేవిపల్లి ఈ రాష్ట్రంలోనే ఆదర్శవంతమైన గ్రామంగా ఎంపిక కావడానికి వామపక్ష పార్టీ అయిన సిపియం పార్టీ అండదండలతో గ్రామంలోని ప్రజానీకాన్ని చైతన్య పర్చి 30 అభివృద్ధి కమిటీలు వేసి ప్రజల భాగస్వామ్యంతో గంగదేవిపల్లిని ఒక ఆదర్శవంతమైన గ్రామంగా తీర్చిదిద్దుకోవడం జరిగిందన్నారు. ఇక్కడ ఇంటింట మంచీనీరు,మరుగుదొడ్లు, రేషన్‌కార్డులు, వృద్ధాప్య, వితంతు పెన్షన్ల క్రై, మహిళా రక్షణకు, మద్య నిషేదంకు ప్రత్యేక కమిటీలను వేసి అమలుచేస్తున్నామన్నారు.

మొత్తం 10జిల్లాలు, 44 నియోజకవర్గాల్లో బహిరంగ సభలు జరిగాయి. మరొక 42 మండల, గ్రామ లెవల్ మీటింగ్స్ జరిగినవి. ప్రతిచోట 200 నుండి 1000 మంది వరకు ప్రజలు పాల్గొన్నారు. మొత్తం 50,000 మందికి ప్రత్యక్షంగా ప్రచారం అందించాము. పరోక్షంగా బస్సు ప్రయాణించిన ప్రాంతాల్లో స్లోగన్సు పాటల ద్వారా, పత్రికలు, కరపత్రాల ద్వారా ప్రచారం వెళ్ళింది. లక్ష కరపత్రాలు 5000 పోస్టర్లుతో ప్రచారం జరిగింది.

– స్త్రీలు పురుషులు, విద్యార్ధులు, మేదావులు, రాజకీయ నాయకులు అన్ని ప్రజసంఘాల నుండి అపూర్వ స్పందన లభించింది. ప్రతి సభలో మా వూరికి మద్యం వద్దని చేయిఎత్తి నినదించారు. ఒక సామాజిక కార్యక్రమంగా ప్రజలు స్వీకరించిన వాతావరణం కనిపించింది.

– 28న, ముగింపు సభకు ఆహ్వానించిన వారందరు హాజరు కావడం మరింత ప్రభావం పడింది. బహిరంగసభలో 2000 మంది పాల్గొన్నారు. భారీవర్షం కురుస్తున్న మాట్లాడేది వింటాం అంటూ కుర్జీలు తలపైన పెట్టుకుని గంటకు పైగా నిల్చున్నారు. మహిళల్లో సమస్య ఎంత ఉందో పట్టుదలతో కనపర్చారు.

ఐద్వా ఆలిండియా కార్యదర్శి జగ్మతి సంగ్వాన్, ప్రొఫెసర్ వసంతా కన్నాభిరాన్, మేధావులు, ప్రొఫెసర్‌లు, మహిళా సంఘాల నాయకులు మరియు ఐద్వా 10 జిల్లాల కార్యదర్శులు ప్రసంగించారు.

ఈ బస్సుజాతా ఐద్వా పోరాటాలకు ఒక మైలురాయి వంటింది.

✦

# బతికితే నీలా బతకాలి..!



సోదరీ ! మలాలా !
నీ స్వరం భాస్వరమై..
దురహంకారంపై..
నీ ధిక్కారం నిప్పుకణికై
రగిలించెనిదిగో..
కోటానుకోట్ల బాలికల
ఆవేదనాశ్రువులను అగ్నిజ్వాలల్లా
నీ గుండెమంట నీదేకాదు.. మా అందరిదీ..
మాలో రగిలే సెగలను
లోలోపలే చల్లార్చుకుంటూ..
ఆంక్షల పరదాల మాటున
తలవంచుకు సాగడమో..
తనువు చాలించడమో..
అనుకుంటున్న మాలో చైతన్యాన్ని రగిల్చావు
జీవితమంటే అంతులేని పోరాటం..
నీ జీవితసారం.. మాకు నేర్పినపాఠం
కత్తుల బోనులోనైనా
కీచకులు మసలే జనారణ్యంలోనైనా
బతికితే మలాలా..
బతకాలి నీలా...

**వడ్లమూడి పద్మావతి**

(నేను మలాలా పుస్తకాన్ని వేలాది అమ్మాయిలు ఆవిష్కరించిన సందర్భంలో ఉత్తేజితురాలినై రాసిన కవిత)

---

## జోహార్లు



## - కల్బురి

కేంద్ర సాహిత్య అకాడమి అవార్డు గ్రహీత, ప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు, వీరశైవ వచన వాఙ్మయ పండితుడు, హంపీ విశ్వవిద్యాలయ మాజీ కులపతి, హేతువాది **డాక్టర్ ఎం.ఎం. కల్బురి**ని కర్నాటకలోని ధార్వాడ్‌లో ఆయన ఇంట్లోనే మతోన్మాదులు హత్యగావించారు. ఈ ఏడాది ఫిబ్రవరిలో మహారాష్ట్రలోని కొల్హాపూర్ జిల్లాలో సిపిఐ నాయకుడు హేతువాది గోవింద్ పన్సార్‌ను, హేతువాది నరేంద్ర దబోల్కర్ హత్యలు కూడా ఇదే కోవలో జరిగాయి. యనభైయేళ్ల వ్యక్తిని, వయస్సులోనే కాదు జ్ఞానంలోనూ వృద్ధుడైన వ్యక్తిని జీవితాంతం పరిశోధనకు, శాస్త్రీయదృష్టికి, సామాజిక సంస్కరణలకు అంకితమైన మనిషిని మతోన్మాదుల దాడిచేసి హత్యగావించటాన్ని మానవి తీవ్రంగా ఖండిస్తోంది. కేంద్రంలో నరేంద్రమోడి అధికారంలోకి వచ్చాక మతోన్మాద శక్తులు పేట్రేగిపోతున్నారు. తమ భావాలకు, అడ్డుతగిలే వ్యతిరేకించే వారిపై పాశవికంగా దాడులు చేయడం నిత్యకర్తవ్యమవుతోంది. కల్బురి చేసిన నేరమల్లా మూఢనమ్మకాలకు వ్యతిరేకంగా రచనలు చేయడం, ప్రసంగాలు చేయడం. ఇది మతోన్మాద సంస్థలకు రుచించలేదు. తమ వాదనలతో సమాధానం చెప్పేబదులు కల్బురిని భౌతికంగా నిర్మూలించి ఫాసిస్టు సంస్కృతిని పాదుకొల్పారు.

తమ భావాలతో గిట్టని వారిని ఉన్మాదులు యధేచ్ఛగా హత్యలు చేస్తున్నా కేంద్ర రాష్ట్రప్రభుత్వాలు నిందితులను శిక్షించకపోగా ప్రోత్రహిస్తోంది. చాపకింద నీరె కదాఅని మేల్కొనకపోతే ముంచుతుంది. విమర్శనా స్వేచ్ఛను, భావప్రకటనా స్వేచ్ఛను మిగుల్చుకోకపోతే మన ఉనికే మిగలదు. భారత రాజ్యాంగం ప్రతి పౌరునికీ వాక్ స్వాతంత్ర్యం, అభిప్రాయాలు వ్యక్తీకరించే స్వేచ్ఛ కల్గించింది. కలాన్ని, గళాన్ని అణచి వేసే మతోన్మాద చర్యలను ప్రజాస్వామ్య అభ్యుదయవాదులూ, మేధావులు ఖండించాలి. కల్బురి, దబోల్కర్, గోవింద్ పన్సారీలను కాపాడుకుందాం.

**శ్రీ కల్బుర్గికి మానవి జోహార్లర్పిస్తోంది....**

# మట్టి వినాయకులను పూజిద్దాం ! పర్యావరణాన్ని రక్షిద్దాం !



ప్రతి సంవత్సరం భాద్రపదమాసం వస్తే వినాయకుడిని పూజించడం సర్వత్రా సామాన్యం. మన పూజలు, అర్చనలు, మానవాళి క్షేమానికి, సంక్షేమానికి ఉపయోగపడాలి. ఈ సమయంలో మన ఆలోచనలు విజ్ఞానదాయకంగా ఉండాలని జనవిజ్ఞానవేదిక ప్రజలను సవినయంగా కోరుతుంది. సాధారణంగా మనం విగ్రహాలుగా పెడుతున్న వినాయక ప్రతిమలను ప్లాస్టర్ ఆఫ్ పారిస్ ఇనుము ప్రమాదకర రసాయనాలతో కూడిన రంగులను వాడుతున్నాం. పోటీలుపడి ఎత్తు పెంచుతూ కళ్ళు చెదిరే రంగులు వాడుతున్నాం. మనం నిమజ్జనం చేసే వినాయక విగ్రహాల వలన నీటి కాలుష్యం పెరిగి, పూడిక సమస్య ఏర్పడి పర్యావరణ సమతుల్యత దెబ్బతింటున్నది. అనేక జలచరాలు నాశనం అవుతున్నాయి. ప్లాస్టర్ ఆఫ్ పారిస్ మట్టిలో కలిసిపోదు. దీని మూలంగా భూసారం దెబ్బతింటుంది. అనేక వ్యాధులు సంక్రమిస్తాయి. అణుభారం ఎక్కువున్న కాడ్మియం, పాదరసం మరియు జింక్ మొదలైన వాటిని రంగులుగా ఉపయోగించడం వల్ల చర్మ, అలర్జీ, గ్రహణశక్తి, న్యూమోనియ, ఎముకల బలహీనత, కిడ్నీ సంబంధ వ్యాధులు వస్తాయి. పిల్లల మానసిక ఎదుగుదలపై కూడా ఈ రసాయనాల ప్రభావం అధికంగా వుంటుంది.

అందుల్లనే "ప్రకృతి నుండి ప్రకృతిలోకి" అనే చక్రియ ధర్మాన్ని ఆచరించి చెఱువులలోని పాటిమన్నునుపయోగించి ప్రకృతి సిద్ధరంగులను వాడి వినాయక ప్రతిమలను తయారు చేద్దాం. వాటిని మాత్రమే చెఱువుల్లో నిమజ్జనం చేద్దాం. గోవా ప్రభుత్వంలాగా ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తో తయారుచేసే విగ్రహాలను నిషేదించాలని తద్వారా చేతివృత్తి కళాకారులకు ఉపాధి అవకాశాలు కల్పించాలని జనవిజ్ఞాన వేదిక కోరుకుంటుంది. 2008 సం॥లో బి.బి.సి 2010 సం॥లో విలర్‌పూల్ డైలీ తమ నివేదికల్లో విగ్రహాల నిమజ్జనం వల్ల కాలుష్యం పెరుగుతున్నదని నివేదించాయి. మనం ఒకప్పుడు 21 రకాల పత్రిని తెచ్చి పూజించేవాళ్ళం. ఇప్పుడు ఆపరిస్థితి లేదు. అందుకే మనింటి పరిసరాలలో పత్రికి సంబంధించిన మొక్కలునాటి పర్యావరణం కాపాడటానికి సహకరిద్దాం. అసలే వర్షాలు లేక నీటి ఇబ్బందులున్న సమయంలో విగ్రహాలను ఉన్న నీటివనరుల్లో నిమజ్జనం చేస్తే యింకా తీవ్ర నీటి సమస్యను కూడా ఎదుర్కొవలసివస్తుంది.

### అందుకే ఇలా చేద్దామా !

**(1)** పత్రికి ఉపయోగించే మొక్కలు మన పరిసరాల్లో పెంచుదాం. **(2)** బంకమన్ను వరిగడ్డి, జనపనార, వెదురు మాత్రమే ఉపయోగించి పెద్దవిగ్రహాలను ఏర్పాటుచేద్దాం. **(3)** భూమిలో కలవని వ్యర్థాలు చెఱువులు, నదులు, సరస్సుల్లో కలవకుండా చూద్దాం. **(4)** సాంప్రదాయ పద్ధతుల్లో మట్టి, పిండి, విగ్రహాలను చేసుకుని ఎవరింట్లో వాళ్ళే పెట్టుకుందాం, పూజిద్దాం. **(5)** ఆంధ్రప్రదేశ్ కాలుష్య నివారణా మండలి సూచించిన నియమాలు పాటిద్దాం. **(6)** లౌడ్ స్పీకర్ల వినియోగాన్ని నియంత్రిద్దాం. **(7)** మన ప్రకృతి వనరులు పరిరక్షించుకొని – పర్యావరణ పరిరక్షణలో భాగస్వాములవుదాం.

**– జనవిజ్ఞాన వేదిక**

---

# అలహాబాద్ హైకోర్టు సంచలన తీర్పు...

## గవర్నమెంట్ ఉద్యోగులు, ప్రజాప్రతినిధులు పిల్లలు గవర్నమెంట్ స్కూళ్ళకే...!!

మంత్రులు, శాసన సభ్యులు, పార్లమెంటు సభ్యులు, సర్పంచులు, కౌన్సిలర్లు, ఎంపి.టి.సి. జడ్.పి.టి.సి.ఎం.పి.పిలు, జడ్.పి.పి.లు, అధికారులు టీచర్లు పిల్లల్ని సర్కార్ స్కూళ్లకే పంపాలని అలహాబాద్ హైకోర్టు సంచలన తీర్పు ఇచ్చింది. ఇది ఒక చారిత్రాత్మకమై తీర్పు.

ఇలా చేస్తే... నాయకుల పిల్లలు ఇక్కడ చదువుతుంటే టీచర్లు సక్రమంగా స్కూళ్లకు వస్తారు. సక్రమంగా చదువులు చెబుతారు. అన్ని సౌకర్యాలు సమకూరుతాయి. ప్రవేట్ స్కూళ్ల గ్లామర్ ఆటోమాటిక్‌గా తగ్గిపోతుంది. ఈ మేరకు రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి ఆదేశాలు జారీ చేసింది. ఇలాగైతే తప్ప వారికి బాధ్యత తెలియదని, అప్పుడే పాఠశాలల్లో సౌకర్యాలు పెంచటానికి, వసతులు కల్పించటానికి దృష్టి పెట్టరనేది కోర్టు అభిప్రాయం. ఆరు నెలల్లో ఈ మేరకు చర్యలు తీసుకోవాలని, వచ్చే విద్యా సంవత్సరం నుంచి ఇది అమలు కావాలని కోర్టు చెప్పింది. ఆరు నెలల తరువాత ఏమేం చర్యలు తీసుకున్నారో కూడా ఒక నివేదిక సమర్పించాలని కూడా ఆదేశించింది. కావున వచ్చే సంవత్సరం నుండి ఉత్తర ప్రదేశ్ గవర్నమెంట్ ఉద్యోగులు, ప్రజాప్రతినిధులు తమ పిల్లల్ని గవర్నమెంట్ స్కూళ్లకే. ఈ విధానం దేశం అంతా అమలు చేస్తే బావుంటుంది కాదూ....!

# ఉద్యమాల బాటలో

## మద్యంపై

2015-16 సంవత్సరానికి కొత్త మద్యం విధానాన్ని ప్రకటించింది తెలుగు దేశం ప్రభుత్వం. ఈ విధానంలో పాకెట్‌లలో సారాని గుర్తు చేస్తూ టెట్రాపాక్ విధానాన్ని ప్రకటించింది. మౌలిక సదుపాయాలు లేకపోయినా మద్యం అన్ని చోట్లా అందుబాటులో ఉండే విధంగా షాపింగ్ మాల్స్‌లో సైతం చీప్‌లిక్కర్‌తో సహా అన్ని రకాల మద్యాన్ని అమ్మడానికి పూనుకుంది. నరమాంసానికి


ప్రకాశం



విజయవాడ

అలవాటుపడ్డ పులి సాధారణ జంతువులను తిననట్లే మద్యం ఆదాయానికి రుచిమరిగిన ప్రభుత్వం ప్రజల రక్తాన్ని పీల్చి పాలనను నిర్వహించనున్నది. మద్యాన్ని నియంత్రించేందుకు అవసరమైన విధి విధానాలను రూపొందించాలని, 'డ్రై డేస్'ను ప్రకటించాలని, మద్యం వలన కలిగే దుష్ఫలితాలను విస్తృతంగా ప్రచారం చేసేందుకు నిధులను కేటాయించాలని మహిళా సంఘం డిమాండ్ చేస్తుంది.

విధాన ప్రకటనలో 10శాతం ఆదాయం పెంచే విధంగా పాలసీని రూపొందించినట్లు ప్రకటించటం ప్రభుత్వం ప్రజా వ్యతిరేక ధోరణిని బహిర్గతం చేసింది. మహిళలపై పెరుగుతున్న అత్యాచారాలకు, కుటుంబ హింసకు, పిల్లల నిరాదరణకు, ప్రమాదాలకు, నేరాల పెరుగుదలకు మద్యం ఒక ప్రధాన కారణంగా పోలీసు మరియు ఇతర నివేదికలు వెల్లడిచేస్తున్నాయి. ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ప్రవేశపెట్టిన నూతన ఎక్సైజ్ పాలసీని వ్యతిరేకిస్తూ రాష్ట్ర వ్యాప్తంగా అన్ని జిల్లాల్లోను జివో దగ్ధం కార్యక్రమాలు జరిపింది. తూర్పుగోదావరి జిల్లాలో కలెక్టర్‌కు, ఎక్సైజ్ కమిషనర్‌కు మెమోరాండమ ఇవ్వడమైనది. పశ్చిమగోదావరిలో 2డివిజన్స్‌లో ధర్నాలు, 11చోట్ల సదస్సులు జరిగాయి. 5 కేంద్రాల్లో మెమోరాండమ్ ఇవ్వడం, 9చోట్ల జివొ దగ్ధం జరిగింది. జూన్ 29వ తేదిన మద్యం షాపుల వేలం పాటల సందర్భంగా అన్ని జిల్లా కలెక్టరేట్‌ల వద్ద పికెటింగ్ కార్యక్రమాలు ఐద్వా ఆధ్వర్యంలో జరిగాయి. మహిళలు ఎక్కువ సంఖ్యలో పాల్గొన్నారు.

## వనజాక్షిపై దాడికి వ్యతిరేకంగా


విజయవాడ

ముసునూరు తహశీల్‌దార్ డి. వనజాక్షిపై దాడి చేసిన ఎమ్ఎల్ఏ చింతమనేని ప్రభాకరావును అరెస్టు చేయాలని కోరుతూ విజయవాడలోని న్యూ ఇండియా హొటల్ సెంటరులో వామపక్ష మహిళాసంఘాల అధ్వర్యంలో దిష్టిబొమ్మను దగ్ధం చేయటం జరిగింది.

ఎమ్ఎల్ఏ దిష్టి బొమ్మను దహనం చేశారు. అక్రమ మాఫియాను అడ్డుకునేందుకు నిజాయితీగా విధి నిర్వహణ చేసిన తహశీల్‌దార్ వనజాక్షి గారికి నైతిక మద్దతు ప్రకటిస్తున్నామని, అన్నివిధాలా అండగా వుంటామని తెలియజేసారు. రాష్ట్ర కమిటీ పిలుపుమేరకు విజయవాడ, చిత్తూరు, విశాఖ,అనంతపురం,కర్నూలులో నిరసన కార్యక్రమాలు జరిగాయి.

## మహిళలపై హింస

తిరుపతిలో మహిళా లెక్చరర్‌పై మాజీ భర్త యాసిడ్ దాడి చేశాడు. మైనార్టీ మహిళ అయిన ఆమె సంవత్సరం క్రితం విడాకులు










తీసుకున్నది. ఆమెపై గతంలోనూ భర్త దాడులకు పూనుకున్న ప్రతిసారి పోలీసులకు కంప్లెయింట్ ఇచ్చినప్పటికి పోలీసుల చర్యలు తీసుకోలేదు. ఈ ఘటనపై తిరుపతి ఐద్వా శాఖ నిరసన కార్యక్రమం చేసింది.

తిరుపతిలో మహిళా పోలీస్ స్టేషన్, కౌన్సిలింగ్ సెంటర్‌లో మహిళా బాధితుల్ని వేధిస్తున్న సిబ్బంది చర్యలను వ్యతిరేకిస్తూ ధర్నా జరిపి ఎస్.పి.కి వినతిపత్రం ఇవ్వడమైనది..

విజయవాడలో గత సంవత్సరం అత్యాచారం జరిపి హత్య గావింపబడిన హిమబిందు కేసు జిల్లా కోర్టులో జులైలో తీర్పువెలువడింది. ఈ తీర్పుకై ఎంతోమంది నగర ప్రజలు, సంఘాలు, న్యాయవాదులు ఎదురు చూశారు. అయితే జడ్జిగారు పోలీసులు సరైన సాక్ష్యాలను ప్రవేశపెట్టనందున కేసు కొట్టివేస్తున్నట్లు తీర్పునిచ్చారు. పోలీసుల నిర్లక్ష్య వైఖరిని నిరసిస్తూ ఐద్వా ఆధ్వర్యంలో విజయవాడలోని. సింగ్‌సగర్‌సెంటర్‌లో మానవహారంతో దిష్టిబొమ్మ దగ్ధం చేయడమైనది.

కర్నూలు పట్టణంలో ఏడేళ్ళ పసిపాపపై పొరుగింటిలో నివసిస్తున్న వ్యక్తి అత్యాచారం చేసిన ఘటనపై స్థానికులు దోషని పట్టుకొని పోలీసులకు అప్పగించారు. ఆ పాపను వైద్య చికిత్స నిమిత్తం ఆసుపత్రికి తరలించారు. స్థానిక విద్యార్థి, యువజన మహిళా సంఘాలు ధర్నాలు, రాస్తారోకులు నిర్వహించి నిందితునిపై నిర్భయ చట్టం నమోదుచేసి కఠినంగా శిక్షించాలని ఆందోళనా కార్యక్రమాలు జరిగాయి.

## డ్వాక్రా రుణమాఫీకై

తెలుగుదేశం ప్రభుత్వం ఎన్నికల సందర్భంగా చేసిన వాగ్దానం ప్రకారం డ్వాక్రా రుణమాఫీని అమలు చేయాలనే ప్రధాన డిమాండ్‌తో జులై 30వ తేదీన వామపక్ష మహిళా సంఘాల ఆధ్వర్యంలో విజయవాడలోని తుమ్మలపల్లి క్షేత్రయ్య కళాక్షేత్రంలో రాష్ట్ర సదస్సు 1200మందితో జరిగింది. అన్ని జిల్లాల నుండి డ్వాక్రా మహిళలు పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు. సదస్సు అనంతరం







ముఖ్యమంత్రిని కలిసి వినతిపత్రం ఇవ్వడమైనది. ఈ రాష్ట్ర సదస్సుకు ముందు అన్ని జిల్లాల్లోనూ సర్వేలు, రౌండ్‌టేబుల్ సమావేశాలు జరిగాయి. 51,000కరపత్రాలు వేసి ప్రచారం చేయడమైనది. మండల స్థాయిలో డ్వాక్రా సమస్యలపై ధర్నాలు నిర్వహించి డ్వాక్రా సమన్వయ కమిటీలు వేయడమైనది. నెల్లూరులో మండలస్థాయిలో సదస్సులు నిర్వహించి జిల్లా సదస్సు 250 మందితో నిర్వహించారు. విశాఖరూరల్ మరియు సిటీ కమిటీల ఆధ్వర్యంలో కలెక్టరేట్ వద్ద

ధర్నా, చిత్తూరు జిల్లాలో తహసిల్దార్‌కు వినతిపత్రం ఇవ్వడమైంది. కూనవరంలో 600మందితో ధర్నా జరిగింది. ప్రకాశం, కర్నూలు, చిత్తూరు రౌండ్‌టేబుల్ సమావేశాలు జరిగాయి. ఇసుక క్వారీలను డ్వాక్రా సంఘాలకు కేటాయింపు కొన్ని చోట్ల జరిగింది. రోజుకు 12గంటలు క్వారీలో పనిచేసినా ఇచ్చే కూలీ 150 మాత్రమే. డ్వాక్రా గ్రూపులకు ఇసుక క్వారీల కేటాయింపులకు సంబంధించిన జివొ ప్రకారం మొత్తం ఆదాయంలో 25% గ్రూపులకు ఇవ్వాలి. ఈ విషయమై తూర్పు గోదావరిజిల్లా కోరుమిల్లిలో ధర్నా చేస్తున్న మహిళలను అరెస్టు చేశారు. మొత్తం 4 సెంటర్లలో రౌండ్ టేబుల్ సమావేశాలు, 10 సెంటర్స్‌లో సదస్సులు జరిగాయి.

## నేను మలాలా పుస్తక ఆవిష్కరణ

"తుపాకులు, తూటాలూ కాదు, పుస్తకాలు, కలాలు కావాలి"అని ప్రపంచానికి పిలుపునిచ్చిన మలాలా యూసఫ్‌జెయ్ రచించిన **"I AM MALALA"** అను పుస్తకాన్ని అఖిల భారత ప్రజాతంత్ర మహిళా సంఘం(ఐద్వా) రాష్ట్ర కమిటీ తెలుగులోకి







అనువదించింది. "నేను మలాలా" అను పేరుతో తెలుగులోకి వెలువడిన ఈ పుస్తక ఆవిష్కరణ విజయవాడలోని సిద్దార్థ మహిళా కళాశాలలో 20.8.15న. వినూత్నంగా 2,500మంది విద్యార్థులు మలాలా పుస్తకాన్ని చేతబూని ఆవిష్కరించారు. అత్యంత ఉత్తేజకరమైన వాతావరణంలో దాదాపు మలాలా వయసు విద్యార్థులు పుస్తకాల బ్యాగులతో, పుస్తకంతో "నేను మలాలా, నేను మలాలా"అంటూ నినాదాలతో ఈ పుస్తక ఆవిష్కరణ జరిగింది.




సిద్దార్థ మహిళా కళాశాల ప్రిన్సిపల్ డా।। టి. విజయలక్ష్మి గారి అధ్యక్షతన జరిగిన ఈ పుస్తక ఆవిష్కరణ కార్యక్రమం కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత, ప్రొఫెసర్ కాత్యాయని విద్మహేగారు ముఖ్య అతిథిగా పాల్గొని మలాలా ఈ రోజు వెయ్యి రేకుల పువ్వై ఈ విజయవాడ నగరంలో విచ్చుకున్నదని అన్నారు. చదువుకునే హక్కును పొందేందుకు పోరాడిన మలాలా వలె మీరందరూ కూడా వివక్షతకు వ్యతిరేకంగా పోరాడాలని పిలుపునిచ్చారు.

ఈ కార్యక్రమ రూపకర్త, సినీ డైరెక్టర్ సి. ఉమామహేశ్వరరావు గారు మాట్లాడుతూ నేను మలాలా పుస్తకాన్ని వేల మంది విద్యార్థులు ఆవిష్కరించడం అద్భుతమని, తాలిబన్లకు ఎదుర్కొని ధీరోదాత్తంగా మలాలా నోబెల్ బహుమతి పొంది విజయం సాధించిందని, మన దేశంలో కూడా మతశక్తులు విజృంభించి స్త్రీని అణచివేయడానికి పూనుకుంటుందని దీన్ని మీ తరం వ్యతిరేకించాలని అన్నారు.

సిద్దార్థ కాలేజి విద్యార్థి సాయి లక్ష్మి ఆసక్తి కరంగా పుస్తకాన్ని పరిచయం చేసింది. మలాలా తూటాలను ఎదుర్కొని చదువు అనేది ఆడపిల్లలందరికీ అందాలని ప్రపంచానికి పిలుపునిచ్చిందని చెప్పింది. ఇంకా ఈ సభలో పుస్తకాన్ని తెలుగులోకి అనువదించిన కె. సత్య రంజన్, ఐద్వా ఉపాధ్యక్షులు స్వరూపరాణి,ప్రజాశక్తి సాయితీ సంస్థ ఎడిటర్ ఉషారాణిలు ప్రసంగిస్తూ మన దేశంలో కూడా మత పెద్దలు, రాజకీయ నాయకులు మహిళల్ని అణచివేయడానికి రక రకాల వ్యాఖ్యలు చేస్తున్నారని, కల్పనా చావ్లా, సునీతా విలియమ్స్‌లు అంతరిక్షానికి దూసుకుపోయినట్లే నేటి యువత ముందుండాల్సిన అవసరం ఎంతైనా ఉందని మీరంతా కూడా ఆ దిశగా పయనించాలని పిలుపునిచ్చారు.

నేను మలాలా పుస్తకం పరిచయం కార్యక్రమాలు ప్రకాశం జిల్లాలోని. నాగార్జున కాలేజిలో, శ్రీకాకుళం జిల్లాలోనిడిగ్రీ వుమెన్స్‌కాలేజిలో, నర్సీపట్నం జూనియర్ కాలేజీలోనూ జరిగాయి. వందల సంఖ్యలో విద్యార్థులు పాల్గొన్నారు. గుంటూరులోని కిట్స్ కళాశాలలో 2000మంది విద్యార్థులతో

పుస్తకావిష్కరణ జరిగింది. ఎమ్ఎల్‌సి లక్ష్మణరావు, ఐద్వా కార్యదర్శి రమాదేవి, కాలేజి యాజమాన్యం పాల్గొన్నారు.

### రిషితేశ్వరి ఆత్మహత్యపై

నాగార్జున యూనివర్శిటీ విద్యార్ధిని రిషితేశ్వరి మృతి ఘటనపై జ్యుడిషయల్ విచారణ జరపాలని, ర్యాగింగ్ నిరోధక చట్టం ఉన్నప్పటికీ, చట్టంలో ఉన్నట్లు యాంటీ ర్యాగింగ్ స్క్వాడ్‌ను ఏర్పాటు




చేయాల్సి ఉంది. కానీ ఈ విశ్వ విద్యాలయంలో అటువంటి చర్యలు ఏమీ తీసుకున్న దాఖలాలు లేవు. గతంలోనూ ఎంతో మంది విద్యార్థులు ర్యాగింగ్ భూతానికి బలయ్యారు. ర్యాగింగ్ నిరోధానికి ఎటువంటి చర్యలూ తీసుకోకుండా ఉండటం వల్లనే ఇక్కడ విద్యార్థులు ర్యాగింగ్‌కు పాల్పడ్డారని స్పష్టమవుతుంది. ఈ ఘటనపై గుంటూరు, విజయవాడలలో నిరసన కార్యక్రమాలు జరిగాయి.

### కెప్టెన్ లక్ష్మి సెహగల్ వర్ధంతి

కెప్టెన్ లక్ష్మి సెహగల్ వర్ధంతి సందర్భంగా మహిళలు- మీడియా- హింస అను అంశంపై కాలేజీల్లో సదస్సులు జరపాలని రాష్ట్ర కమిటీ పిలుపు మేరకు అనంతపురం, కర్నూలు, విజయవాడ,




గుంటూరు, విశాఖ జిల్లాలో జరిగాయి. విద్యార్థులకు చైతన్యం కల్పించేందుకు చేపట్టిన ఈ కార్యక్రమాల్లో విద్యార్థులు పెద్ద సంఖ్యలో పాల్గొని వారు కూడా వేదికలపై తమ అభిప్రాయాలను వ్యక్తం చేశారు. కాలేజి యాజమాన్యాలు చేపట్టవలసిన చర్యలు మరియు




ప్రభుత్వం తీసుకోవలసిన చర్యలపై విస్తృతంగా చర్యలు జరిపారు.

### మున్సిపల్ కార్మికుల సమ్మె




రాష్ట్రంలోని మున్సిపల్ కార్మికులు తమ వేతనాలు పెంచాలనే ప్రధాన డిమాండ్‌తో నెలరోజులుపాటు సమ్మెచేశారు. వారికి అన్ని మున్సిపాలిటీల్లోను ఐద్వా మద్దతు తెలియజేస్తూ వారితోపాటు నిరసన కార్యక్రమాల్లో పాల్గొన్నారు.

### ఆర్. సూర్యకాంతంగారి సంస్మరణ సభ

పశ్చిమగోదావరి జిల్లా భీమవరం డివిజన్ ఐద్వా సీనియర్ నాయకురాలు రుద్రరాజు సూర్యకాంతం గారు అనారోగ్యంతో మరణించారు. ఆమె భీమవరం డివిజన్ కార్యదర్శిగా పనిచేశారు. ఆమె సంస్మరణ సభ భీమవరంలో జరిగింది. ఐద్వా సీనియర్ నాయకురాలు అల్లూరి మన్మోహిని, డి. రమాదేవి ఇంకా జిల్లా నాయకులు పాల్గొన్నారు.



# 2500 మంది విద్యార్థులచే
# విజయవాడలో ఆవిష్కరింపబడిన
# నేను మలాలా పుస్తకం



*Printed & Published by* Mallu Swarajyam, *Published a*t AIDWA State Office, Kalpana Prints Road, Krishna Lanka, Vijayawada. Ph : 9490098620. *Printed at* Prajasakti Daily Printing Press, Krishna Nagar, Tadepalli (M), Guntur Dt. Editor : D. Rama Devi



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMVOLA148 |
| పుస్తకం పేరు | చైతన్య మానవి |
| తారీఖు | 21/08/2023 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | No |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Nandini |
| పేజీలు విడదీసినది | Nandini |
| స్కాన్ చేసినది | Sandhya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | Good |